ఆధునిక భరతఖండ గ్రంథములు

# భరతఖండముపైని ఆర్థికవిజయము

లేక

# బ్రిటిషుసామ్రాజ్యము (లిమిటెడ్)


గ్రంథకర్త

డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు

అనువాదకులు

గరిమెళ్ల సత్యనారాయణగారు బి.ఎ.



**1938**






హిందూస్థాన్ పబ్లిషింగ్ కంపెనీ, లిమిటెడ్.

[వెల రు. **0-12-0**

# విషయసూచిక

# గ్రంథకర్త పీఠిక



1929 లో నేను ఒక పెద్దవ్యాసమును వ్రాసితిని. ఆ వ్యాసముయొక్క ప్రతిఫలమే ఈ గ్రంథము. కనుకనే ఈ గ్రంథమునందు పలుతావులలో ఆ సంవత్సరము ఉదహరింపబడుచు వచ్చినది. "కాంగ్రెస్ మేన్స్‌మాన్యువలు" అను ఒక గ్రంథమును తయారుచేయించవలసినదిగా 1929 లో నేను అఖిలభారతకాంగ్రెస్ కమిటీవారిని తొందరచేసితిని. ఆ గ్రంథమును నన్నే ప్రారంభింపవలసినదిగా వారు కోరిరి. ఈ గ్రంథము ఆ మహాగ్రంథముయొక్క ప్రథమాధ్యాయమగునని నేను ఊహించి వ్రాసితిని. అసలు గ్రంథము తాలూకు 27 అధ్యాయములను నేను చాలాకాలము క్రిందటనే ముగించినను ఆ గ్రంథమునకు ప్రచురణావస్థ పట్టలేదు. అందుకైన కారణములను మనమిక్కడ చెప్పనవసరములేదు. "ది ఇకనామిక్కు-కాంక్వెస్టు ఆఫ్ ఇండియా" లేక "భరతఖండముపైని ఆర్థికవిజయము" అను ఈ భాగము తనంతటతానే సమగ్రమైన ఒకశాఖ. ఆ ఆర్థికవిజయము నందలి అనేకనూతనాంశములను ఇందు దర్శిలాను చేర్చుటవల్ల ఇది ఇప్పటి పరిస్థితుల కనుగుణముగ నున్నట్లు మార్చబడినది. ఇటువంటి మహావిషయమును సంపూర్ణముగ సంశోధించి తయారుచేయుట చాలాకష్టము, ఇందలి లోపములను నేను బాగా యెఱు

గుదును. అయినను కరపత్రమువంటి ఈ చిన్నిగ్రంథమును పఠించెడి పాఠకమండలుల (Study circles) కు ఈ గ్రంథమునకు ఇంతకంటె సంపూర్ణతరమైన రూపము నిచ్చుటకై యెటువంటి అంశములు అంకెలు రీతులు సేకరించవలసియున్నదో తెలియజేయగలదను ఆశతో ఈ గ్రంథముయొక్క వ్రాతపుటలను ఈ ప్రకాశకులకు నేను ఇచ్చుటకు సాహసించితిని. మరియొక విషయమును కూడ నే నిచ్చట మరుగుపరచనవసరములేదు. హిందూస్థాన్ పబ్లిషింగుకంపెనీ వారు తమ ప్రచురణముల మూలముగా లోకమున కఖండసేవచేయుచున్నారు. ప్రజలలో విజ్ఞానమును విరజల్లు మహాకళను స్వంతమునకు ఆదాయమార్గము కాకుండా నెరవేర్చుటకై కుతూహలాయత్తచిత్తులగు దేశహితైషు లందరకును ఈ ప్రయత్నము సంస్తుతిపాత్రమును సహాయయోగ్యమునునై చెలువారుచున్నది. వీరికి నా ద్వితీయప్రచురణమును కూడ నందచేయవలెనను తలంపుతో ఈ గ్రంథమును అర్పించుచున్నాను.

మచిలీపట్టణము
20–7–1937

భో. పట్టాభి సీతారామయ్య

# ప్రకాశకుల మున్నుడి.

ఈ గ్రంథమును ప్రకటించు సందర్భమున దీనిని గూర్చియు మా యితర ప్రచురణములను గూర్చియు కొన్ని విషయములను ప్రజాబాహుళ్యమునకు తెలుపవలసియున్నది. మేమీకంపెనీని స్థాపించు ముందర శ్రీయుత డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు మాకెంతయో ప్రోత్సాహము నొసంగినారు. మరియు తాము మాకప్పుడొసంగిన వాగ్దానమున కనువగురీతిని మొట్టమొదట "constitutions of the world" (ప్రపంచ రాజ్యాంగ తంత్రములు) అనుగ్రంథమును ఇప్పుడు "The Economic conquest of India" (హిందూదేశముపైని ఆర్థికవిజయము అను నీ గ్రంథమును ఉచితముగా ప్రసాదించినారు. అఖిలభారత జాతీయ మహాసభకు "కాంగ్రెసుచరిత్ర"నువ్రాసి భక్తిపూర్వకమగు దక్షణగా సమర్పించుకొనిన ఉదారహృదయునికిది యెంతయు సహజగుణమే. వ్యాసములను గ్రంథములను వ్రాసి వానికి కట్నములు ఖరాకండీచేసుకొనుట, వానివల్ల ప్రకాశకులకు వచ్చేరాబడులనుపట్టి తమ సాంవత్సరిక రుసుములను నిర్ణయించుకొనుట, ఈ విధముగా ప్రజలకుకావలసిన విజ్ఞానమును నడిబజారులలో అమ్ముకొనుటయన్న తమకెంతయో యేవగింపు కలిగించునని బాహాటముగా చాటుటకే శ్రీ పట్టాభి సీతారామయ్యగారు తేపతేపకును నిట్టి యుద్గ్రంథములను వ్రాసి ప్రకాశకులకు ఉచితముగానొసగి విజ్ఞానప్రచారమునకు మొడతెగని దోహదముచేయుచున్నారు. ఈకారణమువల్ల

ఈ గ్రంథమును ప్రకటించుట మాకు చాలాసులభసాధ్యమైనది. విద్యాధికులు ప్రజలకొసంగు విజ్ఞానము వాయుప్రసారము జలప్రవాహమువలె నిరాపేక్షముగ నుండవలెననియు, గ్రంథకర్తలు—కనీసము అన్నములేక మాడిపోకుండా ఉన్నవారైనను—తమరచనలవలన లాభములు కూడబెట్టుకొందమని కోరుకొనుజాతికి చెందకూడదనియు ఒక శుభప్రదసిద్ధాంతమునకీవిధముగా ఆచరణరూపముగా పునాదులు వైచిన ఈ గ్రంథకర్తకు మామనఃపూర్వకమైన కృతజ్ఞతను ప్రకటించుచున్నాము.

ఎంచుకొనిన విషయమునందేమి విశదీకరించినరీతియందేమి ఈ గ్రంథము స్వతసిద్ధమగు సహజ ధోరణితో విరాజిల్లుచున్నది. భరతఖండము బ్రిటనుకు చేయుచున్న ఆర్థికదాస్యము యొక్క ఈ విశిష్టస్వరూపమును ఇట్టి నూతనరీతులతో తేటపరచుటకు యింతవరకే గ్రంథకర్తలును పూనుకొననేలేదు. 1929 నుండియు భరతఖండమునంతటను గ్రంథకర్తతిరిగి, మన దాస్యమునందలి యీవిశిష్టవైచిత్ర్యమునుగూర్చియే యుపన్యాసించుచుండెను. లక్షలకొలది సభ్యులు ఈవిషయముల తెలుసుకొనుచు ఉత్తేజితులగుచుండిరి. ఇదివరకే గ్రంథరూపమున నున్న ఈ భావములకు క్రొత్తవానినిచేర్చి సమకాలమునకు సరిపడునట్లుగా మిత్రులకోరికచొప్పున మార్చి కేవలము శ్రోతలేగాక పాఠకులుగూడ ఆనందించునట్లు గ్రంథకర్త ప్రసాదించినారు.

రాజమండ్రి.
5–1–38

హిం. ప. కంపెనీ (లిమిటెడు).

# భరతఖండముపైని ఆర్థికవిజయము

లేక

# బ్రిటిషు సామ్రాజ్యము (లిమిటెడ్)



## 1 వ అధ్యాయము

భరతఖండములో బ్రిటనుయొక్క ఆర్థికనీతిసూత్రము

### సింహావలోకనము



హిందూదేశము పైని ఇంగ్లాండు పొందిన విజయము ప్రపంచమహాచరిత్రము నందలి అత్యద్భుతాధ్యాయములలో నొకటి. దాని ప్రారంభము ఫలానాచోటయని సరిగా నిర్ణయించుటకు యెవ్వరికిని సాధ్యముకాదు. అయినను యెవ్వరికినీ తెలియనట్టి కొన్ని కృత్రిమమార్గముల ద్వారా కూడా ఈసామ్రాజ్యమును ఈ దేశములో స్థిరపరచుటకై ఈ విజయమును వారు ఆధారముగా చేసుకొని యెట్టి నిర్ణీతసిద్ధాంతముల నవలంబించినారో వానిని మనము నేడు గ్రుచ్చియెత్తి చూపగలుగుచున్నాము. ప్రస్తుత ఆంగ్లపరిపాలకుల పూర్వికులకు ఈ భరతఖండమును జయించు సందర్భమున ఒక స్పష్టతరమైన తంత్రమును దీర్ఘాలోచనపై నిశ్చయించుకొనిన ఒక కార్యక్రమ

ప్రణాళికయు ఉండెను. * తినుటకు అన్నమును కట్టుకొనుటకు బట్టయును లేక నానా యీడుపోతలును పడి, ఫ్రెంచి, ఇటాలియను, పోర్చుగీసు, డచ్చి, స్పానిషు మొదలగు ఇతర ఐరోపియను జాతులవలె, ఆంగ్లేయులును జీవనోపాధిమార్గములను వెదకుకొనుటకై హిందూదేశము వచ్చి ఒకానొకనాడు తాము దేశమున కంతటికిని సర్వాధికారులైనట్లు తెలుసుకొనిరి. అయితే ఇది యెంతమాత్రమును తలవని తలంపు కాదు; వారు ఈ యెత్తునే వేసుకొనిరి. ఈ యెత్తే పారినది. ఇది సరీగా ఫలానా తేదీనాడని చెప్పలేము కాని ప్రాతచరిత్ర జాగ్రతగా తిరుగవేసినచో దీనిని కనుగొనుటకు తగిన ఆధారములు దొరకగలవు.

300 సంవత్సరముల క్రిందట డచ్చివారు మిరియాల ఖరీదు పౌను 1 కి 3 షిల్లింగుల నుండి 8 షిల్లింగులకు పెంచుట, ఇందుపైని వాసనద్రవ్యముల వ్యాపారమునకై యెలిజబెత్తు రాణి ఈస్టు ఇండియా కంపెనీకి వర్తకము చేసుకొనుటకై చార్టరు (అధికారము) నిచ్చుట, ఆదర్మిలాను జరిగిన విషయములు, అన్నీ మనము కనిపెట్టవలెను. ఆంగ్లేయులు వాసన

---

* ఈ సిద్ధాంతము క్రొత్తదానివలె పాఠకులకు కనిపించవచ్చును. కాని భాయీపరమానందు (న్యూఢిల్లీ) గారు వ్రాసిన "సంపూర్ణస్వాతంత్ర్యమునకై మన ప్రప్రథమప్రయత్నములు" (Our Earliest attempts at Independence) అను గ్రంథమును పఠించినచో ఇదిసరియైనదనుభావము స్ఫురింపచక తప్పదు.

ద్రవ్యము లెచ్చట దొరకునాయని వెతకుటకై బయలుదేరి, వానిని హిందూదేశములో కనుగొని, వానిని మరికొన్ని ఇండి యను పదార్థములను తాము తెచ్చిన కత్తులు కత్తెరలు వెడ లైన గుడ్డలు మొదలగు వానిని ఇచ్చి మార్చుకొనిరి. ఇందు వల్ల వారు మొట్టమొదట వర్తకులుగా ప్రవేశించిరనియు, ఫ్యాక్టరీలు కట్టుకొనిరనియు, పరిపాలకులుగా మారుచుండి రనియు, 1757 లో ప్లాసి యుద్ధమైన తరువాత పరిపాలకులుగా తయారైనారనియు, మరియొక శతాబ్దము తరువాత ఈ ఈస్టు ఇండియా వర్తక కంపెనీ (లిమిటెడు) చేతులలో నుంచి ఈ పరిపాలనా చక్రము రాణీగారి చేతులలోనికి మారినదనియు, 1877 లో ఆమెకు ఇండియా చక్రవర్తిని బిరుదము నిచ్చి రనియు, 1857-77 మధ్యనున్న ఇరవై యేళ్ళలోను వారి బల గములను కట్టుదిట్టములను పూర్తి చేసుకొనుటయే కాక హిం దూదేశమును రాజకీయమునకు తోడుగా ఆర్థికముగా కూడా బ్రిటిషుసామ్రాజ్యపాశములతో పూర్తిగా బంధించి వైచి రనియు స్పష్టమగుచున్నది.

పరిశ్రామిక (ఇండస్ట్రియలు) జాతుల చరిత్రముల నన్ని టిని మనము పరిశీలించితిమేని వారి జాతీయజీవనమంతయు ఆర్థికసమస్యలచుట్టును పెనవైచుకొని యుండునని తెలియ గలదు. నానాజాతుల సమితినే మనము తీసుకొందము. దాని ప్రధానసమస్య యెల్లయు నేమి? ప్రపంచదేశముల వర్తకపు యెగుమతి దిగుమతి సుంకములను యే రీతిని సర్ది పెట్టినయెడల

యే జాతియొక్క హక్కులకు లాభములకును నష్టమురాని తీరున ప్రపంచజాతుల అవసరములన్నియు తీరగలవను నాలోచనయే దానిని తల్లడిల్ల జేయుచున్నది. కాని ఇది యిరువయ్యో శతాబ్దమునాటి పరిస్థితి. ఇది నిజముగా ఐరోపామహాయుద్ధానంతరమున వాణిజ్యపరిశ్రమా చక్రములలో సంభవించిన పరిణామములయొక్క ఫలితము. ఈ పరిణామమునందు ఆర్థిక చక్రములో అమెరికా అగ్రస్థానము వహించి సూత్రధారి యగుచున్నది. ఇంతవరకు ఐరోపాఖండమే ప్రాధాన్యమును వహించి రాజకీయసూత్రములను తన ఇష్టమువచ్చినట్లు నడిపించుచుండెను గాని, ఇప్పుడు అమెరికాఖండము ఐరోపాను, దాని రాజకీయపరిణామములను వెనుకకు నెట్టివేసి తానును తన ఆర్థికపరిణామమును అగ్రస్థానమునకు వచ్చివవి.

మనము ప్రస్తుతం అత్యావశ్యముగా ఆలోచింపవలసినది అంతగా ఈ సమస్యకాదు. పాశ్చాత్యదేశములు గత 150 సంవత్సరములలో అవలంబించిన పారిశ్రామికవ్యవహారనీతి సూత్రముల భారము తడిసిమోపెడై ప్రపంచమునకు భరింపదుస్సాధ్యమైనది. అందువలన ఉద్భవించిన సమస్యలు ఒకటిలో ఒకటి పెనగొని అల్లుకొనిపోయి పరిష్కారమునకు దుస్సాధ్యమైనవి. మన భరతఖండము కూడ నేడు తనజాతీయతా సంసిద్ధికొరకై పాశ్చాత్యదేశము లవలంబించిన మార్గములనే త్రొక్కజూచిన యెడల ఇట్టి అపాయములే రాగలవు. కనుక బ్రిటను హిందూదేశము పట్ల నవలంబించిన ఈ ఆర్థిక

సూత్రమును విమర్శించు సందర్భముననే ఈ అపాయముల స్వభావమును కూడ గుర్తించి మనమెట్లు జాగ్రతపడవలెనో తెలుసుకొనుట యెంతయు సమంజసమైన కార్యము.

గతశతాబ్దమధ్యమున హిందూదేశములో ఈస్టుఇండియాకంపెనీ, లిమిటెడు, యొక్క పరిపాలనమంతరించినమాట అక్షరములలోమాత్రము నిజమైయెను, వాణిజ్యపరిశ్రమాది ఆర్థిక వ్యవహారములలో మాత్రమెట్టిమార్పును కలుగలేదు. ఈస్టుఇండియా కంపెనీ లిమిటెడు పరిపాలనముపోయి, బ్రిటిషు సామ్రాజ్యము లిమిటెడు లేక అన్ లిమిటెడుయొక్క పరిపాలనము అవతరించినదనుట స్పష్టమైన విషయము. దీనిని కాదని యెట్టి వాదనవల్లను యెవ్వరును సమర్థింపజాలరు. ఉద్యోగస్థులు, మేజస్ట్రేటులు, జడ్జీలవల్ల హిందూదేశము చాలా బాధపడుచున్నట్లగుపించినను, బ్యాంకరులు, నౌకల కంపెనీలవారు, రెయిల్వే కంపెనీలవారు, పరిశ్రమలపెత్తందారులు, వర్తకులు, ఎగుమతులుచేసేవారు దిగుమతులుచేసేవారలవల్ల అది పడుచున్నబాధకంటె మొదటిది చాలా తక్కువ. అనగా మనమనుభవించుచున్న రాజకీయ దాస్యము కంటెకూడ ఆర్థికదాస్యము మరీపెద్దది. ఈసంగతి మనము బాగుగా గ్రహించినయెడల హిందూదేశమునందుగల రాజ్యాంగ తంత్రమెల్లయు బ్రిటిషువారికి ఇచ్చట నున్నవాణిజ్యపు గుత్తలనెల్ల సంరక్షించుటకై మాత్రమే నిర్మింపబడినదనియు, రాజకీయాధికారమను ముసుగును కాస్తతీయగానే

ఈఆర్థికదాస్యముయొక్క నిజరూపము స్పష్టముగా బయలు పడుననియు మనము తెలుసుకొనగలము.

మనము భారతీయులము. మనకు వర్ణాశ్రమాచారధర్మ దృష్టితో ప్రపంచమును తిలకించుట అలవాటయినది. ఒక్కొక్క వృత్తిని ఒక్కొక్కతరగతి లేక జాతియొక్క భుక్తముగా మనము భావింతుము. మనవంటివారికి బ్రిటిషు పరిపాలకుడు ఒక వ్యాపారముచేసేవాడనిన్నీ, వ్యాపారముచేసుకొనే వాడొకడు ప్రధానమంత్రి అనిన్నీ, ఒక లార్డు చీఫు జస్టిను ఒకవర్తకపు కంపెనీలో మేనేజింగు డైరక్టరగుననిన్నీ వింటే ఆశ్చర్యమగును. కాని ఇంగ్లాండులో ఇట్టిసంగతులే జరుగుచున్నవి. ఒకప్పుడు కింగ్సు కౌన్సిలు ( కే. సి. ) గాను ఇంగ్లాండుకు లార్డు చీఫు జస్టిసుగాను తరువాత హిందూదేశమునకు రాజప్రతినిధిగాను ఉండిన రీడింగుప్రభువు ఈపనులన్నీ ముగించుకొని ఇంగ్లాండుకుపోయి దక్షిణ ఆఫ్రికా మైనింగుసిండికేటుకు సంవత్సరమునకు 15000 పౌనుల జీతముమీాద ప్రెసిడెంటు అయినాడు. ఇట్లే బర్కెన్‌హెడ్డు ప్రభువు ఒకప్పుడు కింగ్సు కౌన్సెలు ( కె. సి. ) గాను తరువాత లార్డుఛాన్సెలరుగాను ఉండి, పిమ్మట పూలాన్సకు ఉద్యోగమునకువెళ్లి, అనంతరము ఇండియాకు సెక్రటరీ ఆఫ్ స్టేటు ఉద్యోగముచేసి, ఆఖరుకు ఒక వర్తకవాణిజ్యసంస్థలో పెద్దఉద్యోగమునందు లగ్నమైనాడు. అవసానకాలమందు మరణశయ్యపైనుండి గ్రేటరు లండను అండు కౌంటీసు ట్రస్టు లిమిటెడుకు సంవత్సరమునకు 15000

పౌనుల జీతముమీద నియోగింపబడినాడని అతనినిగూర్చి కెప్టను బెన్ తిరస్కారముగా ప్రసంగించినాడు. ప్రభువుల సభలో గల 412 సభ్యులలో ప్రతియొక్కడును ఇంగ్లాండు లేక ఇండియా వాణిజ్యముతో సంబంధించిన నాలుగైదు కంపెనీలలో డైరక్టరుగానున్నవాడే. వ్యవసాయము, బ్యాంకింగు, సారాయి, గృహనిర్మాణము, సీమెంటు, కేబిల్సు, కాలువలు, రసాయన ద్రవ్యములు, ప్రత్తి, బొగ్గు, డాక్సు, (హార్బరులు), విద్యుచ్ఛక్తి, ఇంజనీరింగు, విలాసములు (Entertainments), ఆర్థికవిషయములు, ఆహారము, గ్యాస్, హొటేల్లు, భీమా, ఇనుము,ఉక్కు, భూములు, మోటార్లు, వార్తాపత్రికలు, నూనె, కాగితములు, తోటలు (Plantations) బంగారు వజ్రముల గనులు త్రవ్వట, రెయిల్వేలు, నౌకానిర్మాణము నౌకావ్యాపారము, వర్తకము, టెలిగ్రాఫులు, టెలిఫోనులు, వస్త్రవ్యాపారము, ట్రామువేలు, ట్రష్టులు, బండ్లుమొదలగు వానికి సంబంధించిన వివిధకంపెనీల బోర్డులలో వీరు సభ్యులుగా ఉన్నారు* ఉదాహరణములకు కొదవలేదు. ఇంచికేప్రభువు P. & O. (పి. అండు ఒ.) స్టీమ్ నావిగేషన్ కంపెనీకి అధికారి. హిందూదేశమునకు గల 8 కోట్ల టన్నుల కోస్తానౌకల వాణిజ్యములో 5 కోట్ల టన్నుల వాణిజ్యమును ఆ కంపెనీయే చేయుచున్నది. కొన్ని సంవత్సరముల క్రిందట మద్రాసుగవర్నరుగాను కొంత కాలము ఇండియాకు ఆక్టింగు వైసురాయిగాను ఉండిన

---

* వివరముల కొరకై గ్రంథము చివరనున్న జాబితాను చూడుడు.

గోష్చన్‌ప్రభువు ఈదేశమునకు రాకముందు ఒక భీమాకంపెనీకి డైరెక్టరుగా ఉండెను. ప్రభువుల సభలోని ప్రతీసభ్యుడును, ఒకటిగాని అంతకు మించినట్టిగాని వాణిజ్యపరిశ్రామిక కంపెనీలలో డైరెక్టరుగా ఉండుటయే గాక, హిందూదేశమునందలి అనేక కంపెనీల డైరక్టర్లసభలలో ప్రభువుల సభసభ్యులు డైరక్టరులుగా ఉన్నారు. ఈ విధముగా కలకత్తా జనుపనార మిల్లులలో, కాన్పూరు వూలుమిల్లులలో, బొంబాయి ప్రత్తి మిల్లులలో, ఆటవికపారిశ్రామిక సంఘములలో, అనేక రెయిల్వేకంపెనీలలో నౌకాకంపెనీలలో ఆంగ్లప్రభుకుటుంబముల వారు, శ్రీమంత కుటుంబములవారు, రాజకీయములందు సుప్రసిద్ధులైన పురుషులు డైరెక్టరులుగా నున్నారు. అతితరచుగా వార్తాపత్రికలలో అనేకము వింతసంగతులు ప్రకటింపబడుచుండును. వానిని మనము ఒక లక్ష్యముతో చదువకుండా విడచిపెట్టుచుందుము. సర్ జార్జిస్టేన్లీ సోదరునికొడుకు స్టేన్లీ ప్రభువు ఒకప్పుడు కన్సర్వేటివు పార్టీయొక్క ఛీఫ్‌విప్పుగాను, కొంచెము కాలముక్రిందట మద్రాసుగవర్నరుగాను ఉండెను. అతను 27—12—1929 లో బొంబాయి రేవులో స్టీమరునుండి దిగెను. ఆ సమయమున ఒక వార్తాపత్రికలో ఈ దిగువరీతిని ఉదహరించబడెను:—

“అతను ప్రత్తిపరిశ్రమ పరిస్థితులనన్నిటిని పరిశీలించుచు అతను కూడ మిల్లుఅధికారి కనుక అతని రాక చాలా ప్రధానమైనది. లంకాషైరు స్థితి చాలా చెడిపోయి యున్నదని స్టేన్లీప్రభువు చెప్పెను. అతను ఇక్కడి

రాజకీయపరిస్థితులను గూడ పరిశీలించి గ్రహించును. హిందూదేశపు ప్రజాభిప్రాయమును బాగుగా గుర్తెరిగిన నాయకులతో మాట్లాడి వారి ముఖతా భారతదేశస్థితిని గూర్చి ప్రథమసమాచారములను తెలుసుకొనును ”

ప్రస్తుతము ఇండియాకు అండరు సెక్రటరీ ఆఫ్ స్టేటుగా నున్న స్టాన్లీప్రభువు లంకాషైరు ప్రత్తిరాజు (కాటన్‌కింగు) లలో నెల్ల గొప్పవాడైన డెర్బీప్రభువుకు జ్యేష్ఠపుత్రు డన్న మాట అందరికీ బాగా తెలియకపోవచ్చును. 1929 వ సంవత్సరపు లండనువార్త యొకటి ఈ రీతిని తెలుపుచున్నది. “లాయిడుప్రభువు అంతర్జాతీయ నిద్రాశకటముల కంపెనీ” (International Sleeping car company) బోర్డులో ఒక స్థానమును సంపాదించినందువల్ల, ఒకప్పుడు పరిపాలకవర్గములో సభ్యులు (ex-administrators) గా నుండి తరువాత మంచి పలుకుబడిగల వాణిజ్యపారిశ్రామిక కంపెనీలలో ఉన్నత పదవు లందిన తనతోడివారితో సమానగౌరవము నందెను.” ఆలాయిడు ప్రభువే ఈ మధ్యను థామసు కుక్ అండుసన్సు (Thomas Cook and sons) లో డైరెక్టరుగా చేరెను.

1930 ప్రారంభములో మరియొక వార్త ఈ రీతి నున్నది :—

“ గడచిన కొన్ని నెలలలోనే విదేశవ్యవహార మంత్రి సర్ ఆస్టిన్ చాంబర్లెనున్ను, యుద్ధమంత్రి సర్ లామింగ్ వర్దింగ్టన్ ఇవాన్సున్ను గ్రేటర్ లండన్ అండు కౌంటీస్ట్రస్టు, లిమిటెడు, యొక్క బోర్డులో సభ్యులైనారు. దీనికి బర్కిన్ హెడ్డుప్రభువు అధ్యక్షుడు. బోర్డుఆఫ్ ట్రేడుకు

మంత్రియైన సర్ ఫిలిప్ కన్లిఫ్ వెలిస్టరును క్రొత్తగా స్థాపించబడిన టిన్ ప్రొడ్యూసర్సు అసోసియేషను యొక్క అధ్యక్షపదవిని స్వీకరింపవలసిన దిగా కోరినారు. బ్రెంటుఫోర్డుప్రభువు (సర్ జాయిన్సన్ హిక్సు ఇతనిపేరు. దేశీయవ్యవహారములు లేక హోమ్ అఫెయిర్సుకు మంత్రి) దినార్డెరన్ అస్యూరెన్సుకంపెనీయొక్క బోర్డులో ఒకస్థానమును స్వీకరించినాడు, వ్యవసాయశాఖ మంత్రి సర్ అర్డర్ స్టీల్ మెయిట్లాండు యూనైటెడు డొమినియను ట్రష్టు, లిమిటెడ్, డైరక్టరులలో నొకడు, వాయువిమానశాఖ మంత్రి సర్ శామ్యుయలుహోరు రెండు భీమాకంపెనీలలో డైరక్టరై యున్నాడు. ''

రూటరు ఏజెన్సీవారు ఈ వార్తను ప్రకటించినారు :—

లండను, మే 25

25—5—1937 లో మాంచెష్టరు నగరమునందు జరిగిన ది ఎంపైరు కాటనుగ్రోయింగు కార్పరేషనుయొక్క సాంవత్సరిక సభలో డర్బీప్రభువు హిందూదేశమునకు ఈ రీతిని విన్నపము చేసినాడు.

డర్బీప్రభు వీరీతిని చెప్పినాడు :—

" భారతదేశమునందు ప్రత్తిని పండించు వ్యవసాయదారులకు వారి ప్రత్తిని తీసుకొనుట ద్వారా మేము మా సాధ్యమైనంత సహాయము నొనరింప బూనుకొనుచున్నాము గనుక, ఈ దేశములో తయారైన వస్తువుల నుండి ప్రస్తుతముకంటె విశేషభాగములను భరతఖండము గ్రహించుటకు సాధ్యమైనంత ప్రయత్నముచేసి సహాయపడవలెను. ఉభయదేశముల మధ్యను ఇట్టి సంప్రీతి వర్ధిల్లుటకై మనము మిక్కిలి ప్రయత్నించవలెను, కాని సం

ప్రీతి అనేది రెండుపక్షములయందును ఉండవలసిన విశేషము. కేవలము ఒక్క దేశములో మాత్రము అది ఉండజాలదు.

లంకాషైరు ప్రత్తివ్యాపారమునందలి అన్ని శాఖలును తమ పదార్థముల నిప్పటికంటె ప్రశస్తముగా చేయుటకై చాలా శ్రమపడుచున్నవి, కాని ఇందులో దయాధర్మములకు గాని మెుగమాటములకు గాని తావు లేదు. లంకాషైరుకు పునరుద్ధరణము రావలెనంటే దానిచే తయారుచేయబడిన ప్రత్తివస్త్రముల యెగుమతి హెచ్చవలెను. ఈ యెగుమతి గత శతాబ్దములో ఉండినదానిలో సగముకంటె యెక్కువగానే గత సంవత్సరము పడిపోయినది. ఈ పరిమితి బాగా హెచ్చినప్పుడే నిజమైన పునరుద్ధరణము జరిగినట్లు చెప్పవచ్చును.”

1936 లో ఎంపైరు కాటను పంట అంతకుముం దెప్పటికంటె బాగా హెచ్చినట్లు డర్బీప్రభువు చెప్పుచున్నాడు. 1935 లో ఆ పంట 700,000 బేలులు మాత్రమే యైయుండగా 1936 లో 752,800 బేలులైనది. 1935-36 లో అంతకు ముందరి సంవత్సరపు ఋతువులో కంటె 152,000 బేలులు లంకాషైరు దిగుమతి చేసుకొన్నదని అతను తెలుపుచున్నాడు. డర్బీప్రభువుయొక్క జ్యేష్ఠపుత్రుడగు స్టాన్లీప్రభువు ఇదే సమయమున, అనగా ఇండోబ్రిటిషు వాణిజ్యరాయభారములు జరుగుచుండగా, ఇండియాకు అండరు సెక్రటరీగా నియమింపబడుటలో అర్థము లేకపోలేదు. ఎందుచేత ననగా అంతకుముందు ఇండియాకు అండరు సెక్రటరీగా ఉండిన బట్లరుకు ఈ రాయబారములలో తగినంత లంకాషైరు పక్షపాతము లేనట్లు భావింపబడినది.

ఇంకొకవార్త ఈ రీతిని ఉన్నది. "పూర్వము ఛాన్సలరు ఆఫ్ ఎక్స్ఛెకరు (ఆంగ్లకోశాధ్యక్షుడు) గా నుండిన సర్ రాబర్టు హార్నీ దిగ్రేటు వెష్టర్న్ రైల్వేకి అధ్యక్షుడైనాడు. అతనున్ను క్రోమరుప్రభువున్ను పి. అండు ఒ. కంపెనీకి డైరక్టరులు. రాయల్ మెయిల్ స్టీమ్ ప్యాకెట్టు కంపెనీలో హాన్సిమన్ ఇదే సమయమున ప్రవేశించినాడు. హిందూదేశమునందలి మధ్యరాష్ట్రములకు ఛీఫ్‌కమీషనరుగా ఉన్న సర్ బెంజామిను రాబర్టుసన్, ఐ. సి. యస్. బెంగాల్ నాగపూర్ రెయిల్వే కంపెనీలో డైరక్టరుగా కూడా ఉన్నాడు."

1-1-1930 తేదిని రూటరు ఏజన్సీవారు న్యూయార్కు నుండి క్రిందితంతిని ప్రకటించినారు:—

"హిందూదేశమునందు జరుగుచున్న పరిణామములను అమెరికా మిక్కిలి స్నేహదృష్టితో నిరీక్షించుచున్నవి."

ఇండో అమెరికనుగ్రేడు అభివృద్ధి యగుచుండుటను చూచి హెరాల్డు ట్రిబ్యూనుపత్రిక ఈ విధముగా వ్రాయుచున్నది. "హిందూదేశమంటే ఇప్పుడు అమెరికావారికి స్వాములు, యోగులు, బాల్యవివాహములు, వితంతు దహనములతో గూడిన మసక మసకలుగా కనిపించు దయ్యాల భూమి కాదు. అక్కడ యేర్పడుచున్న సుస్థిర పరిస్థితులయందు మాకెంతో అభిమానము కలుగుచున్నది. ఇందుకై బ్రిటిషువారు ఎంతో శ్రమపడుచున్నారు, అందుకై వారు గర్వించవలసినదే"

1936 మార్చి మొదటివారములో జర్మనుస్త్రేకు ఫెడ రేషనులో "ప్రపంచములో తయారైన పదార్థము లన్నియు అమ్ముడుపోవుటకు ఇండియా చాలా యోగ్యమైన అంగడి" అని నిక్సను చెప్పినాడు.

ఇండియాలో ఫైనాన్సు మెంబరుపదవిని విడువగానే సర్. జి. షుస్టరు వెస్టుమినిస్టరుబ్యాంకులో డైరక్టరుగా చేరి నాడు. అంతకుముందు ఆపదవినే అధిష్టించిన సర్ బాసిల్ బ్లాకెట్టు మిడ్లాండుబ్యాంకులో డైరక్టరుగా చేరినాడు.

సర్ జేమ్సుగ్రిగ్గు మిడ్లండు బ్యాంకునుండి వచ్చినవాడే. ఆస్క్వితు ప్రభుత్వములో ఫైనాన్సు మెంబరుగా ఉండిన యమ్‌సి. కెన్నా, జేమ్సు & షేక్స్పియరు అను మిరియాలకంపె నీలో భాగస్వామి, అతనే మిడ్లండుబ్యాంకుకు అధ్యక్షుడు. బ్రిటిషుసామ్రాజ్య మంతయు మిరియాలలోనుంచి పుట్టినదని మనకు తెలిసినవిషయమే. సైమనుకమీషనువారు తమపనుల నేవో చేసుకొని పోవుచున్నప్పుడే, రాజకీయముల యందుకంటె వ్యాపార వ్యవహారముల యందెక్కువ శ్రద్ధగల తత్సంఘ సభ్యులు హిందూదేశమునందే వస్తువుల నెక్కడ చెల్లగొట్ట గలమా అని ఇచ్చటి బజార్ల పరిస్థితులే పరీక్షించుచుండిరి. కమీషనులో ఒకసభ్యుడైన బర్నుహామ్ ప్రభువు "ఇండో బ్రిటిషుస్త్రేడు అభివృద్ధి పంజాబులో మంచిబాగా సాగగలదు" అని చెప్పుచు కార్లు, లారీలు, ట్రాక్టర్లు విరివిగా దిగుమతి చేయ వలెనని వ్రాక్రుచ్చినాడు. "హిందూదేశపు అంగడులనుగూర్చి

యొవడో ఏజంటు చూచుకొని పోయినంత మాత్రమున తీరదు. జాతీయ దురభిప్రాయములను అసహ్యతలను సంస్కరింపవలసిన ప్రిన్సిపాలులే వీనిని పరిశీలించి అభివృద్ధి పరచవలె” నని అత డన్నాడు. ఈవిధముగా ఎన్నివస్తువులు—వానిలో నిత్యోప యుక్తములై సులభముగా తయారుచేయతగ్గవికూడ ఉన్నవి— మనమీాద క్రుక్కబడుచున్నవో మనమెరుగకున్నాము. విదే శములనుండి ఇండియాకు దిగుమతి యయ్యెడి ఉర్లగడ్డలమీాద దిట్టమగు సుంకములు విధించవలెనను మద్రాసు ప్రభుత్వము వారికి నీలగిరి వ్యవసాయదారుల సంఘమువారు ఈ మధ్యనే ఒక ముఖ్యమైన కోరికను విన్నవించినారు.

1894 మద్రాసు కాంగ్రెసులో ఎర్డ్లీనార్టను ప్రసంగిం చుచు విదేశస్థులకు హిందూదేశమునందు దిట్టమైన వర్తక సౌకర్యములను ప్రసాదించు సందర్భమున సెక్రటరీ అఫ్ స్టేటు కున్ను అతని సభకున్నుకూడ ఎంత తక్కువ అవకాశములు గలవో ఉదహరించినాడు. కలకత్తా సౌతు ఈష్టు రైల్వేకంపెనీ పూర్తిగా దివాలాస్థితిలో ఉన్నప్పుడు లార్డుఛాన్సలరు వద్దని ప్రతిఘటించినను, దానిని అయిదులక్షల స్టెర్లింగు పౌనులకు కొని నూటికి 5 చొ॥ వడ్డీకి పూచీకత్తు నిచ్చినారు. మద్రాసు ఇర్రిగేషను కంపెనీకి 10 లక్షల స్టెర్లింగు పౌనులమీాద నూటికి 5 చొ॥ వడ్డీ గ్యారంటీ (హామీా) యిచ్చినారు. ఆకంపెనీ దాని ఖర్చుల నది భరించుకొనలేక పోయినదిగనుక అసలు ఖరీదుకు కొనుక్కున్నారు. ఎలిఫిన్సటనుల్యాండు అండు ప్రెస్సుకంపెనీ

షేర్లు బజారులో 339 రూపాయల చొప్పున చెల్లుచుండగా షేరు 1 కి రు 1000 లు చొప్పున ఇచ్చి కొన్నారు. ఈకంపెనీ యొక్క కౌన్సిలుకు 12 గురు సభ్యులుండిరి. వీరు ఒట్టి చేత కానివారని స్పష్టమే యైనను ఒకొక్కరికి సాలుకు 1200 పౌనులు జీతమిచ్చినారు. ఇది చాలా దుర్భరము.

1931 లో వేల్సు యువరాజు బ్రజీలును చూడవెళ్లి నప్పుడు బ్రిటనుకు 3,000,000 పౌనులకు ఆర్డరు వచ్చినది. ఐరను అండు స్టీలు ఫెడరేషనుయొక్క సాంవత్సరికభోజనముల ఉత్సవము లండనులో జరుగునప్పుడు ఈ ఆర్డరుకు వేల్సు యువరాజే మూలకారణమని డడ్లీప్రభువు చెప్పినాడు. రియోడి జానీరో అధికారులతో యువరాజు సలిపిన సంధానసంభాషణము (ఇంటర్వ్యూ) ఫలితమే ఇది యని అతడు వచించినాడు. బ్రజీలులో ఉన్న గవర్నమెంటు రైల్వేలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయుటకై బ్రిటిషు ఇండస్ట్రీవారికి 3,000,000 పౌనుల స్టెర్లింగు కాంట్రాక్టు ఈయబడినది. "నాప్రయాణముల సందర్భములో నేను గవర్నమెంటువారితో కలసి యేవో కొన్ని కంట్రాక్టులను సంపాదించగలిగితిని"నని యువరాజు అతివినయముగా వచించినాడు. ఈ యువరాజే డ్యూకు ఆఫ్ విండ్సరు.

ఇంగ్లాండులో ఒకప్పుడు మంత్రిగా ఉండి కొంచెము కాలముక్రిందట మరణించిన సర్ ఎరిక్ గెడ్డీసుకు డన్లపు రబ్బరు టైరుకంపెనీతో సన్నిహితసంబంధమున్నది; లార్డు రీడింగు

ఇంపీరియల్ కెమికల్సు అనే కంపెనీయొక్క బోర్డు ఆఫ్ డైరక్టర్సుకు చైరుమను; ఈరెండు కంపెనీలకున్ను, బర్మా షెల్‌కంపెనీకిన్ని భారతదేశ కేంద్రప్రభుత్వమువారు దిగుమతులమీాద కష్టమ్సుడ్యూటీలను తగ్గించుచున్నారని వినుచున్నాము. శాసనసభల అనుమతి తీసుకొనవలసిన అవసరములేని నాన్‌వోటబులు గ్రాంటులనుండి వారికి ఈ రిబేటు ఈయబడుచున్నదట. సర్ ఎరిక్ ఎ. గెడ్డీసు ఇంపీరియలు రైల్వేలకు అధ్యక్షుడై యున్నాడనికూడ మేము చెప్పవలసియున్నది.

ఇంపీరియల్ కెమికల్సువారికి పంజాబులో ఉన్న సాల్టుపీటరుగనులను 40 సంవత్సరములకు అద్దెకిచ్చినారు. ఇండియాకు తెలియకుండా ఈకంపెనీ ఇంగ్లాండులో స్థాపించబడినది, కాని 1934 ఢిల్లీ అసెంబ్లీలో ఈకంపెనీ ఇండియా శ్రేయస్సుకొరకే స్థాపించబడినదని చెప్పినారట. ఇంపీరియల్ కెమికల్సుకు పూర్వముండిన మెసర్సు బ్రన్నరుమాండు అండు కంపెనీవారికి అమోనియా లేక ఎరువుపదార్థముల దిగుమతికై సర్వహక్కులును ఈయబడి యుండెను.

హిందూదేశము పోతే ఇంగ్లాండు ఎట్లు దివాలా అగునో అను విషయమునుగూర్చి 1932 ఫిబ్రవరి డెయిలీ మెయిలు ఈరీతిని వ్రాయుచున్నది :—

"శనివారమునాడు ఇర్విను ప్రభువుచేసిన ప్రసంగము హిందూదేశ పరిస్థితుల నేరీతిని గాని చక్కపరచలేదు. బ్రిటిషువారిని బుజ్జగిస్తేనో లేక బెదిరిస్తేనో ఇండియాకు శీఘ్రముగా డొమినియను హోమురూలు నిచ్చేస్తా

రని కొన్నిచోట్లనుండే దురభిప్రాయమును ఆప్రసంగము తొలగించలేదు కూడాను ఇటువంటి ఉపద్రవకరమైన స్వప్నమును వెంటనే చెల్లాచెదరు చేయవలసిన అవసరమెంతో ఉన్నది 'ప్రాచ్య సామ్రాజ్యమునకు వలస రాష్ట్రి స్వాతంత్ర్యము నిస్సారనే బొల్లిమాటలను రాజకీయ నాయకులు యెప్పుడును ప్రేలకూడదు ' ఇటువంటి వినాశకర రాజనీతి వాక్యములతో చెల్లాటలాడు వారిని నిర్దాక్షిణ్యముగా ప్రజాహితరంగమునుండి తరిమివేయ వలెను.

"ఎగుమతి దిగుమతి సుంకములు ఇతరరాజకీయ సమస్యలు అన్నిటి కంటెను ముఖ్యముగా ఇండియాను వశమునందుంచుకొనుట గ్రేటుబ్రిటను యొక్క శ్రేయస్సునకు అత్యావశ్యకమైన కార్యము. బ్రిటిషు సామ్రాజ్య మున కంతటికిని ఇండియా పునాదిరాయియని వర్ణింపవచ్చును. ఇండి యాతో వర్తకము మన ప్రజలకు ప్రాణాధారము. హిందూదేశమును మనము పూర్తిగా గోల్పోతిమేని లంకాషైరు దివాలా యైనట్లే పరిశ్రామిక కార్మికులకు చెప్పరాని దుఃఖములే గత సంవత్సరం యెగుమతి లెఖ్ఖలు మనకు ఇప్పుడు లభించుచున్నవి. మన యెగుమతు లన్నిటి మొత్తములో పదోవంతు అనగా 83,900,000 పౌనుల విలువగలవి ఒక్క హిందూదేశ మునకు మాత్రమే వెళ్లినవి బ్రిటిషు దేశములలోగాని విదేశములలోగాని బ్రిటిషువస్తువుల నింత మొత్తమునకు స్వీకరించే దేశము వేరొకటిలేదు. భారతీయ విప్లవవాదులు అవకాశము చిక్కితేచాలు దీనిని ధ్వంసము చేతా మని పూర్తిగా నిశ్చయించుకొనియున్నారు

"సైమను కమీషను వారికి వచ్చిన సాక్ష్యము ప్రకారము ఇండి యాలో బ్రిటిషువారికిగల పెట్టుబడులు వెల 1,000,000,000 (నూరుకోట్లు) పౌనులు. హిందూదేశము తీర్చవలసిన ఋణములనెల్ల నెగవేదుమనిన్ని,

దేశమునందెల్ల చెదరియున్న బ్రిటిషు పెట్టుబడిదార్ల తోటలు ఫ్యాక్టరీలు అన్నీ ఆక్రమింతు మనిన్నీ విప్లవవాదులు గట్టిగా ప్రకటించుచున్నారు. ఇటువంటి నష్టమునుండి గ్రేటుబ్రిటను ఏనాటికిని కోలుకొనజాలదు.

"ఇటువంటి లొంగుబాటు పద్ధతిని బ్రిటను మానవలెను. డొమిని యను హోమురూలునిస్తే అరాచకము, సర్వనాశనము తప్ప వేరేదియు ఫలించదు. మధ్యయుగమునాటి ప్రజాతత్త్వములో ఇరువదవ శతాబ్దము నాటి రాజ్యాంగ తంత్రములను చీనాలో నాటి ఒకసారి శోధించబడినది. తత్ఫలితముగ ఇరువై సంవత్సరములు దేశములో పరస్పర యుద్ధములు దుఃఖములు చెలరేగినవి ఇప్పుడవలంబించవలసినవి రెండే మార్గములు. మొదటిది దేశమును సంస్థానాధీశులకు స్వాధీనముచేయుట. ఇట్లు చేస్తే వారు అఖిలభారత కాంగ్రెసు మహాసభలోని హిందూ న్యాయవాదులను ఏలాగో ఒకలాగ ఊరుకోబెట్టుకొందురు. రెండవది హిందూదేశములో కదలకుండా నిలబడి ప్రజలను పరిపాలించుట. ఈదేశము అవలంబించ దలచుకొన్న మార్గము ఈ రెండవదే"

ఇంగ్లడునందలి పెద్దపెద్ద అధికారులు ప్రభువులు అందరును వాణిజ్య పరిశ్రామిక సంస్థల కధీశులై యుండగా ఇటువంటి సంగతులు ఇంతస్పష్టముగా ప్రకటించబడుచుండుట ఆశ్చర్యముకాదు. ఇంకాసందేహమైతే, మాంటేగ్యూకు మాంటాగ్యూకుటుంబమువారి సిల్వారు (వెండి కంపెనీ) ఫర్ముతో సంబంధముండనేఉంది. ఒకప్పుడు ప్రధానమంత్రిగాఉండిన బాల్డ్విను ఇనుమువర్తకుడు. విల్లింగ్డను ప్రభువు మద్రాసు గవర్నరై యుండగా, విల్లింగ్డను ప్రభ్వీతనతండ్రియగు కౌంటు బ్రాసీకి చెందిన సన్‌బీము కంపెనీకి చెందినమోటారుకారులను

చెన్నరాజధాని మంత్రులు, మహారాజాలకు పరిచయముచేసి హితము పుట్టించినది. "లాయుడు జార్జి మార్గ్యాని పేరులు" ఈచరిత్ర శాశ్వతాద్భుతమైన విషయమేగదా! ఒకప్పుడు రీడింగుప్రభువు పేరుకూడా దీనితో ముడిపెట్టబడియుండకపో లేదు. ఇంగ్లాండులో మహోన్నత పదవి యందుండిన ఒక మహామహుడు ఈమధ్యనే రోల్సురోయను కార్లను ఇంగ్లాండు దేశమును దర్శించవెళ్లిన ఇండియను ప్రధానమంత్రులకు పరిచ యముచేసి ఇండియాలో వ్యాప్తిపొందించుటకై మిక్కిలి శ్రమ పడినాడు. అతనే బర్కిన్‌హెడ్డు ప్రభువు. అతను ఇండియాకు అండరు సెక్రటరీ అఫ్ స్టేటుగా ఉండగానే ఈపనిజరిగినది.

ఆంగ్లో ఇండియను శిఖామణులు తమ సంపదలనెచ్చట కుదువబెట్టుకుందురు? జమీందారీ రైతువారీ భూములమీద కాదు, ఇండ్లు ఎస్టేటులు మొదలగు ఆస్తులపైకాదు. (అట్టి వానిపై వీరికి హక్కులుండరాదని నిషేధించబడినది), బ్రిటను నందును ఇండియాయందునుగల అనేక మిల్లులయొక్కయు, కంపెనీలయొక్కయు పేరులయందు—సర్ బెంజామిన్ రాబ ర్టుసన్ ఐ. సి. యస్. (మధ్యరాష్ట్రముల ఛీఫు కమీషనరుకు) బెంగాల్‌నాగపూరు రైల్వేకంపెనీకిగల సంబంధము ఇంతకు ముందే తెలుపబడినది. కనుక వారి అభిమానములు తమకు అర్థార్థసంబంధముగల ఈఫర్ములతోనున్నవి. వాణిజ్యపరిశ్రా మిక విషయములలో ఇండియాకు ఇంగ్లాండుకుగాని, ఇండియ నులకు ఇంగ్లీషువారికిగాని సంఘర్షణము వచ్చినప్పుడు వారు

తమ స్వదేశముతోనే పక్షమునుబూని వర్తింతురు. ఇటువంటి సందర్భములలో వారు తమ స్వదేశస్థులపక్షము వహించుట యేకాక, తమతోడి సహచరులును పరిశ్రామిక నాయకులును నగు ఇతరుల శ్రేయస్సుకూడా అట్టిపక్షపాతములో మిళితమై యుండవచ్చును. ఇండియాయందును ఇతరత్రాను గల ఆంగ్ల మహాపురుషుల రాజకీయాశయములకు ఇట్టి వాక్యములు కళంకమాపాదించి నేరము మోపుచున్నట్లగుపించవచ్చును. కనుక ఈవాక్యముల యాదార్థ్యమును బలపరచుటకై యెన్నోఅంకెలను అంశములను ఋజువు క్రిందతీసుకొనివచ్చి చూపకున్న యెడల వీలులేదు. మావాదమునకు బలమును చేకూర్చే సాక్ష్యము నంతటిని సేకరించి ఋజువుపరచుటయే ఈగ్రంథము యొక్క ముఖ్యోద్దేశము.

# 2 వ అ ధ్యా య ము

## ఉ ప్పు

మనము మొట్టమొదట అతి సామాన్యమైన ఉప్పును తీసుకొని సైన్యమువరకు వెళ్లి ప్రతితావునను మనవాదమును ఋజువుపరచుకొందము. సర్వసాధారణమైన ఉప్పు అని పిలువబడే సోడియముక్లోరైడు మొదలుకొని, మానవునకు తెలిసినంతవరకు అసాధారణ వ్యూహసమ్మిళితమైన సైన్యమువరకు, ఏసమస్యను తీసుకొన్నను ఇండియాయందలి బ్రిటిషుప్రభుత్వముయొక్క రాజ్యవ్యవహారనీతియంతయు బ్రటిషుప్రజల ఆర్థికలాభముల నన్నింటిని ఏరీతిని సంరక్షింపగలుగుదుమా అన్నదృష్టితోనే అమలు జరిపించబడుచున్నది. 1903 లో గోక్లే భారతీయరాజ్యాంగములలో ప్రవేశించగానే ఇండియా గవర్నమెంటుతో అతనుచేసిన మొట్టమొదటి యుద్ధము ఉప్పు పన్ను మీదుగానే త్రిప్పబడినది. ఈపన్ను న్యాయశాస్త్రరీత్యా వ్యతిరేకమనిన్ని, అనవసరమనిన్నీ, అమానుషమనిన్నీ అతను భావించినాడు. ఉప్పుమీాద ఇండియా ప్రభుత్వమువారు మణుగు 1 కి రు 2—8—0 చొ॥ ఎక్సైజుపన్ను విధించుట ఉప్పును తయారు చేసేవారికి లాభము వచ్చుచున్నదనికాదు. ఈ ఉప్పు ప్రపంచములోని అంగళ్లన్నిటిలో వ్యాపించగలుగుతున్నదని కూడా కాదు. దీని కిటువంటికారణము లేమీా లేవు; ఫ్యాక్టరీగడపలు దాటి బయటికి వెళ్లేలోపల ఒకొక్క

మణుగు ఉప్పు రెండు రూపాయీల యెనిమిదిఅణాలను ప్రభుత్వమువారి బొక్కసములోనికి తెచ్చుచున్నదని మాత్రమే ఈపన్ను విధించబడినది. ఇందువల్ల ఉప్పు ఖరీదు అనవసరముగాను, అత్యధికముగాను పెరిగిపోయినది.

రాజకీయవాదులు 33 సంవత్సరములు పోరాడినను ఈ పన్నును మణుగు 1 కి రు 1—4—0 లు కంటె తక్కువకు తగ్గించుట సాధ్యమైనదికాదు. 1929 లో లెజిస్లేటివుఅసెంబ్లీవారు ఈ పన్నును 1 రూపాయికి తగ్గించవలెనని తీర్మానమును ప్యాసుచేసిరి. వైసురాయి ఈ తీర్మానమును ఆదరించక ఈ పన్నును సర్టిఫై చేసి నిలబెట్టినాడు. ఇంత ప్రజాహితమైన శాసనసభ ఇంత అత్యావశ్యకమైన ఉప్పుపై ఇంత తక్కువగా పన్నును తగ్గించుమని కోరితే ఇంత ప్రజాహితుడైన రాజప్రతినిధికూడా దీనిని గౌరవించక యెందుకై ఇట్టి ప్రజానిష్టకరమగు చర్యను దీసుకున్నాడా అని విచారించుటకై ప్రజలు నిదానము చూపలేదు. గంజాయి, మాధుములవలె ఇది నిషాపదార్థమైనచో, కల్లు, సారాయీలవలె దేహమును క్షీణింపజేయునదైనచో, నల్లమందువలె అచంచలత్వమునో, కొకైనువలె ఉద్రేకమునో పుట్టించునదైనచో, ఉప్పును తయారు చేయువారిపై పన్ను వేసి ఆవ్యాపారమునకు పన్నుమూలముగా మితిని, హద్దులను ఏర్పరచుటకు ప్రజలంగీకరించియుందురు. ఇట్లుకాదు సరేగదా ఉప్పు మానవులకును, మృగములకునుగూడ అత్యావశ్యకమైన పదార్థము. మరియు కర్జను

ప్రభువు ప్రభుత్వములో, గోక్లే ఇంపీరియల్ కౌన్సిలులో ఉండిన మొదటి ఆరు సంవత్సరముల కాలములో, ఈ పన్ను నతడు మొట్టమొదటిసారి తగ్గించగలిగినప్పుడు ఉప్పు విస్తారముగా ఉపయోగింపబడినదని కూడా అందరకును తెలియును. పది శేర్ల ఉలవలు ఉడికించి పశువులకు కుడితిపెట్టవలెనంటే సేరున్నర ఉప్పు కావలెను. రైతులు, గుఱ్ఱములు గలవారిలో యెంత కొద్దిమంది మాత్రమే ఇంత ఉప్పుకొని కుడితిలో పోసి తమ పశువులను చక్కని ఆహారముతో సంరక్షించుకొనగలుగుచున్నారు! ఇట్లు చేయలేకపోవుటకు కారణము ఉప్పు ఖరీదు యెక్కువగ ఉండుటయే కాదా? 4500 మైళ్ల సముద్రతీరము, తీరము పొడవునను ఉప్పుగడ్డలు పేరుకొని కొండలవలె వ్యాపించియున్న బయలు ప్రదేశములు, ఎక్కడపెట్టిన అక్కడ ఉప్పు తయారు చేసుకొనుటకు వీలైన ఉప్పునీటి సరస్సులు, గుంటలు, బావులు, కొండలుగల ఈ దేశములో ఉప్పు దిగుమతి చేసుకొనవలసిన అవస్థ పట్టినదంటే, సముద్రతీరవాసులు సముద్రమునుండి ఒక గ్లాసు నీరును తెచ్చుకొని కాచుకొని ఉప్పును తయారు చేసుకొని తమ అవసరములను తీర్చుకొనకుండా నిషేధించబడినారంటే చాలా ఆశ్చర్యము. ఇటువంటి పని ఒక ఘోరమగు నేరము! ఇట్లు చేసినవారికి ఆరుమాసములు కఠినశిక్ష కాని రు 500 లు జరిమానా కాని విధించవచ్చును.

బ్లంటు అనునతను ఇట్లు వ్రాయుచున్నాడు :—

"కటికదరిద్రులు మాత్రమే ఉప్పునైనా కొనుక్కొనలేని అవస్థలో ఉందురు, కాని దురదృష్టవశమున దక్షిణ ఇండియాలో ఉన్నవారందరూ కటికదరిద్రులే. దక్కను ప్రాంతములలో ఉప్పు లేకుండా ఉండడము దుర్భరము; ఏలననగా ప్రకృతిసిద్ధముగా ఉప్పు ఎక్కడపట్టిన అక్కడ పడియుండును. కాని ప్రజలు ఈ ఉప్పు సంపదను చూస్తూ ఉపవాస ముండవలసి వచ్చుచున్నది. నేను వెళ్లిన అనేక గ్రామములలోని రైతులు తాము తమ పశువులను అర్ధరాత్రులందు ఉప్పు పట్టిలకు తోలుకొనిపోయి దొంగతనముగా పైపైని నాకించవలసి వచ్చుచున్నదని చెప్పిరి, కాని ఇంతలోనే రక్షకభటులు వచ్చి గుభీలున వారిపైబడి చట్టమును తిరస్కరించినందుకు ఆపశువులను బందిలిదొడ్లో పెట్టుదురు. ఇంతేకాదు ప్రకృతి సిద్ధముగా పడియున్న ఉప్పు నంతటిని కుప్పలుగా పోసి పోలీసువారే నాశనము చేయవలసినదిగా ఆర్డరులు ప్యాసుచేయబడెను. ఆహారమునందత్యావశ్యకభాగమైన ఈ ఉప్పు వేసుకోకుండానే తిన్నవారికి కొన్ని ప్రాంతములలో ఒకజాతి కుష్ఠరోగము తగిలి బాధపడుచున్నారని నేను విన్నాను. గవర్నమెంటువారు తాము తయారు చేయుచున్న ఉప్పును తమ పెట్టుబడి ఖర్చులమీద నూటికి 1200 మొదలు 2000 రూపాయిలవరకు లాభము వచ్చునట్లు లెక్కలు వేసుకొని అంత పెద్దఖరీదుకు ప్రజల కమ్ముచున్నారు"

పండించిన ఉప్పు ఖరీదులో నూటికి 20 వంతుల సొమ్ము ఆ ఉప్పును కూడబెట్టుటకే అగుచున్నది గనుక వ్యాపార దృష్టితో చూచినను ఇది చేయతగినదిగా కనిపించదు. "ఉప్పు మీద పన్ను విధించడమంటే ప్రజలను పిండుకొనడము,

వారిని చితకమొత్తడమే. ప్రజలు ఈసంగతి గ్రహించారంటే, దేశమంతా అసంతుష్టితో నిండిపోతుంది. లాభాలమీద దృష్టిపెట్టుకొని, జనుల నిస్సహాయదరిద్రస్థితిని అండచూచుకొని, వారిని దోచుకొనుచుండిన కంపెనీ పరిపాలననాటి దురాచారములలో నిదియొక శేషము" అని రామ్సే మాక్డనాల్డు వచించాడు.

హిందూదేశమునకు కావలసినంత ఉప్పు అచ్చటనే తయారుచేసి ఉపయోగించుకొనుటకై సాధ్యమవుతుందా అన్న సమస్యను విచారించుటకై ఈమధ్యనే అనగా 1929 ప్రాంతమున ఒక టారిఫుబోర్డును నియమించినారు. ఈబోర్డువారు బంగాళారాష్ట్రములో విచారణచేస్తే అచ్చటి జనులు తమకు హిందూదేశములో తయారైన మురికి ఉప్పుకంటె ఛెషైరునుండి దిగుమతి అయ్యే తెల్ల ఉప్పే యెక్కువ యిష్టమని చెప్పినారట ; కనుక బంగాళారాష్ట్రమునకు సంబంధించినంతవరకు తెల్లఉప్పు దిగుమతికాక తప్పదని ఒక రిపోర్టు తయారు చేయబడినది. భారతీయులు నానాటికి విదేశములలోనుండి దిగుమతియయ్యేడి తెల్లఉప్పు, తెల్లటి మెరుగుబియ్యం, తెల్లటి జావా లేక జర్మనీ చక్కెర, తెల్లటి విదేశీగుడ్డ, బహుశా తెల్లటి విదేశీ పెళ్లికూతుళ్లమీద మోహము హెచ్చుచుండుట ఆశ్చర్యమే.

హిందూదేశీయుల శరీరతత్వములోనికో లేక, దేశము యొక్క రాజ్యాంగతత్వములోనికో ; అపసవ్యమైన ఈ అన్యా

పేక్ష తత్వమును తన్మూలమున వచ్చెడి ఆపత్పరంపరయు యేరీతిని వ్యాపించుచున్నవో, ఈ విషయములను విమర్శనతో పరించినచో స్పష్టము కాగలదు. ఉప్పువంటి ఒక సర్వసాధారణపదార్థము, ఇండియాకు 6000 మైళ్లదూరము నందున్న ఇంగ్లాండునుండి అనేక అగాధసముద్రములను దాటి ఏల ఇచ్చటకు రావలెనో, వచ్చి ఇక్కడ తయారగుచున్న ఉప్పుకంటె స్వల్పఖరీదుకు యేరీతిని విక్రయింపబడుచున్నదో తలచుకుంటే ప్రతీమనుజునకును ఆశ్చర్యమగును. వైస్రాయి దీనిమీాది పన్నును మణుకు రు 1—4—0 లు నుండి నాలుగణాలుమాత్రమే, మరేకారణమువల్ల కాకున్నను అసెంబ్లీని సంతుష్టిపరచుటకైనను, యేల తగ్గించకుండా సర్టిఫై చేయవలసి వచ్చెనో తలచుకుంటే మరీ ఆశ్చర్యము. ఈ మాత్రం సహాయంచేస్తే, ఆకాశము తనపట్టువీడి సముద్రంలో పడిపోతుందనా, సముద్రాలు పొంగిపొరలి దేశాన్ని ముంచేస్తాయనా, భూమిఅంతా బ్రద్దలై ముక్కముక్కలై పోతుందనా, లేక ఈ పన్ను తగ్గిస్తే సామ్రాజ్యం కూలబడుతుందనా! అవును, మొదటి మూాడూ జరగకపోయినా, నాలుగణాలు పన్నుతగ్గిస్తే నాలుగవదిమాత్రం తటస్థించి సామ్రాజ్యముయొక్క లాభములకు అపాయము కలిగిస్తుందన్నమాట నిస్సందేహము.

ఇటువంటి పని యెట్లాజరుగుతుందో కొంచెము విచారింతము. 1925-26 లో ఇండియానుండి యెగుమతులు 316 కోట్లరూపాయిలును, దిగుమతులు 256 కోట్లరూపాయలును

మాత్రమే. 60 కోట్లరూపాయిల వ్యత్యాసమున్నది; కాని ఇంతేకాదు. ఎగుమతులన్నీ ముడిపదార్థములే కనుక, వీనిని పడవలమీద ఇంగ్లాండుకు పంపవలె నంటే బోలెడుస్థలము నాక్రమించును. అక్కడనుంచివచ్చే తయారీ పదార్థములను నొక్కి బిగించి చాలా తక్కువస్థలముతో తీసుకొని రావచ్చును. తయారీ పదార్థములను హిందూదేశమునకు పంపించుట కయ్యేడి పడవలఛార్జీ కంటె, ముడిపదార్థములను తీసుకొనిపోవుట కయ్యే పడవలఛార్జీ చాలా యెక్కువై, తయారీ పదార్థములను పంపించుటవలన ఇంగ్లాండుకు వచ్చే లాభము చాలా తక్కువగును; తీసుకొనివెళ్లేవి పడవప్రత్తి అయితే, పంపించేది పెట్టెకు ఒట్టలేకాదూ! బరువులమాట అట్లాయుంచి పడవలలో ఆక్రమించె స్థలమును మాత్రమే పరిశీలించినయెడల దిగుమతులకయ్యే స్థలముకంటె యెగుమతుల కెక్కువస్థలము కావలసివచ్చును. మూడవవిషయ మింకొకటి కూడా కలదు. హిందూదేశమునకు చెప్పుకోదగినంత నౌకారవాణా వ్యాపారమైనను లేదు.* హిందూదేశమునుండి వెళ్లేవస్తువులు, ఇచ్చటికివచ్చే వస్తువులు కూడా విదేశీపడవలలోనే రవాణాలు బటువాడాలు జరుగవలెను. అనగా హిందూదేశపు ముడిపదార్థములను గొనిపోవుటకై, ఇక్కడికివచ్చే తయారీపదార్థములకు సరిపోవు నన్నిటికంటె యెక్కువ పడవలు వ్యర్థముగా రావ

---

* నౌకావ్యాపారమునకై వలయు వివరములను అందుకు సంబంధించిన అధ్యాయమునందు చూడవలెను.

లసివచ్చును. ఒక ప్రత్తియే కాదు, బియ్యం, గోధుమలు, కాఫీ, తేయాకు, నునుపుచేసిన, చేయనితోళ్లు నూనెవిత్తులు లోహముతో కూడిన రాళ్లు ఈ మొదలైన వన్నిటినీ తీసుకునివెళ్లుట కయ్యేస్థలముకంటె వీటితో తయారుచేసిన వస్తువులను తీసుకొనివచ్చుట కయ్యే పడవలస్థలము చాలా తక్కువగా ఉండునని మొట్టమొదటనే చెప్పితిమి. దూరదేశము నుండి ఉత్తపడవలు వచ్చేటప్పుడు గాలివానలకును తుపానులకును ఆగలేక ఒరుగుపాట్లు పడి దూరముగా కొట్టుకొనిపోవును. ఇందుకై వాటిల్లో యేదోయొక సరుకు క్రుక్కవలసినదే. మొట్టమొదట కొన్నిసంవత్సరములలో ఇండియాకు వచ్చే ఉత్తపడవల నిండా లండనులో మన్నుపోసి తెచ్చేవారు. అందువల్ల పడవ అడుగుభాగము చాలావరకు నీటిలోకివెళ్లి ఒరుగుపాటు రాకుండా రక్షించబడేది. ఇప్పుడు కలకత్తాలో దుకాణములన్నియు వెలయుచున్న చౌరంగీ అనే ప్రదేశము ఒకప్పుడు హుగ్లీనదినుండి కాళీఘట్టమునకు పోయే కాలువగా ఉండేదనిన్ని, లండను నుండి తెచ్చినమన్నంతా దానిలో పోయుచుండుటవలన అది పూడుకొనిపోయి అంగళ్లు కట్టుకొనుటకు వీలైనదనిన్నీ అనేకులకు తెలియకపోవచ్చును. ఆ దినములలో లండను పడవలు సామానుకొరకై ఆరేసివారముల వరకు లివరుపూలులో పడియుండవలసి వచ్చేది. అప్పటికీ పడవలు నిండకపోతే ఈ మన్నుపోసి ఇండియాకు బయలుదేరేవారు.

ఈ కష్టమునుండి తప్పుకొనుటకై, సరిగా నూరుసంవత్సరములక్రిందట సాల్టుకమీషను అను పేరట ఒక కమీషనును యేర్పరచినారు. ఈ కమీషనువారు మన్నుకు బదులు ఉప్పుపోసి పడవలకు బరువునెత్తి ఊగిపోకుండా చేసుకొనవచ్చునని నివేదించినారు. అయితే ఈ ఉప్పు ఏమిచేయుట అను ప్రశ్నవచ్చినది. దానిని అమ్మకం చేయాలి. హిందూదేశము ఉప్పుమీద పన్ను విధించకపోతే ఈ ఉప్పు చెల్లదాయెను. కనుక హిందూదేశపు ఉప్పుమీద మణుగుకు రు 3–8–0 లు చొప్పున పన్ను విధించినారు. దీనితో హిందూదేశపు ఉప్పు బజారులలో యెక్కడా లేకుండా మాయమైపోయింది. ఇంతకుముందు దక్షిణ ఇండియాదేశము కోరమండేలు మలబారు తీరముల యందుండెడి ఉప్పును బంగాళారాష్ట్రమునకు పంపి అక్కడనుండి బియ్యమును తెప్పించుకుంటూ వుండేది కనుక ఈ ఉప్పువ్యాపారము పడిపోగానే దానికి పెద్దదెబ్బ తగిలినది. హిందూదేశములో ఒకభాగము నుండి ఇంకొకభాగమునకు జరిగెడి కోస్తావ్యాపారము దీనితో నాశనమైనది. పల్లెవాళ్లు చేపలనుపట్టి తెస్తే, ఇంటిపట్లనుండిన మీలపడతులు వాటికి ఉప్పుపెట్టేవారు. ఈ ఉప్పు చేపలవ్యాపారమువల్ల వారుచల్లగా బ్రతికేవారు. సముద్రతీరమున గల ఉప్పుమన్నును కూడ వారు తాకరాదని నిషేధించినందువల్ల ఈబెస్తలవ్యాపారము అడుగంటినది. అహోరాత్రములు వారు ఉప్పుసముద్రములోను ఉప్పుమళ్లలోను ఉన్నప్పటికి, వారి గంజి

లోకి ఉప్పులేకుండా పోయింది. వారు ఉప్పునీటిని చేతితో తాకుటకు బదులు అందులో యెండుగడ్డిని ముంచి, ఆ పరకలను చేతులతో పదిలముగా ఇంటికి తెచ్చి, నిప్పుమీద మండపెట్టి ఆ బూడిద నొకపళ్లెములో పట్టి దానినే గంజిలో కలుపుకొని కాలక్షేపము చేసేవారు. క్రొత్తనాల్టు ఆక్టువల్ల అట్టివారికికూడ 500 రూపాయిలు జరిమానాయు ఆరుమాసములు శిక్షయు విధింపబడి నప్పటినుండీ ఇదికూడా తగ్గిపోయింది. వంశపారంపర్యా వచ్చేవారి పురాతనవృత్తి కంట్రాక్టర్ల చేతులలోకి పోయినది. వారు చేపలనూ పట్టరు, ఉప్పునూ పండించరు. ఉప్పుఅధికారుల తనిఖీకిలోబడి వారు కొన్ని నిర్ణీత భాగములకు మాత్రమే ఉప్పుచేపలను రవానా చేయుచుందురు.

ఈవిషయములు జరిగి ఒక శతాబ్దము గడచినది. మహాత్మా గాంధీ 1930లో ఉప్పు సత్యాగ్రహము ప్రారంభించిననాటినుండీ ఈకష్టము కొంచెముతగ్గినది. ప్రకృతి దేవత ఉప్పును తయారుచేసుకొని పోసే తీరప్రాంతమునందలి జనులు దానిని కొన్ని యేరుకొని తినగలుగుచున్నారు. కాని ఈకష్ట నివారణ శాశ్వతమైనదియుకాదు, సంపూర్ణమైనదియుకాదు. పంజాబులో ఉండెడి ఉప్పుగనులు ప్రపంచమునకంతటికిని 250 సంవత్సరములవరకును, ఇండియాకు 1000 సంవత్సరములవరకును సరిపడినంత ఉప్పును సరపరాచేయగలుగుచున్నను, సింధు యెడారులలో పడియుండెడి ఉప్పు ఇండియాకంతటికిని 200 సంవత్సరములకుపైగా సరపరా చేయగలుగుచున్నను, అచ్చటి

పేదలును పశువులును ఉప్పులేక చప్పగామాడిపోవలసి వచ్చు చున్నది. గడచిన మహాయుద్ధములో చెషైరు, ఏడెనులనుండి ఇండియాకు ఉప్పు రవాణాచేయుటకు వీలులేకపోయినప్పుడు హిందూదేశములో ప్రభుత్వమువారు ఉప్పు మళ్లను కాస్త విస్తరింపజేసిరి కాని 11-11-1914 తేదీని ఆర్మిస్టిసు (శాంతి సంధి) ప్రకటింపబడగానే ఇంగ్లీషు ఉప్పు ఈదురదృష్టసీమపైకి తిరిగీ దండయాత్ర సాగించుటకు ప్రారంభించినది.

కాళీపడవలకు బరువునెత్తుట మూలముగా చెషైరుఉప్పు హిందూదేశములోనికి దిగుమతికావడం ప్రారంభమైనది. కాని క్రమక్రమముగా ఒక్కఉప్పేకాదు, చెత్తవార్తాపత్రికల బస్తాలు, పోర్సులేనుముక్కలు, ఇటాలియను మార్బిలురాళ్లు నిలవ చేయబడినపండ్లు ఉర్లగడ్డలు తరువాత కనడానుంచి గోదు మలు జపానునుంచి బియ్యముకూడా ఈరీతినే దిగుమతికావడం ప్రారంభమైనవి. హిందూదేశములో తయారుచేయబడిన లేక పండించిన వస్తువులన్నిటికంటెను వీనిలో ప్రతివస్తువును చవుక. బజారుకువెళ్లి నీవు ఒకపౌను చక్కెర కొంటే, నీవు విదేశ చక్కెరయేకాదు, ఆచెక్కెరను పొట్లములుకట్టి యిచ్చెడి వార్తాపత్రికలనుకూడా కొనుక్కొందువు. ఈకాగితాలేమిటా యనినీకు ఆలోచన పుట్టినయెడల డెయిలీమెయిలు, డెయిలీ స్కెచ్చి, డెయిలీక్రానికలు, డెయిలీహెరాల్డు, డెయిలీన్యూసు, డెయిలీటెలిగ్రాఫు మొదలగు పత్రికలలోని వ్యాసములను నీవు పఠింపగల్గుదువు. ఈపత్రికల ఖరీదుకూడా చక్కెరఖరీదులోనే

చేర్చబడినది. పోర్సిలేనుముక్కలతో బొంబాయిలోని భవనముల నేలమట్టనము చేయబడుచున్నది. ఇటాలియను మార్బిలు బాలస్టు రూపముగా ఇక్కడకువచ్చి, జయపూరు మార్బిలు కంటెతక్కువ రయిల్వే రేటులకు రవాణాయై వివిధప్రాంతములలో అంతకంటెతక్కువ ఖరీదుకు చెల్లుచున్నది.

తిరిగీ ఉప్పువిషయమునకు వచ్చినయెడల, బ్రిటిషు ఉప్పు హిందూదేశములో సులభముగా చెలామణీ యగుటకుగానే, ఈఉప్పును తెచ్చుచున్న పడవలకంపెనీలవారికి వానిరాకలకయ్యే ఖర్చులు కిట్టుటకుగానే, ఈదేశపుఉప్పుపైని పన్ను అనే ఈఘోరదృశ్యము మన కగపడుచున్నదని తెలియగలదు. ఉప్పుపన్నును రు. 1-4-0లు నుండి రూపాయికి, లేక 1-3-11 కు తగ్గించేయెడల బాలస్టు రూపముగా వచ్చేవిదేశ ఉప్పు ఖరీదువల్ల దానిని తెచ్చినపడవలు ఇక్కడకు చేరుటకయ్యే ఖర్చులు కిట్టకనష్టమువచ్చుననిన్నీ ; నష్టంవస్తే ఇక్కడి ముడి సరుకులను గొనిపోయే పడవలు ఈదేశమును చేరలేవనిన్నీ ; ఇక్కడనుంచి ఈముడిపదార్థములు ఇంగ్లాండుకు వెళ్లకపోతే, ఆంగ్లేయులు నిరాహారులగుదురనిన్నీ ఇప్పటికి స్పష్టమైనది. ఉప్పుమీద పన్నుతగ్గిస్తే సామ్రాజ్యముయొక్క, లేదా కనీసము ఇంగ్లాండుయొక్క ఆర్థికలాభ వ్యవహారములకు పెద్దదెబ్బ తగులుతుంది ; కనుకనే గవర్నరుజనరలు 1929 లో ఉప్పు పన్ను నొక్కదమ్మిడీయైనను తగ్గించక అంతకుపూర్వముండిన రేటునే స్థిరిపై చేసినాడు.

## 3 వ అ ధ్యా య ము

### వ స్త్ర ము లు

హిందూదేశమునందు బ్రిటిషు సామ్రాజ్యముయొక్క అదృష్టరేఖ ఉచ్ఛస్థానమునకు లేచినది. హిందూ దేశమున బ్రిటిషు సామ్రాజ్యము నిర్మాణమగుటకు మార్గమును కట్టినది. ఈ ప్రాచీనదేశముయొక్క ప్రత్తి వస్త్రవ్యాపారము, హిందూదేశపు వస్తువులు వానినేతయొక్క సొగసువల్లను నునుపుదనమువల్లను నెంతయో ప్రపంచ ప్రసిద్ధిని బడసినవి. 1803 వరకు ఇంగ్లాండునుండి ఇండియాకు ఒక్క గజము దారమైనను దిగుమతి కాలేదు, సరేగదా ఈస్టుఇండియా కంపెనీ వారికివచ్చే లాభములో చాలామట్టుగ ఈదేశములో తాము కొనుక్కొనిన వస్త్రములను చాలా పెద్దఖరీదులకు ఇంగ్లాండులో అమ్ముకొనుటవలన కలుగుచుండెడివే. కాని 1783 లో స్టీము ఇంజనును కనిపెట్టుట, తరువాత స్టీముపవరు (ఆవిరిశక్తి) తో మగ్గములు నడిపించుట జరిగినపిమ్మట ఇంగ్లాండులో ప్రత్తి వస్త్రముల రచన ప్రారంభ మగుటయేకాక ఈశక్తి సహాయమున తయారైన అత్యంతమైన సరకును చలామణీ చేయుటకు విదేశములలో బజార్లు వెతుకుకొనవలసినంత అవసరము కూడావచ్చినది. 1829 లో 3 లక్షల రూపాయల విలువగల వస్త్రములు ఇచ్చటికి దిగుమతియైనవి. 1929 లో 66 కోట్ల రూపాయలు విలువగల వస్త్రములు 6 కోట్ల రూపాయల

విలువగల దారము, వెరశి 72 కోట్ల రూపాయల విలువగల ప్రత్తిసరకు ఇండియాకు దిగుమతియైనది. 1936 నాటికి లంకాషైరునుండి ఇక్కడకు దిగుమతియైన ప్రత్తిసరకు వెల $9\frac{3}{4}$ కోట్ల రూపాయిలని తెలుసుకొంటె కొంతసంతోషముగానే ఉంటుంది. ఇందులో $3\frac{3}{4}$ కోట్ల రూపాయల సరకు హిందూదేశము తానుతీసుకొనుటకుగాను మొగమోటముమీద సమ్మతించినదే. 1803—1936 మధ్యన జరిగిన ఈప్రత్తివస్త్ర వ్యాపారచరిత్రను మనము సంక్షిప్తముగా పరించవలెను.

1851 లో దేవారు బొంబాయి నగరమందు మొట్ట మొదటి స్పిన్నింగు అండు వీవింగు వరకు, (నేతమర) మిల్లును స్థాపించెను. దీనివలన హిందూదేశములో బాగా ప్రత్తిపండే ప్రదేశములను తమ పరిపాలనలోనికి బ్రిటిషువారు తీసుకొనవలెనని ఒక సూచన అందినది. బ్రిటిషువారి ఆశాదృష్టి ఈ విధముగా బీరారులపై బడినది. నైజామువద్దనుండి చాలా శోచనీయమగురీతిని ఈరాష్ట్రము నూడబెరుకు కొనుటకై మార్గములు పన్నబడినవి. వెలస్లీ ప్రభువు 1805 లో ప్రవేశపెట్టిన సబ్సిడియరీ అలవెన్సుల విధానము ప్రకారము, యుద్ధ సమయములలో బ్రిటిషువారికి సహాయముగా పంపించవలసిన సైన్యముయొక్క ఖర్చులను స్వదేశసంస్థాన ప్రభువులు భరించవలెనని మాత్రమే కోరుచున్నదికాని బ్రిటిషువారు ఈఖర్చులను లాగుకొని తీరవలెననికాని ప్రభువులు చెల్లించి తీరవలెననికాని యెట్టిబాధ్యతనూ విధించలేదు. అయినను, 1859 లో

ప్రకటింపబడిన జాన్ మాల్కోము లడ్లో రచించిన "ఇండియా పట్ల రాజు అవలంబించు వ్యవహార నీతిపైని భావములు" ("Thoughts on the policy of the Crown towards India") అను గ్రంథమును పఠించినయెడల, యెన్నోసా నెపములమీాద ఈప్రభువులు తమ సీమలలోని కొన్ని భాగములను బ్రిటిషువారికి ఈఖర్చులక్రింద యెట్లు ఇచ్చుకొనునట్లు చేయబడినారో తెలియగలదు. ఈ కంటింజెంటు అలవన్సులు నైజాము కొన్ని సంవత్సరములు చెల్లించకుండుటచే బకాయిూలు పడినవి. ఒకనిర్ణీతకాలములో దానిని చెల్లించవలెనని అతనకి తాఖీదువెళ్లినది. లడ్లో ఈరీతిని వ్రాయుచున్నాడు:—

"ఒక సంవత్సరకాలములో, 18 మాసములలోకూడా నైజాము ఈ అలవన్సులను చెల్లించలేదు. ఈఅప్పు తీరుమానము క్రింద కొన్ని భూములను తాత్కాలికముగ స్వాధీనము చేయునట్లు నైజామును నిర్బంధించుమని రెసిడెంటుకు వ్రాసినాము అని దాల్ హౌజీప్రభువు లీడెనుహాలుస్ట్రీటు యజమానులకు వ్రాసినాడు. కాని 1851 జనవరి 1 వ తేదిని వ్రాసిన ఇంకొక లేఖ (మినటు) లో 'అప్పు తీరుమానముక్రింద మనము తాత్కాలికముగ గైకొన దలచుకొన్న భూములను ఇక ముందుకూడా చెల్లించు చుండవలసిన అలవన్సులక్రింద, మనమే శాశ్వతముగా ఉంచుకొవలసివచ్చే పరిస్థితు లేర్పడు చున్నవి' అని ఆయన వ్రాసినాడు. ఏభూములను పుచ్చు

కొంటే మంచిదో ఆలోచించి చెప్పవలెనని, ఆభూము లను ఒహాలశా శాశ్వతముగానే ఉంచుకోవలసి వచ్చు నను మాట జ్ఞాపకముంచు కొనవలె ననిన్నీ వెంటనే రెసిడెంటుకు కబురుచేసినారు.

“ఇది 4—1—1851 తేదిని జరిగినది. ఈ డిమాండు ఏరీతిగా పెట్టవలెనా అను విషయమునుగూర్చిన్నీ, ఏభూము లను తీసుకుంటే మంచిదా అని ఆలోచించే విషయమును గూర్చిన్నీ తీర్మానమునకు వచ్చేలోపల మరో ఆరుమాసములు గడచినవి. 6—6—1851 వ తేదిని, ఈతీర్మానమును తెలుపుచు గవర్నరుజనరలు నైజాము పేర ఒక లేఖ వ్రాసినాడు. ‘ప్రస్తుతము అమలులోఉన్న ఒడంబడికల ప్రకారము కంటిం జెంటు సేనను తగినరీతిని భరించడము హైదరాబాదు ప్రభు త్వముపైని విధించబడిన తప్పనిసరి ధర్మము.’ అని అందు ఉదహరింపబడినది. ఇప్పుడు చేయుచున్న డిమాండు తాత్కా లికమైనది. అని వ్రాయబడినది. ‘ఈ డిమాండు ఉపసంహ రింపబడదు, వాయిదా వేయబడదు’ అని కూడా తెలుపబడి నది. ‘ఈ డిమాండులో ఉదహరింపబడిన జిల్లాలను వెంటనే రెసిడెంటుకు ఏ తత్పరిపాలనాబాధ్యతలు సర్వముతో స్వాధీ నము చేయవలసి యున్నది.’ అని కూడ తెలుపబడినది. ఈ స్వల్పడిమాండు చూచి నైజాము ఆశ్చర్యచకితుడైనాడని వింటే ఆశ్చర్యమవుతుంది. (దీనితో చేరిన మరికొంతభాగ మిక్కడ విడచిపెట్టబడినది.) బాకీలక్రింద భూములను మార్పు

చేయించుకొనుట గౌరవనీయమగు కంపెనీకి ఆచారముగా ఉండి యుండలేదని అతడు చెప్పినాడు."

కాని సుమారు మూడు మాసములలో అప్పును పూర్తిగా తీర్చివేతుననియు, ఇకముందు చెల్లించవలసిన కంటింజెంటు సక్రమముగా అందజేయుటకై తగిన జామీను ఇత్తుననియు నైజాము చెప్పినప్పుడు బ్రిటీషు రెసిడెంటున్ను ప్రభుత్వమున్ను మరీ ఆశ్చర్యచకితులైనారు. జిల్లాలను ఇచ్చివేయవలెనన్న తీర్మానమును వాయిదా వేసినారు. అసలు మొత్తములో సగముకంటె యెక్కువగా అనగా 340,000 పౌనులను బిల్లులరూపముగా నైజాము చెల్లించినాడు. తక్కిన 320,000 పౌనులను 31–10–1851 తేదీనాటికి చెల్లిస్తాననెను. అయితే నానాటికి ఇది మరీ బలిసిపోయినది. రెండవవాయిదా డిసెంబరు 5 వ తేదీ నాటివరకు చెల్లింపలేకపోయెను. అప్పుడైనను 87,000 పౌనులు మాత్రమే చెల్లించెను. మరో నెల్లాళ్లకు వాయిదా పొడిగించినారు. మరి కొంతకాలం కూడా పొడిగించినారు. పొడిగించుటకు కావలసిన అంగీకారమును ఇంగ్లాండునుంచి తెప్పించుకుంటూ వచ్చారు. ఈ వాయిదాల వల్ల అప్పు మరీపెరిగిపోయింది. 460,000 పౌనులకు పైగా పెరిగినది. 30–3–1853 తేదిని డాలుహౌజ్ ఇంటికి మరో ఉత్తరము వ్రాసినారు. 6–6–1851 తేదిని వ్రాసి ఉత్తరములోని అంశములనే తిరిగీ అనువదించినారు. కంటింజెంటును భరించవలసిన బాధ్యత ఎట్టి ఒడంబడిక ప్రకారమును నైజా

ముకు లేదని ఆయన ఒప్పుకొనెను. నైజాము చెల్లించవలెనని చెప్పుచున్న కంటింజెంటు ఖర్చులు అనవసరముగా చాలా యెక్కువైనవనియు అల్లు చెల్లించే మామూలుకంటె చాలా పెద్దవిగా ఉన్నవనియు అయన తెలిపెను. ఆయన సేనకూడా అంత ప్రశస్తమైనదికాదు అనిన్నీ అటువంటి సైనికులకు అంత కంటె తక్కువ జీతములిచ్చుచున్నారనిన్నీ కూడా వ్రాసెను. ఈ కంటింజెంటు సేన విషయమున ప్రభుత్వమువారు నైజా మును గూర్చి బాగుగా యోచించతగునని వ్రాసినారు. అప్పులక్రిందను, కంటింజెంటు సేన ఖర్చులక్రిందను భూమిని డిమాండుచేయవలెనని ఆలేఖను ముగించినాడు. కంటింజెంటు సేన నొకవేళ తొలగించినను, ఆ తొలగించబడిన కాలమున కయ్యే ఖర్చులకు సరిపడునట్లు డిమాండును తగ్గించుకుంటూ రావలెనని కోరినాడు. ఆమండలముల నిచ్చేవరకు రెసిడెంటు తొందర చేయుచుండవలెనని తెలుపబడెను. నైజాముకు తాను చేసుకోవలసిన ఒడంబడికయొక్క నమూనా పంపబడెను.

"ఇండియా ప్రభుత్వమువారు నైజాముతో జరిపిన రాయబారముల సందర్భమును, పార్లమెంటరీ పేపర్లలో తెలుపబడిన విషయములనుబట్టి పరిశీలించితే చాలును; స్వదేశసంస్థానాధీశులను వారెట్లు చూచుచుండిరో బాగా తెలియగలదు. ఆపేపర్లలో విషయములు చాలా క్లిష్టముగాను, అస్పష్టముగాను వ్రాయబడి యుండును. స్వదేశసంస్థానాధీశు

లంటే వారు చాలా నిర్లక్ష్యముగా చూతురు. ఆయింగ్లీషు భాషను అనువదించుటకైనను సాధ్యముకాదు.*

"నైజాముకు ఈ ఒడంబడిక యేమీ యిష్టములేదు. ఆయనకు ఒడంబడికే అక్కరలేదు. "నీవును లేక నీ వంటి మీవారును ఇదంతా నాశ్రేయస్సుకొరకే అని యెట్లు భావించుచున్నారో గదా! అని రెసిడెంటుతో అతడు చెప్పెను. అయినా ఈ క్రొత్త ఒడంబడిక నొకసారి చదివి ప్రాతదానితో పోల్చి చూస్తాననెను. ఒకరాత్రల్లా దానినే తిరగవేస్తూ మాట్లాడెను. ఆమర్నాడు (30–4–1853) ఉదయమున రెసిడెంటు అగు కర్నలు లో (తరువాత ఇతడే జనరల్ లో అయినాడు) ను కలిసెను. నైజాముకు ఇట్టి వాదసూక్ష్మతయు, ధారాళాసంభాషణాశక్తియు ఉన్నదని కర్నలు లో కు ఇంతవరకు తెలియదు. నైజాము ఈ రీతిని చెప్పెను. "నే నెప్పుడైనా బ్రిటిషుప్రభుత్వముపై యుద్ధము చేసితినా, కుట్రలు పన్నితినా, సహకారము తప్ప మరెట్టి వ్యతిరేకచర్యనైన నొన

* 24-6-1858 తేదీని బ్రైటుదొర ఉపన్యసించుచు దీని నూహించుకొనియే ఈ విధముగా చెప్పెనట్లున్నది. "హిందూదేశపు హృదయసీమయందు నివసించు లక్షలకొలది ప్రజలపై పరిపాలనమును చలాయించు ఒక సంస్థానాధీశునికి ఇండియా గవర్నరుజనరలు "కబడ్దారు! నీవు నా కాళ్లక్రింద ధూళివని జ్ఞాపకముంచుకో" అని వ్రాసినాడంటే ఇది ఊహింపసాధ్యమా! కామన్సుసభలో టేబిలుమీద ఇట్టికాగితముల నుంచునప్పుడు ఇటువంటి కొన్ని భాగములను వేరుగా తీసివేతురు.

రించితినా, వారికోరికల కెప్పుడైన యెదురుతిరిగితినా, విధేయ తను చూపలేదా, ఎందుకిట్లు వారు నన్ను అనాదరణము చేయు చున్నారు? సంస్థానప్రభువేనాడైనను చేయగల అవమానకర కార్యములు రెండేగలవు. మొదటిది అనవసరముగా తన వారస త్వపు భూములలో నేభాగమునైనను ఇంకొకరి కిచ్చివేయుట; రెండవది తనయెడల విధేయులై విశ్వాసపాత్రులై యున్న సైనికులను కొలువునుండి తప్పించుట.” కంటింజెంటు ఖర్చు లను ప్రతినెల 1 వ తేదినాటికి, కంపెనీ సేనలకన్నింటికిని వారు చెల్లించునట్లే, చెల్లింతునని వాగ్దానముచేసెను. తనమాట యందు నమ్మకము లేకుంటే ఇతరులను గ్యారంటీగా చూపు తాననెను. ఆయన అకస్మాత్తుగా తన పరిచారకుల నందరును దూరముగా పొండనిచెప్పి రెసిడెంటు నీ విధముగా బ్రతిమా లుకొనెను. “ఈ ఒడంబడిక తలంపును విసర్జించుమని గవ ర్నరు జనరలుకు మీరు నచ్చచెప్పిన యెడల నా కొకమహో పకారమొనరించి నట్లు కృతజ్ఞుడనుగా ఉండగలను. నేను బ్రిటి షుప్రభుత్వము వారికి చెల్లించవలసిన అన్ని బాపతుల సొమ్మును సకాలమున చెల్లించుచుందునని ఆయనకు మనవిచేయుము.” ఆఖరుకు ఈ మాటలను కూడా అనెను. “మీ వంటివారు కొన్నాళ్లు ఐరోపాలో ఉంటారు, కొన్నాళ్లు ఇండియాలో ఉం టారు. కొన్నాళ్లు నౌకా ఉద్యోగులుగా ఉంటారు, కొన్నాళ్లు వర్తకం చేసుకుంటారు—మీలో చాలా చాలా గొప్పవా రందరూ వర్తకులని నేను విన్నసంగతి—కనుక ఈ విషయ

మున నా కెట్టి భావములు హృదయవేదన ఉంటుందో మీరు గ్రహించలేరు. నేను సర్వాధికారములు గల పరిపాలకవంశము వాడను. ఈ రాజ్యంలో పుట్టి ఈ రాజ్యములో చస్తాను. ఏడు తరములనుండి ఈ రాజ్యము నా వంశమునకు చెందియున్నది. నా రాజ్యములో ఒకభాగమును శాశ్వతముగా మీ కిచ్చివేస్తే నేను సుఖముగా ఉందునని మీరు భావించుచున్నారు. అట్లు చేస్తే నేను సుఖింపగలననునది కలలోనివార్త. నాకు ఘోరమగు అవమానము జరిగినదని నేను భావింపవలెను. మహమ్మదు గొజుఖానును ఏ స్థితికి యీడ్చినారో ఆ స్థితిలోనే నన్నుకూడా ఉంచితే నేను చాలా సుఖంగా ఉంటానని మీ జాతివారెవరో అన్నారని నేను విన్నాను. ఒక ముసలిసేవకునికివలె నాకు పెన్షనుచెల్లించి, తినడం, నిద్రపోవడం, ప్రార్థించుకోవడం తప్ప వేరే పనిలేకుండా కూర్చోపెడితే... సార్వభౌమస్వభావము గల నా వంటివాని భావము లెట్లుంటునో గుర్తించగల శక్తి యైనను మీకున్నదా? 80,000 పౌనులు లేక 8 లక్షలరూపాయీలు ఈ ఒడంబడిక ప్రకారము నాకు సంవత్సరం 1 కి కూడికయగును గనుక నేనిందుకు సంతోషించవలెనని మీరన్నారట. ఇదుగో ఇప్పుడు చెప్పుతున్నాను వినుము. 8 లక్షలుకాదు గదా దానికి నాలుగురెట్లు యెక్కువసొమ్ము నాకు అందుమూలముగా కూడికయైనను, నాకు సంతృప్తికలుగదు, ఎందుచేత ననగా నా భూమిపోతే నా మర్యాదా నా గౌరవమూ పోయినట్లే." అంటే యేమిప్రయోజనం? ఏమిలాభం

లేకపోయినది. నైజాము తనమంత్రులను పిలిపించి యోచించెను. గవర్నరుజనరలు ఇంతకుముందే ఈ విధముగా తీర్మానమును చేసుకొనివుంటే ఇప్పుడేమీ లాభం లేదని వారు సలహా చెప్పినారు. ఈ విధముగా బీరారులు బ్రిటిషుప్రభుత్వము చేతులలోనికి పోయినవి. అప్పటిమట్టుగ అవి దత్తము కాక కౌలుక్రిందనే ఉండినను 1903 లో కర్జనుప్రభువు దానిని దత్తముగానే తీసుకొని నైజాముకు జి. సి. బి. అనే బిరుదమునొకదానిని దానికిబదులుగా ప్రసాదించెను—నైజాము, బిరుదాంకితుల జాబితాలో చేరిపోయెను."

పిమ్మట నాగపూరు లేక మధ్యరాష్ట్రముల వంతువచ్చినది. "బీరారులు నాగపూరునకు సింహద్వారము మాత్రమే" అని 1853 లో డాల్‌హౌజీప్రభువు కోర్టు ఆఫ్ డైరక్టర్సుకు వ్రాసెను. ఆ సంవత్సరం ఫిబ్రేవరినెలలో భాన్స్లే సంతానరహితుడై మరణించెను. ఆయన భార్యలకు దత్తతచేసుకొనే హక్కునియ్యలేదు. ఆయన ప్రాసాదమును సేనలు ముట్టడించినవి. రాణీలను కోటవెలుపలకు గెంటినారు, వారి నగలను విక్రయించివేసినారు. గుఱ్ఱములు ఏనుగులు పశువులు—సర్వం వేలం వేసినారు, కోట నాక్రమించుకున్నారు. హిందూదేశమునకల్ల నాగపూరే ప్రశస్తమైన ప్రత్తిపండే ప్రదేశము. బీరారులు దానికి సింహద్వారము మాత్రమే అన్నది నిజమైనది. ఈ విధంగా మధ్యరాష్ట్రములు, బీరారులు బ్రిటిషువారి చేతులలోనికి పోయినవి. డాలుహౌజీ చెప్పినట్లు ఇది వర్తకసంబంధమైన వ్యవహారము.

# 4 వ అ ధ్యా య ము.

## ప్రత్తిమీద సుంకములు (దిగుమతులమీదను, పంటమీదను)

హిందూదేశపు ప్రత్తిపరిశ్రమల చరిత్ర రాజకీయ ఆర్థిక విషయములతో మిశ్రమమైయున్నది. లంకాషైరు వాణిజ్య మభివృద్ధిని పొందుచున్న కొలదిని, ఇండియాదేశము దానికి అంగడిగా భావించఁబడుచు వచ్చినది. ఇండియా ప్రభుత్వము వారు లంకాషైరు లాభములకు అగ్రస్థానమును ఇచ్చుట సహజముగా జరిగిపోయినది. ప్రత్తివస్త్రములు దారములపై దిగుమతి పన్నులను ఎక్సైజు పన్నులను మనము ఉదాహరణముగా తీసుకొనవచ్చును.

ప్రత్తివస్తువులపైని దిగుమతి సుంకములు మొట్ట మొదట గవర్నమెంటువారికి ఒక ఆదాయముగా భావింపబడి మాత్రమే విధించబడినవి. ప్రత్తిదారముమీదను జమిలి నూలు మీదను 1859 లో ఆదాయముకొరకై పన్ను విధించబడి నపుడు లంకాషైరు ప్రతిఘటించెను. సెక్రటరీ ఆఫ్ స్టేటు దానిని తగ్గించుమని కోరెను. 1861 లో దీనిని తగ్గించినప్పుడు ఇండియా ప్రభుత్వపు ఫైనాన్సు సభ్యుడు దానిని బలపరచెను. ఆయన చెప్పిన వాదములేవన, బ్రిటిషు ఉత్పత్తిదారుల యొక్కయు, వాణిజ్యముయొక్కయు శ్రేయస్సునకు ఇది ప్రతికూలఫలము నిచ్చును. హిందూదేశముయొక్క ఆర్థికవ్యవహారనీతి ఇంగ్లాండుపై ఆధారపడి యున్నది — బ్రిటిషు లాభము

లకు అపాయకరమగునట్లు హిందూదేశములో విధించేపన్నును అణుమాత్రమైనను సహించుట కవకాశములేదు. అప్పటి లంకాషైరు పరిస్థితుల (దేశములోని యుద్ధములవల్ల వర్తకము క్షీణదశలో ఉండెను) లో ఈ తగ్గింపువలన కలిగేలాభములను ఒక్కదినము వరకైనను వాయిదా వేయుటకు ఆయనకు ఇష్టములేదు. 1882 లో ప్రత్తివస్తువు లన్నిటిపైనను సుంకములు తీసివేయబడెను. 1894 లో తయారై వచ్చిన వస్తువు లన్నిటిపైని ఖరీదునుబట్టి (advalorem) నూటికి 5 చొ॥ సుంకములను తిరిగి విధించినప్పుడు తిరిగి సెక్రటరీ ఆఫ్ స్టేటు ప్రతిఘటించెను. ఇండియాప్రభుత్వ మెంత ప్రతిఘటించి కాదంటున్నను, ప్రత్తి వస్తువులు అందులోనుంచి మినహాయించబడినవి. తరువాతను ఆపన్ను తిరిగీ విధించబడినది కాని, హిందూదేశపు పవరుమిల్లులలో తయారయ్యే 20 మొదలు 30 వరకుగల నెంబర్లు అంతకుమించిన నెంబర్ల నూలుమీద నూటికి 5 వంతున విధించబడిన ఎక్సైజుడ్యూటీ దానికి పోటీగా పెట్టబడినది. 1896 లో పరిస్థితులు విషమించినవి. ప్రత్తి వస్త్రముల దిగుమతిమీద నూటికి 3½ వంతున పన్ను తగ్గించబడుటయే కాక, ఇండియను మిల్లులలో నేయబడిన ప్రత్తి వస్త్రములపై నూటికి 3½ వంతున పన్ను హెచ్చింపబడినది.

పిమ్మట 1914—18 ఐరోపా యుద్ధసమయమునకు వత్తము. యుద్ధములో ఇండియాదేశపు మిల్లుదార్లు, మితవా

దులు, వర్తకులు ప్రభుత్వమునకు చెప్పతరముకాని సేవ నొన రించిరి. సిపాయిలను చేర్పించుట, యుద్ధబాండులను కొనుట మాత్రమేకాక, యుద్ధపుఖర్చుకై హిందూదేశము 349 కోట్లు ధనము నిచ్చెను. ఎందరో సిపాయిలు ఆయుద్ధములో మరణించిరి. యుద్ధములో విదేశీవస్త్రముల దిగుమతి దానంతట అదే పడిపోయినది. 1916 లో దిగుమతి సుంకములు మొత్తముమీాద నూటికి 5 నుంచి 7½, 10 వరకు పన్ను హెచ్చింపబడుటవలన, హిందూదేశపు ప్రత్తి వస్త్రములపై విధించబడిన పన్ను మునుపటివలెనే ఉన్నప్పటికిని, ఇండియను మిల్లులు మంచి వ్యాపారమునే చేయగల్గినవి; కాని యుద్ధానంతరమున అవి తిరిగి కష్టముల పాలాయెను. సహజముగా వారు దీనిని గురించి పెద్ద ఆందోళనముచేసిరి. గవర్నమెంటువారి నుండి కొన్ని సదుపాయములను పొందగలుగుటలో విజయమందిరి. 1917 లో ప్రత్తి వస్తువుల దిగుమతులపై సుంకము నూటికి 3½ నుండి 7½ కు లేచినది. ఇండియాలో తయారయ్యే ప్రత్తి వస్తువులమీాద పన్ను మునుపటివలెనే నూటికి 3½ చొప్పున ఉంచబడినది.

తరువాత సంవత్సరముల చరిత్రను సంక్షిప్తముగా చెప్పవచ్చును. 1920—21 లో దిగుమతి వస్తువులన్నిటిమీాద ఖరీదునుబట్టి నూటికి 7½ చొప్పున ఉండిన సుంకములు 1921—22 లో 11% చొప్పునను, 1922—23 లో 15% చొప్పునను హెచ్చించబడియుండగా, ప్రత్తివస్తువులపై 1920-21 లో

నూటికి $7\frac{1}{2}$ చొ॥ నున్న దిగుమతి సుంకములు 1921-22 లో 11% వొప్పున హెచ్చి 1922–23 లో కూడ అదేరీతి నిలచి పోయెను. ఈ సంవత్సరములలోనే దిగుమతి చక్కెరపైని పన్ను నూటికి 10, 15, 25 గాను, భోగ్యవస్తువులపైని నూటికి 10, 20, 30 గాను, చుట్ట, సిగరెట్టులపైని నూటికి 50, 75, గాను ఉండెను.

1922–23 లో దిగుమతి సుంకములన్నియు 15% కు హెచ్చించబడినప్పుడు ప్రత్తి వస్తువులమీద కూడా ఆరీతినే హెచ్చించవలెనని మనదేశీయులు కోరగా, హిందూదేశపు మిల్లుల ప్రత్తి వస్తువులపై ఎక్సైజు పన్నుకూడా $3\frac{1}{2}$% నుండి $7\frac{1}{2}$% కు హెచ్చిస్తామని ప్రభుత్వము వారన్నారు. రెండవ దానిని అసెంబ్లీ ఓడించినది. మొదటి దానిని ఉపసంహరించు కొన్నది. హిందూదేశపు మిల్లుపరిశ్రమ అనుభవించుచుండిన ఈ మంచిదశ 1923 లో ముగిసినది. మిల్లు సొంతదార్లందరును ఆర్థికదుస్థితికి పాలైనారు. వారు యెంతో ఆందోళనచేసిన పైని ప్రత్తిమీద ఎక్సైజుడ్యూటీ యెత్తివేయబడినది. ఇంతకు ముందే దిగుమతి వస్త్రములపైని సుంకము 7% నుండి 11% కు హెచ్చింపబడి యుండుటచేత మిల్లువాళ్లకు విదేశీవస్త్రవిక్రయులను కాదని 4% సౌకర్యమెక్కువ కూడియుండుటచేతను, ఈ $3\frac{1}{2}$% ఎక్సైజుడ్యూటీ తీసివేయబడుటచేతను వారికి మరో $3\frac{1}{2}$% అనగా 4% + $3\frac{1}{2}$% మొత్తము $7\frac{1}{2}$% అధిక సౌకర్యము చేకూరినది.

మిల్లుసొంతదార్లు ఈరీతిని చంకలు గ్రుద్దుకొనుచుండగా ఫైనాన్సు మెంబరు సర్ బేసిల్ బ్లాకట్టు కుడిచేతితో యిచ్చిన దానిని యెడమచేతితో తీసికొనినాడు. ఇంతకుముందున్న రూపాయికి 1 షిల్లింగు 4 పెన్సులను 1 షిల్లింగు 6 పెన్సులకు హెచ్చించెను. (2 పెన్సులు లేక $\frac{1}{8}$ వంతు లేక $12\frac{1}{2}\%$ హెచ్చించెను.) అనగా విదేశవస్త్రములను దిగుమతిచేసేవారు ఇండియనుమిల్లు వారిమీాద $12\frac{1}{2}\%$ ఎక్కువ సౌకర్యమును పొందగలిగినారు. ఇండియనుమిల్లుదార్లు తమకు $7\frac{1}{2}\%$ ఎక్కువ సౌకర్యమువచ్చినదని పొంగుకొనుచుండగా, ఇందువల్ల విదేశదిగుమతిదార్లు $12\frac{1}{2}\%$ అధికసౌకర్యము ననుభవించిరి. ఈ $12\frac{1}{2}\%$లో నుంచి మిల్లువారనుభవించుచుండిన $7\frac{1}{2}\%$ సౌకర్యమును కొట్టివేయగా మిగిలిన 5% న్ను విదేశవస్త్రకారులకు నికర సౌకర్యమైనది. ఇండియాప్రభుత్వమువారు ఇండియను ఆర్థికవిషయములలో సలుపుచున్న గారడీలకు ఇది చక్కని నిదర్శనము. కాని మిల్లుదారులూరకొనక ఆందోళనను తిరిగీ ప్రారంభించినారు. 1930 లో బ్రిటిషేతర వస్త్రములపైనుండెడి దిగుమతి సుంకము 11% నుండి 20% కు హెచ్చింపబడగా, బ్రిటిషు వస్త్రములపై, ఒక్క పూరా కోరావస్త్రములపైతప్ప తక్కిన వానిపై 15% సుంకమే విధించబడెను.

బ్రిటిషుదిగుమతుల ఎక్కువ సౌకర్యమునకే సామ్రాజ్యహిత (Empire preference) సిద్ధాంతమంటారు. ఆసిద్ధాంతమెంతచక్కగా ఆడబడినదో ఈ ఉదాహరణమువలన

తెలియుచున్నది. ఈ ఆటయొక్క అసలురహస్యమేమిటంటే హిందూదేశములోనికి తప్పుడుత్రోవలద్వారా తన ప్రత్తి వస్త్రములను రవాణాచేయుచున్న జపాను పన్నాగముల నోడించుసంకల్పమే.

1930 యేర్పాటు నిజముగా చాలాచురుకైనదే. అతి త్వరితముగ పెరుగుచున్న జపానుప్రత్తి వస్త్రపరిశ్రమ నణగ ద్రొక్కుటకు ఇదిమంచియెత్తే. కాని ఇంగ్లాండు దేశమిప్పుడాడ వలసిన ఆట సామాన్య దేశముతోకాదు; పడమట తానెంత టిదో, తూర్పున తనసోదరియై వెలుగుచున్న తనంతటి జపాను దేశముతో. రెండుజాతులవారును ద్వీపనివాసులే, ఇద్దరును తూర్పుఖండమునందు అంగళ్లకై తాపత్రయపడి వెదుకుకొను చున్నవారే. ఇద్దరికీ సామ్రాజ్యములే కావాలి. ఒకరినొకరు ఓడించలేరు. జపాను తన పడవలకంపెనీలవారి నందరినీ రెండిం టిలో ఏదోయొకటి చేసుకోమన్నది. బ్రిటిషువస్త్రములపై కంటె జపానువస్త్రములపై ఇండియాప్రభుత్వము 5% ఎక్కువ సుంకమును విధించినది కనుక జపానువస్త్రములను మునపటి కంటె 5% తక్కువరేటులకు ఇండియాకు జపానుపడవలకంపె నీలు తీసుకొనిపోయినను సరే, లేదా, అసలే ఛార్జిలేకుండా జపాను వస్త్రములను ఇండియాకు తీసుకొనివెళ్లినాసరే ఈవిధంగా చేయకపోతే, ఇండియాప్రభుత్వమువల్ల జపాను వస్త్రము ఎగుమతిదారులపై విధించబడిన పన్నునుండి వారిని రక్షించి పైయెత్తుకు మారుయెత్తువేయుటసాధ్యముకాదని

చెప్పింది. జపాను పడవలవారు మొదటిమార్గమునకు ఒప్పు కున్నారు. కనుక జపాను వస్త్రములు బ్రిటిషువస్త్రములతో సరిసమానమగు రేటుతో పోటీచేయగలిగినవి. ఇంతేకాదు. జపాను స్వయం పరిపాలక దేశము. జపానుపడవలవారికి ఈరీతిని వచ్చినసష్టమును జపానువారు చెల్లించే మొత్తపు ఆదాయము నుండి ముదరాయిచ్చి వారి దేశాభిమానము నారీతిని బహూ కరించెను.

హిందూదేశము ఇంగ్లాండు వారి దయాదాక్షిణ్యము లకు పాత్రమై అటమటించుచుండగా, జపానుదేశము ఇంగ్లీషు వారి యెత్తులకుపై యెత్తులువేసి, వస్త్రములు యెగుమతిదార్ల కైన నష్టమును పడవలవారిమీద త్రోసి, వారిపై బడిన భార మును జపాను ప్రజలందరిపై సర్దుటకై యెక్కువ పన్నులనువేసి ఆ ఆదాయమునుండి వారికి ముజరాలిచ్చి ఈగండమునుండి శరవేగమున తప్పుకొనినది. ఇంగ్లాండు తాను జపానుతో తంత్ర ములకు సరిపోజాలనని తెలిసుకొని 1931–32 బడ్జెటులో ఇండి యాకు వెళ్లేవస్తువులపైని, ప్రత్తివస్త్రములతోసహా, 5% దిగు మతి సుంకముల నెక్కువ (Surcharge) చేసుకొన్నది. దీనికి కారణము ఆర్థికవ్యవహారములను పూటుచేసుకొనుట తప్ప వేరేదియునుకాదు. ఇందువల్ల ఇంగ్లీషువస్త్రములను పంపించు టకయ్యేఛార్జీలు, తన్మూలముగా వాటిఖరీదులుకూడా యథా స్థానమునకు వచ్చినవి.

కాని ఈపర్యాయము అహమ్మదాబాదు మిల్లులతో అది ఢీకొన వలసివచ్చినది. ఆమిల్లులు లంకాషైరు సన్నని వస్త్రములతో పోటీచేయ ప్రారంభించినవి. అదిచేసిన సర్ ఛార్జిని పూటుచేసుకొనుటకును ఈమిల్లుల కొకదెబ్బ కొట్టుటకును ఈజిప్టు అమెరికాలనుండి ఇక్కడికి దిగుమతిఅయ్యే ప్రత్తి మీాద పౌనుకు ½ అణా చొప్పున పన్ను హెచ్చించినది. లంకాషైరు సన్నవస్త్రములతో ఈమిల్లులు పోటీచేయ గలుగుటకు ఈప్రత్తిని కొనుక్కొనక తప్పదు కనుక వాటిఛార్జీలు హెచ్చినవి. ఈవిధముగా సర్‌ఛార్జివల్ల ఇంగ్లాండుకు వచ్చిననష్టమును ఈక్రొత్తరీతిని పూటుచేసుకొని, ఇండియను మిల్లుదారులను తనను మించిపోకుండా చేసుకొన్నది. ఏలననగా ఆ సర్‌ఛార్జీ మొత్తమును ఈక్రొత్తపన్ను మొత్తమును ఒకటితో ఒకటి సమానమైనవి.

తరువాత జరిగిన సుంకముల చరిత్రకూడా చిత్రంగానే ఉంటుంది. 1931—32 సంవత్సరము ముగిసేలోపలనే, దిగుమతి సుంకముల నన్నింటిపైనీ, ప్రత్తిపైనికూడా, 25% సర్‌ఛార్జీని ఫైనాన్సుమెంబరు విధించెను. ఇందుమూలముగా బ్రిటిషు ప్రత్తి వస్త్రములపై 25% దిగుమతిసుంకమును, బ్రిటిషేతర ప్రత్తి వస్త్రములపై 31¼% దిగుమతిసుంకములను విధించినట్లు తేలినది, కాని జపానును ఈవిధముగాకూడా కొట్టివేయుటకు సాధ్యమైనదికాదు. అది తన యెన్ను ఖరీదును తగ్గించుకొని, తనవస్త్రములను ఇండియాలో చౌకగా అందేటట్లు చేసు

కొన్నది. బ్రిటను కొన్ని సంవత్సరముల క్రిందట చేసినట్లే జపాను ఇప్పుడొనరించినది. బ్రిటనుకు ఆంగ్లోజపాను వర్తకపు టొడంబడిక ప్రకారము ఇంతకంటెకూడా పన్నులు హెచ్చించి ఈదెబ్బనుండి తప్పుకొనుటకు సాధ్యముకాదాయెను.

అయినా టారిఫుబోర్డువారు ఊరుకోలేదు. బ్రిటిషేతర కోరావస్త్రము లన్నిటిపై 1932 లో 50% కున్ను 1933 లో 75% కున్ను సుంకములను హెచ్చించినారు. 1932, 1933 సంవత్సరములమధ్య ఆంగ్లోజపాను ఒడంబడిక అంతమైనది. అయినను, జపాను తన యెత్తులనుండి విరమించలేదు. హిందూదేశపు ప్రత్తిని తాను బహిష్కరింప తీర్మానించుకొని జపానీజు ట్రేడు డెలిగేషనును ఇండియాకు పంపెను. జపాను, ఇంగ్లాండు రెండు దేశములును హిందూదేశపు అంగళ్లను జూరగొనవలెనని ఒకటితో నొకటి పోటీచేయుచున్న సందర్భమున ఇట్టిచర్యలు తప్పునా! మూడుపక్షముల ఒడంబడిక ఒకటి జరుగక తప్పినది కాదు, జపాను ఇండియాలమధ్య ఒకటి, ఇండియా ఇంగ్లాండుల మధ్య ఒకటి,జపాను ఇంగ్లాండులమధ్య ఒకటి. మనకు మొదటి రెండు ఒడంబడికలతోటే ప్రసక్తి కలదు, వానిలో కూడా ఇంగ్లాండు ఇండియా ఒడంబడికతో ప్రసక్తి, ఈ గ్రంథము యొక్క ఉద్దేశమునుబట్టి, మరీయెక్కువగా ఉన్నది.

బ్రిటిషుప్రత్తివస్త్ర నిర్మాతల డెలిగేషను ఒకటి సర్ విలియమ్ క్లారీలీజుయొక్క నాయకత్వముక్రింద ఇండియాకు వచ్చెను. ఇండియాతరపున బొంబాయిమిల్లు ఓనర్సు అసోసి

యేషనువారు దానితో సంప్రతించిరి. తక్కిన హిందూదేశము నకుకూడా ఈప్రత్తి పరిశ్రమయందు సమానముగా పాల్గొన వలసిన బాధ్యత యున్నను ఈ విషయ పరిష్కారములో దానికి స్థానముకాని వోటుకాని లేకుండెను. బొంబాయిమిల్లు ఓనర్సు అసోసియేషనుకు సర్ హెచ్ మోడీ మొనగాడై యుండెను. కనుక ఇంగ్లాండు ఇండియాలమధ్య జరిగిన ఈ ఒడం బడికను మోడీలీజు ఒడంబడిక యందురు. ఈ ఒడంబడికవల్ల ఇండియాదేశపు ప్రత్తిపరిశ్రమవారికి ఏమిసౌకర్యము లీయఁ బడినవి? వస్త్ర విషయములో సామ్రాజ్య హిత (Imperial preference) సిద్ధాంతము తిరిగీ ప్రవేశపెట్టినారు. ఇండియాకు బ్రిటిషు దిగుమతుల నుండికంటె బ్రిటిషేతర దిగుమతులనుండి యెక్కువరక్షణ మొనగబడినది. 1931 అక్టోబరులో మొత్తము విదేశీవస్తువు లన్నిటిపైని విధించబడిన 25% సర్ చార్జీ యెప్పు డైనను తీసివేయ బడినయెడల, ఇండియాకు దిగుమతి యయ్యెడి బ్రిటిషు వస్తువులపైని పన్నును విధించుటకు ఇండియా ప్రయ త్నించ కూడదు. ఇండియాకు దిగుమతి అయ్యెడి బ్రిటిషు ప్రత్తిదారముపై విధించబడినపన్నును తగ్గించి దానికొక క్రొత్త సౌకర్యమునుగూర్చినారు. బ్రిటనులో తయారై ఇండియాకు దిగుమతియయ్యెడి కేవలము కృత్రిమపు పట్టువస్త్రములపై నుండెడిపన్నును 50% నుండి 30% కు తగ్గించియు, ప్రత్తిలో కల సిన కృత్రిమపు దారముపై విధించబడినపన్నును 35% కు తగ్గిం చియు వానికికూడ సౌకర్యములను గూర్చిరి. దీనికి బదులుగా

ఇండియాకు యేమివచ్చినది? ఇండియాలో బ్రిటిషువస్తువుల కెట్టిసదుపాయములు చేయబడినవో విదేశములలో హిందూ దేశపువస్తువుల కట్టి సదుపాయములే జరుగునట్లు బ్రిటను యేర్పాటులు చేస్తానన్నది; ఇండియాప్రత్తిని మునుపటికంటె యెక్కువగా తాను కొనుక్కుంటానన్నది.

ఇండో జపానీజు ఒడంబడికతో మనకు ఇప్పుడు సంబంధము లేకపోయినను, దాని ప్రధానసూత్రములను ఈదిగువను పొందుపరచవచ్చును. హిందూదేశమునకు జపాను నుండి వచ్చెడి వస్తువులన్నిటిపైని 50% టో, లేక పౌను 1కి $5\frac{1}{4}$ అణా లో యేది యెక్కువైతే అంతగరిష్ఠమైన దిగుమతి సుంకము విధించబడినది. ఇండియానుండి 10 లక్షల బేలుల ప్రత్తిని ప్రతిసంవత్సరము జపాను తీసుకొనుటకును, 35 కోట్ల గజముల దారమును ప్రతిసంవత్సరము ఇండియా గ్రహించుటకును ఒడంబడిక చేయబడినది.

1930 లో ప్యాసుచేయబడిన కాటను ప్రొటెక్షను ఆక్టుకు ఫలితముగా సంభవించిన విషయములను మనము ఇక్కడ పరిశీలించవలెను. ఆ ఆక్టు మూడుసంవత్సరములు మాత్రమే అమలు జరుగవలసినది. ఇండియా ప్రత్తివ్యాపార మింతవరకు కొన్నిసౌకర్యములను అనుభవించు చుండెను కనుక ఆ ఆక్టు ముగియులోపల దాని ఫలితములను విచారించుటకై 1932 లో ఒక విచారణను జరిపించినారు. టారిఫ్‌బోర్డువారు మరికొంత రక్షణము నీ పరిశ్రమకు ఒసంగవలెనని అభిప్రాయమును

తెలిపినారు, కాని వారి రిపోర్టు సకాలమున ప్రకటింపబడ లేదు. అది 1932 సెప్టెంబరులోనే తయారైనను 1934 లో ప్రకటింపబడినది. ఈ మధ్యకాలములో ఏమేమి సంగతులు జరిగినవో చూడవలెను. ఈ లోగానే మోడీలీజు ఒడంబడిక, ఇండోజపాను ఒడంబడిక, ఒట్టావా ఒడంబడిక జరిగిపోయినవి. కనుక ఈ నివేదిక దొంగ తప్పుకొనిపోయిన తరువాత తలుపులకు గడియలు బిగించినట్లైనది. మూడు ఒడంబడికలపైనను సంతకములై పోయిన తరువాత 1934 లో 1932 నాటి ఈ టారిఫుబోర్డునివేదిక ప్రకటింపబడుటచేత, ఇది కేవలము కాలాతీతమే కాక, ఈ మూడు ఒడంబడికలలోని విషయములకు కూడ వ్యతిరేకమైన ధోరణిలో నున్నది. కనుక 1934 లో ప్రకటింపబడిన కాటన్ టెక్స్టైలుఆక్టు, ఇండో జపానీజు ప్యాక్టును ఆంగ్లోఇండియను ప్యాక్టును బలపరచినదే కాని అంతకంటె మరే విశేషమును లేదు. ఒట్టావా ఒడంబడికయు, దానివల్ల జరిగిన అనర్థమును వేరే అధ్యాయమునందు వివరింపబడవలసి యున్నవి.

ఇండియాకు నూతనచట్టము ప్రసాదించిన స్వరాజ్యము వల్ల బ్రిటిషు ఆర్థికసామ్రాజ్యసౌకర్యముల కెట్టిభంగమును కలుగకుండు రీతిని యెట్టి శాశ్వతకట్టుదిట్టములు చట్టములో నిర్మింపబడినవో ఈ గ్రంథాంతమునందు తెలుపబడును.

# 5 వ అ ధ్యా య ము

## ఒట్టావా ఒడంబడిక

ఒట్టావా ఒడంబడికను గత అధ్యాయములో పూర్తిగా చర్చించక ఈ అధ్యాయమునకు విడచిపెట్టితిమి.

( మొదటి, రెండవ రౌండుటేబిలు కాన్ఫరెన్సులలోని చర్చలు )

ఇండో బ్రిటిషు ట్రేడు అగ్రిమెంటు రూపముగాను, 1935 వ ఇండియా ప్రభుత్వపు చట్టమునందలి వాణిజ్యరక్షణల రూపముగాను పరిణమించుటకు ముందే ఒట్టావాలో ఒకవింత కార్యము నాటకమువలె జరిగినదే. దీనినే ప్రపంచచరిత్ర యందు ఒట్టావా ఒడంబడిక యందురు. ఈ ఒడంబడిక భరతఖండము నందలి రాజకీయవాణిజ్యచక్రములలో యెంతో ప్రతిఘటనమును కలుగజేసి ఒక తుపానువలె చెలరేగినది.

21—7—1932 తేదిని ఒట్టావాలో జరిగిన సభయందు హిందూదేశపు డెలిగేటులని ప్రస్తుతింపబడినవారు, అతుల చాటర్జీ, రైనీ, చెట్టి గార్లు, ఇండియాప్రభుత్వము వారిచే కోరి పిలిచి కూర్చుండబెట్ట బడినవారే. ఈ సభకు అధ్యక్షుడు హెయిల్షాముప్రభువు. ఈ డెలిగేషనును నిర్ణయించువిషయమున హిందూదేశ ప్రజాబాహుళ్యము యొక్క అభిప్రాయము నాలోచించలేదు. హిందూదేశ వాణిజ్యసంఘముల మొఱ్ఱను వినలేదు. ఆగష్టు ఆఖరువారములో ఒకనాటి తెల్లవారుజా

మున ప్రజలు నిద్రలనుండి మేలుకొనేటప్పటికి ఒక పెద్దజాబితా నిండాగల వస్తువులన్నింటిపట్ల ఇండియా ఎంపైరు ప్రిఫరెన్సును అంగీకరించినట్లు ఒక ప్రకటనవల్ల తెలిసినది. కాని ఇండియను డెలిగేషనువారి నివేదిక ప్రకటింపబడుటకు పూర్వమే తరతరములవారిని కూడ బంధించగల విశేషమైన మార్పులు ప్రవేశపెట్టబడినవి. ఒడంబడికమీాద 28—8—32 తేదిని సంతకములు జరిగి ఇండియాప్రభుత్వమువారు అంగీకరించి యుండగా,— 1932 నవంబరు మొదటివారములో ఇవతల డెలిగేషనువారి నివేదిక ప్రకటింపబడిన వెనువెంటనే ఆ ఒడంబడిక లెజిస్లేటివు అసెంబ్లీయెదుట నుంచబడినది. ఈ ఒడంబడికపైని డెలిగేషనువారు ఇతఃపూర్వమే సంతకములు పెట్టుటయు ఇండియా ప్రభుత్వమువారివల్ల అంగీకరింపబడుటయు జరిగినవి గనుక దీనిని తాముకూడా అంగీకరింపక తప్పదని శాసనసభా సభ్యులపై ఒక నిర్బంధము పడినది. ఇట్టిపరిస్థితులలో ఒక కమిటీని యేర్పరచినారు. ఈ కమిటీవారు కొన్నిగంటలసేపు మాత్రమే చర్చించి, దీనికి ప్రతికూల సాక్ష్యమెంత వచ్చినను లక్ష్యముచేయక, ఒక రాజీపద్ధతిని సూచించిరి. ఈ రాజీప్రకారము ఈ ఒడంబడిక మూడు సంవత్సరముల పర్యంతము మాత్రమే అమలులో ఉండవలెననిన్నీ, ప్రతిసంవత్సరమును ఇది యెట్లు పనిచేసినదో దీనిఫలితము లెట్లున్నవో తెలుపు నివేదికలు ప్రకటింపబడవలెననిన్నీ ఒక డిమాండుచేయబడెను. ఈ రాజీకి భారతశాసనసభ అంగీకరించినది.

ఈ ఒడంబడిక ప్రకారము ఇండియానుండి బ్రిటనుకు వెళ్లే కొన్నివస్తువులకు బ్రిటను కొంతసౌకర్యమును చూపుట కును బ్రిటనునుండి ఇండియాకువచ్చే కొన్నివస్తువులు, వీనిలో అనేకము తయారీవస్తువులే, పైని ఇండియా 10% ప్రిఫరెన్సు సౌకర్యమును చూపుటకు అంగీకరించినది. ఇంతకుముందే బ్రిటిషు ఉక్కుకును వస్త్రములకును ఇండియా సౌకర్యమును చూపుచుండెను. ఇండియానుండి వెళ్లే తేయాకుకు బ్రిటను సౌకర్యమును చూపుచుండెను. ఇండియను జనుపనారకు, బియ్యముకు, వార్నిషుచేసే లక్కకు మరికొన్ని పదార్థము లకు బ్రిటను ప్రిఫరెన్సు చూపుచుండెను. అసలు సంగ తేమిటనగా, రెండేసి జాతులమధ్యను అనేకజాతులమధ్యను జరుగుచుండిన ఈ ఒడంబడికల కాధారమైన పరస్పరసహాయ తత్వము హిందూదేశములో యెక్కడను నిజముగా జరుగు చున్నట్లు కనబడదు. మన యెగుమతులలో ⅓ వంతుమాత్రమే బ్రిటనుకు వెళ్లుచుండగా, మనకు కావలసినది తక్కిన ⅔ యెగు మతులు వెళ్లేదేశముల వారి సద్భావమైయున్నది. ఇట్లు చేయక, మనము బ్రిటనుకు నిర్బంధముగా సౌకర్యములు కలుగ జేసి, తక్కిన బ్రిటిషేతరులను మనకు ప్రతికూలురుగా చేసు కొనుచున్నాము. ఇండియానుండి ఇంగ్లాండుకు వెళ్లేపదార్థము లలో నెల్లా చాలా ముఖ్యమైనవి తేయాకు, జనుపనార. వీని విషయమున బ్రిటను ఇండియా కెట్టిసౌకర్యములను గాని చేయ లేదని మనము ఇంతకు ముందే చూచియున్నాము. ఒట్టావా

ఒడంబడికలో ఏ స్థానమునూ లేని సిలోను తేయాకుకు కూడ ఇట్టి ప్రెఫరెన్సునే బ్రిటను ఇచ్చుచున్నది. ఇండియను తేయాకుమీద ఇంతకంటె యెక్కువపన్నును విధిస్తే, బ్రిటనులో తేయాకు ఖరీదు పెరిగితే నీరు త్రాగేవారికి బాధకలిగించినట్లగును; ఇండియాలో తేయాకు తోటలవారికి కూడ ఇందువలన నష్టముకలుగును. అత్యంతపరిశ్రమాభివృద్ధి నందిన బ్రిటనువంటి దేశమునకు ఇండియా ప్రిఫరెన్సు చూపినదంటే, హిందూదేశములో ప్రారంభదశయందున్న పరిశ్రమల పురోభివృద్ధికి అపాయమును కలిగించినట్లే. ఇటువంటి విషయముల నన్నిటినీ పరిశీలించి ఈ ఒడంబడిక ఇండియాకు ఎట్లు నష్టమును కలిగించునో తెలియజేయుటకు బదులు, అసెంబ్లీ కమిటీ ఇండియా ప్రభుత్వముచే పిలువబడినప్పుడు, అగ్రిమెంటు కాలమును మూడుసంవత్సరముల వరకు నియమించుటతో సంతృప్తిపడి ఊరకుండెను. ఈ ఒడంబడిక ఇండియాకు ఏ విధముగా లాభకరముగా ఉండునో తెలుపవలసిన భారము నిజముగా ఇండియా ప్రభుత్వముపైనే ఉన్నది.

ఈ ఒడంబడికవల్ల బాధపడేది ఒక్క ఇండియా మాత్రమే కాదు. మొట్టమొదట ఇండియాకు తెలియకుండాను, తరవాత ఇష్టములేకుండాను ఈ ఒడంబడిక ఇండియాపై నిర్బంధముగా మోపబడినది. స్వయంపరిపాలకమగు కెనడాకు ఈసంగతి బాగా తెలుసును. ఆసమయమున ఇందులో చేరుటకు కెనడా ఇష్టపడలేదని మనకు తెలియును. బ్రిటిషు బొగ్గు,

ఇనుము, బొగ్గు, కెమికల్సు, గ్లాసు, కత్తిసామానులు, చీనావేరు, వస్త్రములు, జోళ్లయొక్క అదృష్టము బ్రిటిషేతర వస్తువుల గతికంటె బాగుపడే సూచన బాగానే కనిపించుచున్నది. కాని ఇందువల్ల అమెరికాకు కెనడాయందు జరుగుచుండిన వ్యాపారములో 50 మినియన్లు మొదలు 250 మినియనుల డాలర్లవరకు నష్టమువచ్చును. అమెరికాకు కెనడాలో చాలా విరివిగా చెల్లుచుండిన ఇనుము ఉక్కువస్తువులు, ప్రత్తి, ప్రూలువస్తువులు, కెమికల్సు, టాయిలట్టు అద్దములు, జిగురు, టేబిలులు, తోళ్లు మొదలుగాగల 220 రకాల వస్తువుల వ్యాపారమునకు దీని వలన భంగముకలిగినది. అమెరికాకు నష్టంవస్తే అమెరికా ఆర్థికవ్యవహారస్థులకును, కెనడాలో పెట్టుబడులు పెట్టిన అమెరికా కంపెనీలవారికిని కోపమువచ్చినది. వీరే కెనడాలోని రాజకీయపక్షముల నిధులకు ద్రవ్యమునిచ్చి అచ్చటి రాజ్యాంగ తంత్రమును నడిపించేవారాయెను. అమెరికావారు విధించిన సుంకములతో కెనడా పోరాడవలసివచ్చెనుగనుక, వేరుత్రోవ లేక బ్రిటిషు అంగళ్లకే అది స్వాగతము చెప్పవలసివచ్చెను. ఇందుకై ఇంగ్లాండు యేడు రాజ్యములతో అనగా కెనడా, ఆస్ట్రేలియా, న్యూజీలాండు, దక్షిణాఫ్రికా, న్యూఫౌండు ల్యాండు, ఇండియా, సౌతురొడేషియాలుతో వేరువేరు సంధులను చేసుకొనవలసివచ్చెను. రష్యా, ఆర్జెంటీనాదేశములతో ఇంగ్లాండు వర్తక వ్యవహారములను త్రెంచుకొనజాలదు; త్రెంచుకుంటే అక్కడనున్న బ్రిటిషు పెట్టుబడులకు రక్షణ

తగ్గిపోవును; కనుక బ్రిటను 10% ప్రిఫరెన్సులనే యిచ్చెను. ఆస్ట్రేలియా, కెనడా గోధుమలకు ఇతర దేశముల గోధుమలకు కాదని ఒక బుషెలుకు 6 పెన్సులు చొప్పున డొమినియను ప్రిఫరెన్సులను ఈయవలసివచ్చెను. ఆస్ట్రేలియా దక్షిణాఫ్రికా ఖండముల ద్రాక్షరసము, పండ్లమీదను, కెనడా ఆస్ట్రేలియా న్యూజీలండుల పాలపదార్థములు, గ్రుడ్లు, కోళ్లు, మాంసముల పదార్థములమీదను, ఇతర ఐరోపాదేశముల పదార్థములను కాదని ఈరీతి ప్రిఫరెన్సే ఈయవలసివచ్చెను. విదేశీమాంసముల మీదకూడా ఫలానారీతిని అని చెప్పుటకు వీలుకాకపోయినా ప్రిఫరెన్సులనిచ్చెను. వెన్న, జున్ను, పండ్లు, గ్రుడ్లు, కండెన్సుడు పాలు, తేనె మొదలగు పదార్థములమీద సుంకములను విధించియు, కెనడాకు వెళ్లే పశువులమీద నిర్బంధములు తొలగించియు పలుపాట్లు పడవలసివచ్చెను. మాంసము, వూలు, గోధుమలు, పాలపదార్థములను ఆస్ట్రేలియాకు పంపుటలో పోటీలు పడుచుండిన అర్జంటీనా, స్కాండినేవియాలను తృప్తిపరచలేక ఆస్ట్రేలియా కూడా ఇదే స్థితిలో ఉండెను. గోధుమవ్యాపారముతో కెనడా ఆస్ట్రేలియాల కెక్కువ సంబంధము; మాంసము, మాంసపదార్థముల వ్యాపారముతో ఆస్ట్రేలియా, కెనడా, న్యూజీలండు, దక్షిణరొడేషియా, దక్షిణాఫ్రికాల కెక్కువ సంబంధము. పాలపదార్థములు కోళ్ల వ్యాపారముతో న్యూజీలండు, కెనడా, ఆస్ట్రేలియాల కెక్కువ సంబంధము. కనుక ప్రతిదేశమును అర్జంటీనాకు విరోధముగా

మాంసము గోధుమల మీాద ప్రిఫరెన్సుకొరకును, డెన్మార్కుకు విరోధముగా పాలపదార్థములు, కోళ్ళవ్యాపారము మీాద ప్రిఫరెన్సుకొరకును బ్రిటనును తొందరచేయవలసివచ్చెను. తివాసులు, కంబళ్లు, నునుపుచేసినతోళ్లు, జనుపనార సామానులు, మంచిగంధపు నూనె మొదలగు వస్తువులమీాది ప్రిఫరెన్సుకై ఇండియా బేరమాడవలసివచ్చెను. కనుక ఈ ఒడంబడికవల్ల ఇండియాకు ఎట్టి తాత్కాలిక లాభములు చేకూరినను, ఈ అంతఃస్సామ్రాజ్యపు యేర్పాటువల్ల ఇండియాకు మిక్కిలి లాభము కలుగదన్న మాట స్పష్టమే.

"సాధారణమైన సంవత్సరములో గ్రేటుబ్రిటను హిందూదేశపు యెగుమతులలో నాల్గవవంతుకంటె తక్కువగానే కొనుక్కొనును. ఇండియాకు వచ్చే దిగుమతులలో చాలా భాగము బ్రిటనునుండి వెళ్లేవే. గ్రేటు బ్రిటను ఇండియాకు తన పదార్థములలో విస్తారభాగమును పంపక తీరదు. ఇటువంటి సందర్భమున ఇండియను ఎగుమతులకు బ్రిటను అంగళ్లను సరపరా చేయుట తప్పనిసరియే." అని కోలు వ్రాసినాడు. అతను ఇంకా ఈరీతిని వ్రాయుచున్నాడు "ఇండియాకు స్వతస్సిద్ధమైన అంగళ్లు దూర ప్రాచ్యముననే ఉన్నవి. మరియు వృద్ధికాగలవు. అటువంటి జపాను, చీనా, ఇతర ఆసియాఖండ దేశములకు తనపైకినుకపొడమునట్లు గ్రేటు బ్రిటనుతో ప్రత్యేక సౌకర్య సంధులను చేసుకొనుట ఇండియాకు మిక్కిలి నష్టము. ఆరుమాసముల నోటీసు ఇచ్చి ఒడంబడికను రద్దుచేసుకొగలుగుట విపరీతభావము. ఇందుకై ఒక శాసనము జరుగవలెను. లెజిస్లేటివు అసెంబ్లీ దీనిని ప్యాసుచేసినను, అఫీషలు బ్లాకుతో నిండియున్న కౌన్సిలు ఆఫ్ స్టేటు దీనిని నిరాకరించును. అథవా అంగీకరించినను గవర్నరుజనరలు వీటో

ఉండనే ఉన్నది. ఇదీకాక ఇటువంటి సమయములలో బడ్జెట్టును సర్దుబాటు చేయుటలో అనేకము ఒడుదొడుకులు కూడా వచ్చును. మన యిష్టము వచ్చినట్లు అంగళ్లు యేర్పడవు యేర్పడినవి మన ఆజ్ఞప్రకారము పోవు, పోయినవి తిరిగీరావు. బడ్జెట్టు ఒడుదొడుకులలో ఈ రెండు సమస్యలూ కాకపోతే యేదో ఒకటైనా పరిష్కారము చేసుకోవలెను. పన్నులను హెచ్చిస్తావా? కొనుక్కొనే వాళ్లకు దెబ్బ, మునపటి పన్నులను తగ్గిస్తావా? బడ్జెట్టు తారుమారై సర్దుకొనదు"

అయినా, ఇండియా ప్రభుత్వముచే నియమింపబడిన డెలిగేటుల వలన ఒట్టావా ఒడంబడిక 28-8-32 తేదిని సంతకము చేయబడినది. ప్రభుత్వమువారు దానిని అంగీకరించినారు. అసెంబ్లీ సభకూడా దానిని సమ్మతించవలెనని దాని యెదుట పెట్టినారు, ఇట్టిచర్య కేవలము అసంబద్ధము. హిందూ దేశములో ప్రజాభిప్రాయము స్పష్టముగా దీనికి వ్యతిరేకము. ఇండియను డెలిగేషనులో ఒకసభ్యుడై ఆ ఒడంబడికపై సంతకముపెట్టిన చెట్టి, సెంట్రల్ అసెంబ్లీ స్థానమునకు మదరాసు రాజధానీ వర్తక సంఘము తరఫున అభ్యర్థిగా నిలచినప్పుడు, ఆరితేరిన డెమోక్రటికు పక్షమునకు చెందని ఆ నియోజక వర్గమువారే అతనికి వోటుల నీయక ఓడించి, ఒట్టావా ఒడంబడికను, దానికి ఉపకరణములుగా చేయబడినవారి చర్యలను తన్మూలముగా ఖండించి తమ తిరస్కారభావమును 1934 నవంబరులో స్పష్టముగా చాటినారు. సెంట్రల్ అసెంబ్లీవారు అనుకున్నట్లుగానే, ఆరుమాసముల నోటీసిచ్చి ఆఒడంబడికను

రద్దుచేసేటందు కెంతో కాలము పట్టలేదు. కాని దాని ఫలిత ముగా క్రొత్తఒడంబడిక తయారయ్యే మార్గము నేటివరకును కనపడినట్లు తోచదు. ఈ ఒడంబడిక హిందూదేశలాభము నకు యేరీతిగా ప్రతిబంధకమని ఋజువుచేయఁబడినదో వివర ముగా తెలుసుకొనుటకై అసెంబ్లీకమిటీవారు ఈవిషయమున తయారుచేసిన నివేదికను చదువవలెనని పాఠకులకు హెచ్చరిక చేయుచున్నాము. మొట్టమొదట, ఒడంబడిక హిందూదేశమునకు లాభప్రదమని యెక్కడను ఋజువుపరచ బడలేదు. రెండవది, ఈ ఒడంబడికవల్ల కలుగునని తలపబడిన లాభములు మిథ్యయని ఈ అధ్యాయము మొదటిభాగము నందే తెలుపబడినది. ఆఖరున ఇంగ్లాండు కొనుక్కొనఁగల వస్తు వులలో ఇండియాలో తయారయ్యేవే బహుస్వల్పము. ఈ స్వల్పముతో కూడా కాలనీలు లేక వలసరాజ్యములు పోటీ చేయుచున్నవిగనుక ఇండియా కెట్టిలాభములును రావు. ఇండియాకు కావలసిన కొన్నివస్తువులలో చాలా తక్కువ భాగమునే బ్రిటను పంపగలదు. తక్కినదంతయు ఇతరదేశ ములే పంపవలెను. వానిని తలదన్ని బ్రిటనే దీనినంత టిని మనకు పంపగలుగుట కెంతో కాలము పట్టును. ఈ రకము వస్తువులమీద బ్రిటనుకు ప్రిఫరెన్సు యిచ్చినామంటే ఇతర దేశములనుండి వచ్చే విశేషమగు పదార్థముయొక్క ఖరీదును హెచ్చించినట్లే గదా! బ్రిటనుయొక్క పదార్థము లనేకము లకు మనము ప్రిఫరెన్సు యిస్తే మనదేశపు శైశవావస్థయం

దున్న పరిశ్రమలను చంపినట్లే. ఆహారపదార్థములు, త్రాగుడు పదార్థములు పొగాకులలో 30% న్ను, తయారీ పదార్థముల కగు ముడిపదార్థములలో 43% న్ను, ఇండియానుంచి బ్రిటనుకు మనము యెగుమతి చేయుదుము. బ్రిటను నుండి 65% తయారీ పదార్థములను మనము దిగుమతి చేసుకొనుచున్నాము. ఇందు వల్ల బ్రిటనుకే లాభము. ఏలననగా ఫిస్కలు కమీషను సిద్ధాంతము ప్రకారము ముడిపదార్థములకు ప్రిఫరెన్సు నీయ నక్కరలేదు. వానితో తయారైన ఉపయుక్తపదార్థములకే ప్రిఫరెన్సు నియ్యవలెను. కనుక యెటుప్రక్కనుంచి చూచినను బ్రిటనుకే లాభము.

వేరుశనగలు, బియ్యం, జనుపనార వస్తువులు దేనిని తీసుకొన్నను మనకు మితిమీరి ఉన్నవి. కాని బ్రిటను భరించ గలది చాలా స్వల్పము. కనుక ఇండియాకు లాభములేదు. ఇండియాలో (అల్యూమినము) ఫ్యాక్టరీలు పెట్టుకున్న విదేశీ కంపెనీల వారున్నారు. వారికి 10% ప్రిఫరెన్సు యిస్తే మన ఫ్యాక్టరీలవారిని మూడు నిమిషములలో కూలజేతురు. తాను పండించిన కాఫీకి పెద్ద ఖరీదులు తెచ్చుకొనుటకై, 1932 జూనుతో అంతమైన రెండు సంవత్సరములలో 1845 మిలియను పౌనుల కాఫీగింజలను వ్యర్థము చేసుకొనిన బ్రజీలుతో మన హిందూదేశపు కాఫీగింజలు పోటీ చేయవలెనంటే యెంత ప్రిఫరెన్సు ఈయవలసి యుంటుంది? ఇంగ్లాండుకు ఇండియా నుండి వెళ్లే వస్తువులమీది ప్రిఫరెన్సుల మొత్తము 17 మిలి

యను లుంగుననిన్నీ, ఇంగ్లాండునుంచి ఇండియాకు వచ్చే వస్తు వులమీాది ప్రిఫరెన్సుల మొత్తము 42 మిలియనుల పౌను లుండుననిన్నీ మదింపు వేయబడినది. హిందూదేశపు ఆర్థిక చరిత్రములో తటస్థించిన మహావిషాదములలో ఒట్టావాప్యాక్టు ఒకటి. అదియెంతో వినాశమును కలిగించినది. అటువంటి ప్యాక్టు తిరిగి రాకుండునుగాక! ప్యాక్టులవల్ల సాధ్యముకాని పనులన్నీ సేఫ్ గార్డులు లేక సంరక్షణ క్లాజులద్వారా చేసు కొనుటకై అట్టే పెట్టినారు. వానిని గూర్చి మనము తరువాత మరో అధ్యాయములో ఫరింతము.

# 6 వ అ ధ్యా య ము

## రె యి ల్వే లు

రెయిల్వేకంపెనీలకు నౌకా కంపెనీలకు ఉండే సంబంధము చాలా పరస్పరసౌఖ్యదాయకము. రెండుకంపెనీలవారూ ఒకరితో నొకరు బాగా కూడ బలుకుకొని తమ ప్రయాణపు రేటులు సరుకు రవాణా రేటులు నిర్ణయించుకొని స్వదేశీపరిశ్రమలను తల నెత్తకుండా చేయగల్గుదురు. లంకాషైరునుండి తూత్తుకుడికిగాని, బొంబాయికిగాని, మద్రాసుకుగాని రవాణా చేయబడే ప్రతివస్తువుల బస్తాలపై ఒకే రేటు విధించబడును; అదికూడ అహమ్మదాబాదు నుండి హైదరాబాదుకో, నాగపూరునుండి ఢిల్లీకో రవాణాచేయబడు బస్తాలపై విధించబడెడి రెయిల్వే రేటు కంటె తక్కువగా ఉండును. ఒకటన్ను ప్రత్తి వస్తువులు అనగా అయిదు బస్తాలు లివరుపూలు నుండి బొంబాయికి వచ్చుటకు 20 షిల్లింగులు లేక రు. 13-5-4 లు ఓడ కేవు. అదే బరువు ఆదోనీనుండి బొంబాయికి (300 మైళ్ల దూరము) వచ్చేటందుకు 34 రూపాయీలును, ఆదోనీనుండి అహమ్మదాబాదుకు వచ్చేటందుకు 70 రూపాయీలును రెయిల్వే రేటు అగును. ఢిల్లీనుండి మద్రాసుకువచ్చే ప్రత్తిమీదనుండె రెయిల్వే రేటు ఆమధ్యనున్న యే రెండుస్టేషనుల ఛార్జీకంటెను గూడ తక్కువే. జయపూరునుండి మద్రాసుకువచ్చే ఇటాలియను మార్బిలు రాళ్లమీదఉండే రెయిల్వే

ఛార్జీలు ఇటలీనుండి ఇండియాకువచ్చే ఓడలఛార్జీలకంటె యెక్కువగా ఉండును. ఆంటువెర్పునుండియో బ్రసెల్సునుండియో ఇండియా రేవులకు దిగుమతియయ్యేడి ఇనుముయొక్క ఒక ప్రమాణముపైని ఛార్జీ 10 రూపాయీలైతే, అదే ప్రమాణము జెముషెడ్పూరునుంచి నాగపూరుకు రావలెనంటే 13 రూపాయీలగును. తిరుప్పూరునుండి ఢిల్లీకివెళ్లే ప్రత్తి మీఁది ఛార్జీకంటె తిరుప్పూరునుండి లంకాషైరుకు వెళ్లే ప్రత్తి మీఁది ఛార్జీకంటె యెక్కువ. ఈ విధముగా, ఒక ఉద్దేశపూర్వకముగా విధించబడిన అనంతమగు అన్యాయపు రేటులను ఉదాహరణములుగా చూపవచ్చును. ఇదంతా స్వదేశీపరిశ్రమలను తలనెత్తనీయకుండా అణగద్రొక్కి, విదేశీవస్తువులను బలవంతముగా ఈ నిస్సహాయ దేశములోనికి కృత్రిమ మార్గములద్వారా కుక్కుటకై యేర్పాటుచేయబడినదే. ఈ విధముగా ఉంటే స్వదేశీపరిశ్రమలు విదేశీపరిశ్రమలతో యేనాటికి సరిగా పోటీచేయగలవు ?

ఇంకను దిగుమతి పన్నులను పరిశీలింతము—గాల్వనైజు చేసిన (మెరుగుపట్టిన) ఇనపరేకుపై విధించిన సుంకములు, మెరుగుపట్టనిరేకులు, వాటితో చేయబడిన చేదలుమొదలగు వస్తువులపై విధించబడిన సుంకములకంటె ఒకప్పుడు ఎక్కువగా ఉండేవి. ఇనుపగుళ్లు, ఇనుపకమ్ములు, ఇనుపరేకులు, ఇనుపఖడ్డీలపై విధించబడిన సుంకములు వాటితోటే తయారు చేయబడిన ఇనుపమంచములు మొదలగువానిపై విధించబడిన

సుంకములకంటె యెక్కువగా ఉన్నవి. ఇట్లే ఇత్తడిరేకుమీది సుంకములకంటె దానితో తయారుచేయబడిన వస్తువులపై సుంకములు పెద్దవి.

బెల్జియము, స్విజరుల్యాండు, జర్మనీదేశములలో ఇనుప రేకుల నుండి పాళీలను గృహపరిశ్రమలుగా తయారు చేయుదురు. వీనిమీద విధించే సుంకములకంటె ఇనుపరేకుపై విధించే సుంకములు పెద్దవి. ఇనుపతీగెమీద విధించిన సుంకములు దానితో చేయబడిన మేకులపై విధించబడిన సుంకములకంటె పెద్దవి.

ఇండియను రెయిల్వేకంపెనీల వారు విధించుచున్న ప్రస్తుతపు రేటుల తంత్రములన్నిటిని డాక్టరు హెచ్. ఆర్. సోనీ అను ఆయన "ఇండియను ట్రాన్సుపోర్టు" అనే చిన్న గ్రంథములో సంక్షిప్తముగా ఇట్లు చెప్పినాడు. "రేవులనుండి దేశమధ్యమున నున్న నగరములకు వెళ్లే వస్తువులమీద ఛార్జీలు, దేశమధ్యమున నగరమునుండి నగరమున కయ్యేడి ఛార్జీలకంటె తక్కువ. ప్రభుత్వమువారే రైళ్లమీద రవాణా అయ్యేసరుకులను తరగతులుగా విభజించి యే యేతరగతి మీద ఎంత యెక్కువలేక ఎంత తక్కువ ఛార్జీలను విధించవలెనో నిర్ణయింతురు. ప్రస్తుతము అమలులో ఉన్న రేటులు ఇండియను వ్యవసాయకునకు గాని పారిశ్రామికునకు గాని శ్రేయస్కరములు కావు కనుక ఉత్తరోత్తరా రైల్వేకంపెనీల వారికికూడ శ్రేయస్కరములు కాజాలవు."

రెయిల్వే రేటులు అను సమస్యపై "Do they enjoy privileges" అను మకుటముగల కరపత్రమునుండి యీ దిగువభాగములను ఉదహరించుచున్నాము. *

"దేశములో ఒక భాగమునుండి ఇంకొకభాగమునకు జరిగే వాణిజ్యమునకు ముప్పును, దేశమునుండి వస్తువులు విదేశములకును విదేశముల నుండి ఈదేశమునకును రావాణాలయ్యే వ్యాపారమునకు శ్రేయస్సును కలిగే రీతిని యిండియను రెయిల్వే రేటులు నిర్ణయింపబడినవి. వీనివలన దేశములలోనే జరిగే వ్యాపారమునకెట్టి ప్రోత్సాహమును కలుగకుండను, రేవు నుండి రేవునకు పోయే వ్యాపారమునకు అధిక ప్రోత్సాహము కలుగునట్లును చూడబడినది. ఈ చార్జీలవల్ల ఇండియను పరిశ్రమలకు, అందులో ముఖ్యముగా గృహపరిశ్రమలకు నష్టము కలుగుచున్నది. తరగతి విభజనావిధానమువలన తక్కువరేటుల సౌకర్యమెల్లయు ఇంగ్లీషుకంపెనీలకే కలుగునట్లు రక్షణలు పెరటిత్రోవలగుండా చూపబడినవి. ఒకానొక యూరపియను కంపెనీ చక్కెరకు స్పెషలురేటు తక్కువ విధించబడిన ఉదాహరణమును ముక్తారుసింగు అస్సెంబ్లీలో చూపెట్టినాడు "రోజానుండి వెళ్లే చక్కెరకు అక్కరకువచ్చే చక్కెరకు ఒక స్పెషలుఛార్జీ విధించబడినది ఈ భేదమేలచేయబడినదో నేను అడుగవచ్చునా? ఈష్టుఇండియారైల్వే మీద రోజానుండి యేస్థలమునకైనను చక్కెరను పంపగోరు యెవ్వరైనను సరే క్యారూ అండు కో వారు చెల్లించునంత ఛార్జీనే చెల్లించుటకు వీలు లేదు. ఏదో ఒక్క కంపెనీకిగాను ఇట్టిభేదము నేలచూపవలెనో నాకు అర్థముకాకున్నది. దీనికంతటికిని ఒకచేజబాబు ఒకటి ఇంగ్లీషుకంపెనీ,

---

* 1931 జూను 25, జూలై 2, 9 తేదిల యంగు ఇండియా "సంచికలలో ప్రచురింపబడిన 3 వ్యాసములనుండి పునర్ముద్రితములు.

ఇంకొకరు పేదజనులు. క్యారూ కంపెనీ, చాలాపెద్దది, అది చాలా చక్కెరను తయారుచేస్తుంది కనుక దానికి స్పెషలురేట్లు విధించినాము అని చెప్పవచ్చును. అట్లయినచో కొలానుకూలమైన ఫ్యాక్టరీలనుపెట్టి నడిపించుచున్న ఇతరకంపెనీలవారికికూడా ఏల అట్టిసౌకర్యములగు రేటులు విధించలేదో నేను అడుగవచ్చునా?"

"అమోనియా సల్ఫేటుమీాద ఛార్జీలుతగ్గించి, దానిని తయారుచేయుటకు కావలసిన సల్ఫ్యూరికు ఆసిడుమీాద ఛార్జీలను అట్లేయుంచినట్లు ఆయన చూపించెను. దీనికొరకుము ఆ అమోనియా సల్ఫేటును ఒక బ్రిటిషు కంపెనీ క్రొత్తగా హిందూదేశములో ప్రవేశపెట్టుటయే అని తన అభిప్రాయమును చెప్పెను. కంట్రోలర్సు ఆఫ్ స్టోర్సును ప్రత్యేకముగాగల రెయిల్వేకంపెనీలకు ఇండియనుస్టోర్సు డిపార్టుమెంటువారివద్దనే తప్పకుండా కొనవలెనను నిర్బంధము నేర్పరచలేదు. ఈ కంట్రోలర్సు తరుచుగా యిరోపీయనులు. వీరు అనేక సందర్భములలో రైల్వేకంపెనీలవారికి వల్లమాలినన్ని అక్రమ ప్రిఫెరెన్సు (సదుపాయములను) ఇచ్చుచుందురు. ఇండియాలో ప్రభుత్వమువారు కొనుక్కొనేటంత సరుకును మరియేయొక్క సంస్థయు కొనుక్కోదు సేన, రెయిల్వేలు, పోర్టు ట్రస్టులు మొదలగు వానికి కావలసినసరుకులకై అది కోట్లకొలది ధనమును వెచ్చించుచుండును. రెయిల్వేకంపెనీ తన సరకును ఇండియనుస్టోర్సు డిపార్టుమెంటువారివద్ద కాక ఇతరులవద్దనుండి కొనుక్కొనుటవలన దేశమునకెంతనష్టమువచ్చునో చెప్పనక్కరలేదు"

ఇండియా ప్రభుత్వమువారికి వ్యవసాయపు నీటి పారుదల యేర్పాటులయందుకంటె రెయిల్వేలయం దెక్కువ పక్షపాతముకలదన్నమాట స్పష్టము. ఆర్. సి. దత్తు అను ఆయన ఇట్లు వ్రాసెను.

"రెయిల్వేలు విస్తరించినయెడల తద్వారా బ్రిటిషు పరిశ్రామికుడు తన వస్తువులను హిందూదేశాంతరమునందలి మారుమూలలకు కూడ అందజేయవచ్చునని భావించెను. కాలువలకంటె ఇందుకై రెయిల్వేలే యెక్కువ ప్రయోజనవంతములైనవని తెలుసుకొనెను. ఈస్టుఇండియా కంపెనీవారిని, ఇంగ్లీషు రాజులనుగూడ ఇండియాలో రెయిలు మార్గముల ననంతముగ యెక్కువచేయవలెనని పార్లమెంటు చాలా తొందరపెట్టినది. వారి బోధనలు విని ఇండియా ప్రభుత్వమువారు దేశాదాయ వర్ధకములగు వ్యవసాయ కాలువలకంటె రెయిల్వేల వృద్ధికే యెక్కువ కష్టపడి దేశపు రివిన్యూకు నష్టమును కలిగించినారు."

రైయిల్వేలు దూరాలోచనల(Strategic purposes)తో కూడినవై యుండవచ్చును. అయినను వానికైన పెట్టుబడి మీద 4% లాభములకు ప్రభుత్వము గ్యారంటీ యిచ్చుచున్నదే, అనేకము కంపెనీలు నష్టము ననుభవించుచున్నవే! వ్యవసాయ నీటిపారుదల ప్రాజెక్టు వస్తేనే పెట్టినసొమ్ము తిరిగీ వస్తుందా రాదా అని వెయ్యి ఆలోచనలు చేస్తారు. 1900 సంవత్సరమువరకు రెయిల్వేలమీద ప్రభుత్వమునకు వచ్చిన 390 కోట్ల రూపాయీలు, వానిమీద గ్యారంటీ చేయబడిన డివిడెండు 80 కోట్ల రూపాయలు. రెయిల్వేలను పెట్టుబడిదారుల వద్దనుండి ప్రభుత్వము స్వాధీనపరచుకొనవలెనను సిద్ధాంతములో యెట్టి ద్వంద చర్యలు (double-dealings) జరుగుచుండునో తెలుపుటకై క్రొత్తగా జరిగిన ఒక ఉదాహరణమును చూపుట అప్రస్తుతముకాదు "సోషల్ ఆర్డర్" అనే పత్రికలో ఒక లేఖకుడిట్లు వ్రాసెను.

"ఒక ద్వంద చర్య (double-dealing) యొక్క ఉదాహరణ మును నేనిక్కడ చూపుచున్నాను. అది ఈవిధముగా జరిగినది 1931 ప్రాంతములయందు చెప్పుడో హిందూదేశీయుల ఆందోళనపైని ఇండియా ప్రభుత్వమువారు నార్తువెస్టర్ను రెయిల్వే (B. N. W Railway) ను బ్రిటిషు స్టాకు హోల్డరులవద్దనుండి కొనుకొని స్వాధీనము చేసుకొనుటకు అంగీకరించి యుండిరి. దీని స్వంతదారులైన బ్రిటిషు భాగస్వాములు ఇది వరకే యెన్నో వాణిజ్యసంబంధమైన లాభములేకాక, 60 యేండ్లక్రితము ఎన్నడో జరిగిన ఒక అగ్రిమెంటు ప్రకారము, పెట్టుబడిధనముమీద "గ్యారంటీడు ఇంటరెస్టు" (పూచీపడిన వడ్డీ) యను పేర 3½% అదనపు బహూకరణమును కూడా అనుభవించియుండిరి. వారి డివిడెండులు 1923 నుండి గత సంవత్సరమువరకు 11% నుండి 18% కు క్రమముగా వృద్ధియగుచు వచ్చినవి. వారు పెట్టిన పెట్టుబడిఅంతాచేరి, 30 లక్షల పౌనులే అయివుండగా, నేడు వారి నగదు రూపముగా ఉన్న క్షేమనిధి 31,50,000 పౌనులు. వారికి సదుపాయములు రక్షణలు పూచీపడవలసిన కాలము చాలా కాలము క్రిందటనే గతించినది.

"1923 నాటికే బ్రిటిషు స్టాకు హోల్డరుల వద్దనుండి ఇండియను రెయిల్వే కంపెనీలను కొనుకొని వానిని జాతీయలాభపోషకమగు రీతిని ప్రభుత్వమే నడుపవలెనను ధర్మమును ప్రభుత్వమువారే ప్రతిపాదించి యుండిరి. ఈస్టిండియా రెయిల్వే కంపెనీయు, గ్రేటు ఇండియన్ పెనిన్సులర్ రెయిల్వే కంపెనీయు ఈ విధముగా స్వాధీనము చేసుకొనబడినవి. ఇప్పుడు B N W. రెయిల్వే కంపెనీ వంతువచ్చినది ఇది 1931 లో జరిగిన సంగతి. ఇదే సమయమున బ్రిటిషువారు గోల్డుస్టాండర్డు (బంగారపు చలామణీ) తీసివేసినారు కనుక హిందూదేశమువారి ఆదర్శమును అమలు జరుపు

టకు బ్యాంకర్లకు ఇష్టములేకపోయినది. 1937 లో కొంటామని చెప్పి ఈసమస్యకు వాయిదా వేసినారు.

"ఇప్పుడేమి జరిగినది? వైటుహాలులోఉన్న సెక్రటరీ ఆవ్ స్టేటు ఈకంపెనీని కొనలేదు సరేగదా, హిందూదేశపు శాసనసభవారి కెరుక పరచకుండా ఆకన్సెషను (లాభానుభవము) ను 1942 వరకును పొడిగించి నాడు. ఈవిషయమునైనా ప్రభుత్వము ప్రకటన చేయలేదు. రెయిల్వే షేరుహోల్డరుల సభలో చెప్పినదాని అధ్యక్షుని ఉపన్యాసమువల్ల ఈసంగతి బయలుపడినది! కంపెనీ వ్యవహారమును "1942 దాటి యెంతో కాలము వరకూ" కంపెనీవారె జరుపుకోవలెనని సెక్రటరీ ఆఫ్ స్టేటు కంపెనీని "అడిగి" నట్లు తనతోడి భాగస్వాములకు తాను నివేదించెను.

మనము జ్ఞాపకముంచుకో వలసిన విషయమేమిటంటే యింతకాలమునూ హిందూదేశములోని పన్నులు చెల్లించేవారు ఈకంపెనీకి దానిపెట్టుబడి మొత్తమంతటిపైనీ $3\frac{1}{2}\%$ వడ్డీ చెల్లించుతునే ఉన్నారు.

కావేరీనదిమీద నెప్పుడో కట్టిన ఆనకట్టువలన పెట్టిన సొమ్ము లాభదాయకము కాలేదన్న ఉదాహరణమును పట్టుకొని గోదావరి కృష్ణానదులమీద ఆనకట్టులు కట్టుటకు బ్రిటిషు ఇంజనీర్లు యెంతో అనుమానముతో ఆలస్యము చేసినారు. అయినా, ఈరెండు ఆనకట్టులవల్లనూ 19,22% వడ్డీలు ప్రతిసంవత్సరం కిట్టుచున్నవి. అయినా, మన దురదృష్టంవల్ల, ప్రభుత్వంవారు ఈఆయకట్టులక్రింద సాగు అయ్యే భూములకు యకరము 1 కి 25 రూపాయిల చొప్పున అదనపుపన్ను (premium) ను లాగుచున్నారు. (దీనిని 15—7—37 తేది

నుండి రద్దుచేసినారు.) పంటకు పనికివచ్చే వనిన్నీ, కాలవలను దిట్టపరచే వనిన్నీ (Productive and Protective) నీటి పారుదలపనులు రెండు తరగతులుగా విభజింపబడినవి. ఈదిట్ట పరచే పనులుకూడా, అవివచ్చే తరగతి భేదమునుబట్టి, కొంత వరకు ఆదాయదాయకములుగా ఉంటేనే చేస్తారు. మొన్న మొన్న 1929 లోనే ఒక ఒంగోలు పెద్దమనిషి సిపార్సుచేసిన స్కీమును మద్రాసు ప్రభుత్వమువారు ప్రొడక్టివుగా కాని ఆఖరుకు ప్రొటక్టివుగా కాని ఆదాయదాయకము కాదన్న కారణముతో నిరాకరించినారు. కాని రైల్వేల విషయము వచ్చినప్పుడు వారు ఈ రెండింటిలో దేనిని గాని లక్ష్యము చేయరు. వడ్డీలకు ప్రభుత్వమువారే పూచీ పడతారు. ప్రజా ధనముతో వానిని నిర్మించేటట్లు చేస్తారు: వడ్డీకి పూచీపడితే, ప్రజాధనముతో వానిని కట్టించినట్లే. దీని ఉద్దేశము విశద మైనదే; దేశమునకు వీనివలన రక్షణకలుగుతుందన్న దూరాలోచనమాట అట్లుండనిచ్చి, వీనిద్వారా విదేశీవస్తువు లను మారుమూలలలో విరజల్లవచ్చును. మారుమూలలనుంచి ఈ దేశపువస్తువులను తమ దేశములకు తీసుకొనిపోవచ్చును.

స్వదేశీవస్తువులు దేశములో ప్రచారము కాకుండాను, విదేశీవస్తువులు ప్రచారమగునట్లును చేయుటకై రైల్వేకంపె నీలవారును ఓడలకంపెనీలవారును కూడబలుకుకొని తమతమ రేటులను యేరీతిని సరిదిద్దుకొన్నారో ముందే తెలుపబడినది. ఈరైల్వే కమ్మీలను భూమిలో నాటేటప్పుడు అవి యేయేపట్ట

ణములద్వారా వెళ్లవలెనో వాని సహజసౌందర్య విలాసములు చెడిపోవును కాని, ఏ యే గ్రామములమీదుగా అవి వెళ్లునో వాని ఆరోగ్యసూత్రములకు భంగము కలుగునని కాని దృష్టినే వారు పూనలేదు.

రైలు మార్గములుద్వారా బ్రిటిషువారు హిందూదేశమునకు చలిజ్వరము (మలేరియా)ను తెచ్చిరని ప్రజలలో ఒక నమ్మకముండేది. దానిని గవర్నమెంటువారు ఖండించడం కూడా జాగానేఉంది. కాని నిప్పులేనిదీ పొగ రాజదన్న మాటలో సత్యము లేకపోలేదు. ఇటువంటి నమ్మకము ప్రజలలో కలుగుటకును వీరు నిర్మించిన యినుపదారుల యేర్పాటుకునుగల సంబంధమును చూచినయెడల యిందులో యేదో సంబంధమున్నదను అనుమానమున కాస్కారము లేకపోలేదు. యదార్థమేమనగా, మురుగునీరు పోయే మార్గముల పొడవునను యినుపకమ్మీలను నాటినారు కనుక, ముఖ్యముగా బెంగాలులో, మురుగునీరు యెక్కడదక్కడ గుంటలలో నిలవ అయిపోయినది. ఇందుకై కట్టించిన వంతెనలు, కల్వర్టులు మురుగునీటిని చలించకుండా అరికట్టివేసినవి. ఈప్రాంతాలలో ఉండే బంగాళారాష్ట్రీయులు సంవత్సరములో చాలాభాగము మురుగునీటిలోనే నివసింపవలసి వచ్చినది. ఈ గోతులచుట్టూ మలేరియారోగమే. లక్షలకొలది జనులు దీనివాత పడుచున్నారు. గవర్నమెంటువారికి ఇంగ్లీషు లాభములమీద కంటె దేశీయుల ఆరోగ్యముమీద యెక్కువ శ్రద్ధఉండేలా

గుంటే, వారు రైల్వేల నింత నిర్లక్ష్యభావముతో కట్టకుండా నాలుగునాళ్లు ఆలోచించి నిబంధనలు చేసియుందురు, మరియు వ్యవసాయ సదుపాయప్రణాళికల నింత నిర్లక్ష్యముచేసి యుండరు; కాని వారికి ప్రప్రధానముగ కావలసినది బ్రిటను ఆర్థికలాభాభివృద్ధియే.

ఈ అధ్యాయమును ముగించులోపల 1937 జూనులో ప్రకటింపబడిన వెడ్జివుడ్డుకమిటీవారి సిఫార్సులను పరిశీలించితే మనవాదముయొక్క సత్యము మరింతబలంగా తేటపడుతుంది. ఫెడరలు ప్రభుత్వకోశమునుండి, అనగా ఆకోశముయొక్క జనరలు (మొత్తపు) ఆదాయములనుండి రైల్వేలకై కంట్రిబ్యూషనులు తీయరాదని అది సిఫార్సుచేసినది. నీమియరు పరిష్కారముక్రింద రైల్వేలు యెప్పటికో ఒకనాటికి రాష్ట్రముల పరిపాలనక్రిందకు వచ్చును గనుక, రాష్ట్రముల తనఖాలముగావచ్చే ఆదాయము తక్కువ కావలెననియే దీని ఉద్దేశము. రైల్వే వ్యవహారము లేనాటికైనా ప్రాంతపడినప్పుడు దానివలన రాష్ట్రములకు లాభము కలుగకుండుటకై యిట్టి సిఫార్సు చేయబడినది. ఇప్పుడు రైల్వే ఆదాయములను కేవలము రైల్వేలకొరకే ప్రత్యేకించే క్రొత్తసిద్ధాంతమును ఎత్తుకున్నారు.

1935 సం॥ ఇండియా చట్టములో చేయబడిన ఒక మార్పు మనకు చాలా ఆశ్చర్యమును కలిగించును. భవిష త్కాలమున ఇండియను ఫెడరేషనుకు రైల్వేలను మాత్రమే

ఒప్పుచెప్పుదురు కాని, వాటి రేటులను ఒప్పుచెప్పరు. వానిని నిర్ణయించవలసినది ఒక రైల్వే బోర్డువారు. ఈబోర్డును నియమించవలసిన విచక్షణాధికారము సంపూర్ణముగా గవర్నరుజనరలుది. ఇండియా ప్రభుత్వపు ఆక్టుప్రకారము కాక, ఈబోర్డు పార్లమెంటుయొక్క వేరే మరియొక ఆక్టుప్రకారము స్థాపించబడినది గనుక ఇండియాప్రభుత్వము దీని నేరీతినిగాని చెక్కు చెదిరించుటకు వీలులేదు. ఈ విధంగా పార్లమెంటు ఈ రైల్వే బోర్డు నొకదానిని అవతరింపజేసినది. గవర్నరు జనరలు తనకు ప్రత్యేకముగా ఈయబడిన విచక్షణాధికారము ప్రకారము దీని సభ్యులను నియమించును. వీరు రైల్వే రేటులను నిర్ణయింతురు. హిందూదేశములో జరుగుచున్న విదేశ వ్యాపారమున కంతటికిని రైల్వే రేటులే తాళపుచెవులవంటివి. లేకుంటే ఆస్ట్రేలియా గోధుమలు హిందూదేశమునందు పంజాబులో పండె గోధుమలతో యెట్లు పోటీ చేయగలవు? ఇటాలియను మార్బిలురాళ్లు, పెంకులు, జయపూరు మార్బిలు రాళ్లతోను, హెంకీపెంకులతోను యెట్లు పోటీచేయగలవు? హిందూదేశములో జరుగుచున్న బ్రిటిషువాణిజ్యమునకు అతి ప్రధానములైన మూడునాల్గు పద్దులలో రైల్వే రేటులు ఒకటి. వీనివల్లనే ఆవాణిజ్యమునకు దేశీయవాణిజ్య పరిశ్రమలపై పైచేయి వచ్చుచున్నది. తక్కిన పద్దులేమిటంటే, మారకము (Exchange), నాణ్యములు (Currency), సుంకములు (Tariffs).

# 7 వ అధ్యాయము

## నౌకలు

రెయిల్వే కంపెనీలు నౌకా కంపెనీలతో కొన్ని ఒడంబడికలు (Contracts) చేసుకొనును. ఈకంట్రాక్టుల కారణముగా, బెంగాలులో జనుపనార పండించే రైతు తానా సరుకును అమ్ముకోదలచు కొన్నయెడల దానిని యేదో ఫలానా కంపెనీ వారి నౌకలలోనే రవాణాచేయవలెను; ఇంకో కంపెనీ పడవలలో రవాణాచేయ గోరినయెడల, రెయిల్వే కంపెనీవారు ఆసరుకును తీసుకొనరు. రైలెక్కకపోతే పడవకు చేరడమెట్లా ? జనుపనార మిల్లులవారు రైతులవద్దనుండి జనుపనారను బేరము చేసుకొనేటప్పుడు ఖరీదులు వగైరా పరిష్కారములతో తేలదు. ఆసరుకును ఫలానా కంపెనీవారి పడవలలో ఫలానా నదులమీదుగా కలకత్తాకు అందజేయవలెనని కంట్రాక్టులో మరీ వ్రాయించుకుంటారు. జనుపనారను పండించేవారు ఆనౌకల కంపెనీని అభిమానించుటకు నిరాకరించారా, దానిని కొనుక్కొనేవారు ఈ అమ్ముకొనేవారిని అభిమానించడం మానేస్తారు. ఈ నౌకల కంపెనీలలో యెవరో ఒక ఇంగ్లీషు వారికి హక్కులో, వంతులో ఉండెను. ఇంక నౌకల కంపెనీల వరస చూస్తే 1929 నుండి రిబేటుల సిష్టము వకటివచ్చింది. ఈసిష్టము ప్రకారము సామానులు పంపేవారు ప్రతీ సంవత్సరం ఒకే కంపెనీవారి నౌకలలో తమ సరుకును పంపించక తప్పకుం

డును. అనగా వర్తకులు ఒకయేడాది తమ సరుకును ఒక కంపెనీ వారి నౌకలకు ఇచ్చినయెడల ఆకంపెనీవారు ఆ సంవత్సర ములో వర్తకులు రవాణాచేసే సరుకుపైని చార్జీనుండి కొంత రిబేటు యిస్తారు (చార్జీ తగ్గిస్తారు.) అయితే ఈ రిబేటు ఆసంవ త్సరాంతమున కాక ఆమరుచటి సంవత్సరాంతమున యిస్తారు. ఆ సంవత్సరమంతా కూడా ఆకంపెనీ నౌకలలోనే తమ సరు కును రవాణాచేస్తేనే సంవత్సరాంతమున గత సంవత్సరపు రిబేటు వస్తుంది, లేకుంటే రాదు.

ఇంక రేటులయుద్ధం వేరేఉన్నది. ఈసమస్యపై గొ. వి. రామదాసుపంతులుగారు "త్రివేణి" పత్రికలో వ్రాసిన "ఇండియను మర్కెంటైలు మేరీను" అనే వ్యాసమునుండి కొన్ని భాగము లుదహరిస్తాము. రెండవ పోటీదారు లేకపో గానే, విదేశీపడవల కంపెనీలవారు ఇండియను పడవల కంపెనీల వారిని నిలువునాదోచేసి, తమ కోస్తా సుంకములను సాధ్యమై నంత ఉన్నతస్థానమున ఉంతురు. ఫిస్కలు కమీషనువంటి మంచి నైపుణ్యముగల వారి నివేదికలో ఈ రీతిని ఉన్నది :

"రెయిల్వే రేటులనుగూర్చి యెటువంటి ఫిర్యాదులు వచ్చుచున్నవో, కోస్తానౌకల రేటులనుగూర్చికూడ అట్టి ఫిర్యాదులలే వచ్చుచున్నవి. ఈ రెండింటింకిని కారణము వేరువేరైనను ఫలితములు సమానములే. అవి యేమనగా విదేశవస్తువులు సుఖతరముగా రవానాలగుచుండగా స్వదేశవస్తు వులు ఈడుపోతలు పడుచున్నవి మావద్దకు పంపించబడిన రేటులజాబితా చూస్తే, ఒకరేవునుండి మరియొకరేవునకగు రవానాఛార్జీలకును, ఇండియా

నుండి విదేశములకగు రవానాఛార్జీలకును, యెక్కువనూ పోలికయేలేదు. ఇటువంటి విపరీతరేటు భేదములవల్ల స్వదేశీపరిశ్రమకిచ్చిన సంరక్షణమేమైనా ఉన్నా నిష్ఫలితమగును స్వదేశపరిశ్రమలకు సంరక్షణము నెదురు చూచుచుటకు హక్కున్నది. ఏలననగా ఏవస్తువునైనను వేలకొలది దూరమున తయారుచేయించుకొని తెప్పించుకొనుటకంటె తామే తయారు చేసుకుంటే అనేకలాభములుండును. అయినా ఈరేటులభేదాలవల్ల ఆలాభాలు సూన్యమగును కోస్తావ్యాపారమునందు ఇంతయెక్కువరేటు లుండుటకల్లా ఒకటేకారణము దానిని ఒక్కమాటలో "మోనాపలీ" అని చెప్పవచ్చును, అనగా అవ్యాపారము నితరులను చేయనీయకుండా ఒనరించుట హిందూదేశీయపడవలకు తలయెత్తుట అవకాశములు కనిపించీ కనిపించడములో కోస్తానాకావ్యాపారులు తమ రేటులను లాభదాయకము కానంత దిగువకుకూడ తగ్గించుకొనుటకు సమర్థులే ఇట్టిచర్యవలన కూడ హిందూదేశపు కోస్తానాకావ్యాపారులు చితికిపోవుదురు శైశవావస్థయందున్న ఆకంపెనీలు తమ రేటులను విదేశీయులవలె తగ్గించుకుంటే యెంతోకాలము నిలువజాలవు. వారముదినములక్రిందటనే, సింధియాస్టీము నావిగేషను కంపెనీయొక్క షేరుహోల్డరులకు ఉపన్యశించుచు ఈరేటుల యుద్ధముయొక్క వక్రపద్ధతులన్నింటిని హీరాచందు బయలుపెట్టినాడు. "హిందూదేశపు నౌకలమీద ఒక టన్ను సరకైనా యెక్కకుండా చేయుటకు విదేశీకంపెనీలవారు సాధ్యమైనన్ని రీతులను తమ రేటులను తారుమారుచేయుదు "రని ఆయన వచించెను. ఇందుకై తమకెంతనష్టము వచ్చుచున్నను వారు గణించరు. హీరాచందు సేకరించిపెట్టిన యధార్థమగు విషయములను పరిశీలిస్తే సింధియా స్టీమునావిగేషను కంపెనీకి, ఆవిధమైన ఇతర ఇండియనునౌకల కంపెనీలను కూలద్రోయుటకై విదేశీనౌకా కంపెనీలు తమ రేటులను అనవసరముగా ఎంతతక్కువకు తగ్గించుకొని కోస్తా

వ్యాపారమును నష్టస్థితికి తెచ్చినారో బాగా తెలియగలదు విదేశీనౌకా కంపెనీలకు "ట్రాంపు టన్నేజ" అనే ఒక సౌకర్యమున్నది. వాళ్ల తాలూకు కొన్ని నౌకలకు సాధారణ (regular) నౌకలకయ్యేటంత ఖర్చులు తగలవు కొపడవలలో సరుకునెక్కించుకొని వారు తక్కువఛార్జీలను తీసుకొనగలరు ఇట్లు అన్నిప్రయాణములు జరుగవన్నమాట నిజమే అయినను, కొన్ని జరిగినను హిందూదేశపు కంపెనీలకు దెబ్బతప్పదు. రేటుల యుద్ధమునకు ఈపద్ధతి మరింతచిక్కు తెచ్చిపెట్టినది కోస్తానౌకల రవాణా రేటులను తగ్గించినను, బ్రిటిషు కంపెనీలకు ఇతరవిధములైన ఆదాయములుండును గనుక తమ షేరుహోల్డరులకు పెద్దలాభములను పంచుచునే ఉండవచ్చును. సింధియా స్టీము నేవిగేషను కంపెనీ, లిమిటెడ్, చైరుమాను ఈపరిస్థితులనుగూర్చి ఇట్లువ్రాసెను "హిందూదేశపు పడవలు సముద్రతీరమున సంచరింపగానే బ్రిటిషుకంపెనీలు తమ రేటులను తగ్గించుకొన్నను, వాటికిఆదాయములకు ప్రభుత్వాభిమానము (గవర్నమెంటు పాట్రనేజి) మెయిలు సబ్సిడిలు మొదలైన ఇతరమార్గములు కలవు మాకు లేవు కనుక వారు పెద్దలాభములను చేసుకొనగలరు. మేము చేసుకోలేము" అని చెప్పుచున్నారు.

'ఇదికాక, విదేశవ్యాపారములో చాలావరకు విదేశవాణిజ్యసంస్థల హస్తములయందుండును గనుక, రన్మ్రాలమున కలిగే అనంతమైన లాభములను విదేశీనౌకల కంపెనీలు అనుభవించగలవు ఆ విదేశసంస్థలు సహజముగా విదేశీనౌకా కంపెనీలనే అభిమానించును గాని స్వదేశీకంపెనీలను యేనాడును అభిమానించవు బ్రిటిషు షిప్పింగు కంపెనీలకును బ్రిటిషు రెయిల్వేకంపెనీలకును గల లోపాయికారీసంబంధమువల్ల కలిగే పరస్పర లాభములు హిందూదేశపు పడవలవారికి చాలానష్టమును కలుగజేయుచున్నవి మర్కంటైలుమారీను కమిటీవద్దకు సాక్ష్యరూపకముగా వచ్చిన ఒక

చర్యవలన ఎన్నో సంగతులు విశదమగుచున్నవి. ఒక నౌకా కంపెనీయు ఒకరెయిల్వేకంపెనీయు తమకిరువురకును అనుకూలములనుకూర్చు ఒకరేవు పట్టణమునకే వాణిజ్యమంతయు మూగుకొనివచ్చినట్లు యేర్పాటుచేసుకో గలిగినారు. తలుపులను బాహాటముగా తెరచి యుంచుతామనే నీతి (open door policy) స్వదేశీనౌకా కంపెనీలు వర్ధిల్లుటకు తగినమార్గము కాదనిన్నీ; ఇండియను నౌకల అభివృద్ధికై అనుకూలమైన రంగమును న్యాయమైన అవకాశములను గూర్చుటతప్పని సరియనిన్నీ మర్కెంటైలు మారీనుకమిటీవారు చెప్పినమాట యథార్థమనిన్నీ రుజువుపరచుటకు మేము తగినంతవరకు ఇందుమూలముగా తెలియచేసినాము."

నౌకాసభలో (కాన్ఫరెన్సులో) సభ్యులైన నౌకల వారు బ్రిటిషు ఇండియాకువెళ్లే సరకులమీదనుండే ఛార్జీరేటులను 15-11-1937 లగాయతు ఈదిగువరీతిని హెచ్చించుచున్నారని వింటే కొంతసంతోషమగుచున్నది:—బొంబాయి, కరాచి కలకత్తా, మద్రాసు, కొలంబోలకు వెళ్లేసరకులమీద ప్రస్తుతము టన్ను 1 కి 30 షిల్లింగుల చొప్పున ఉన్న ఛార్జీరేటును అదనముగా టన్ను 1కి అరక్రౌను చొ॥ హెచ్చించినారు; ప్రస్తుతం టన్ను 1కి 30 షిల్లింగులకంటె యెక్కువగా ఉన్న ఛార్జీరేటులను టన్ను 1కి 35 షిల్లింగుల చొప్పున హెచ్చించినారు.

కోస్తా నౌకావ్యాపారమును స్వదేశకంపెనీలకే మినహాయించి యుంచవలెనను నీతియెడల ఇండియాప్రభుత్వము వారికిగల విరోధభావము నిక్కడ చూపించవచ్చును. 1928

డిసెంబరులో కలకత్తాలో జరిగిన ఇండస్ట్రియలు ఎగ్జిబిషను (పారిశ్రామికప్రదర్శనము) యందు, హిందూదేశములో యేయే దేశపు నౌక లెంతెంత విశాలవ్యాపారము నొనరించు చున్నవో తెలుపుటకై ఒకపిరమిడ్డు (అడుగున విశాల పరిమాణము కలిగి పోనుపోను సన్నమగు స్తంభము)ను నిర్మించిరి. అట్టిఅడుగున ఇంగ్లాండు దేశము ఉదహరింపబడినది. ఇండియను నౌకావ్యాపారములో 74% ఇంగ్లాండు దేశముయొక్క పడవలే జరుపుచున్నవి. ఈవిధముగా 27 దేశములు అందు ఉదహరింపబడినవి. ఇండియాది క్రిందనుంచి 24 వ స్థానము లేక మీదనుండి 4 వ స్థానమైనది. ఇది చేయుచున్న వ్యాపారము ¼% మాత్రమే. ఇంతకంటెనూ తక్కువవ్యాపారముచేసి చివర నుండిపోయిన దేశములు టర్కీ, పోలండు, చిల్లీ. ఈమూడు దేశములును అప్పటినుండి తమతమ కోస్తావ్యాపారములను చేయుహక్కు తమ స్వదేశీకంపెనీలకే ఉండేటట్లు యేర్పాటులు గావించుకొన్నవి. కాని ఇట్టి రిజర్వేషను కొరకే అసెంబ్లీలో హాజీ ఒకబిల్లును ప్రతిపాదించినప్పుడు, విశాలభావోపేతుడని పేరుపొందిన ఇర్విన్ప్రభువువంటి వైస్రాయియే ఆబిల్లు ఇతరుల ఆస్తిహక్కులను ఆక్రమించుకొను దుస్వభావము గలదని అభిప్రాయమును సెలవిచ్చెను. బ్రిటిషునౌకావర్తకులు తామనుభవించుచున్న సౌకర్యములను రక్షించుకొనుటకును ఈబిల్లు చట్టముగా ప్యాసుకాకుండా నిరోధించుటకును 5 లక్షల పౌనులు ఖర్చుపెట్టినారని అనుకుంటున్నారు.

ఈసందర్భమున ఐరోపాయుద్ధకాలమునందు జరిగిన ఒకసంభవము జ్ఞాపకమువచ్చుచున్నది. మచిలీపట్టణములో ఒక ఓడను కట్టుకొనేవానికి ఒక ఓడను నిర్మించుటకు ప్రోత్సాహమీయబడినది. ఆయుద్ధసమయములో ఆతడొక ఓడనునిర్మించి కొంచెములాభమును చేసుకున్నాడు. ఇంకా యెక్కువ ఓడలను కట్టేదాకా అధికారులు అతనిని ప్రోత్సహించిరి. చివరకు లక్షాయాభైవేల రూపాయీలు ఖర్చుపెట్టి అతడొక పెద్ద ఓడను నిర్మించినాడు. ఇంతలో దురదృష్టమువల్ల యుద్ధము ముగిసి ఆర్మిష్టిసు (సంధి) ప్రకటింపబడినది. అప్పుడేమియైనది? అక్యాబునుండి కోరమండేలు తీరమందంతటను బ్రిటిషు స్టీము పడవలు మాత్రమే బియ్యపు వ్యాపారమును చేసుకొనుటకు లైసెన్సు నీయబడినవని ఒకఆర్డరు ప్రకటింపబడినది. ఈ నౌకా నిర్మాతకు ఒకబిరుదమును కూడా గవర్నమెంటువారు ఇచ్చియుండిరి. కాని అతని నౌకయే చితికిపోయి అతనే ప్రక్కలైనట్లు తేలినది. పైగా, గత సంవత్సరములలో నౌకల నిర్మాణములో అతడు సంపాదించినాడని మదింపువేయబడిన సంపదమీద అతనికి నాలుకు రు 72,000 లు రాబడిపన్ను విధించినారు. అతను రు 20,000 లు ఖర్చుపెట్టుకొని దానిని రు 47,000 లకు తగ్గించుకొనగలిగినాడు. గణితశాస్త్ర ప్రకారమిదియొక లాభముకాదని మన మనుకోవచ్చును. ఆర్థికముగా ఈరీతిని చితికిపోయినతరువాత, అతను మరో రు 25,000 లను ఖర్చుపెట్టి ఆ పెద్దఓడను విరిచి చిన్నఓడలుగా మార్చుకొన

గలిగినాము. హిందూదేశపు నౌకానిర్మాతలకిచ్చే ఆదరణ మేరీతిదో మన కిందువలన తెలిసినది. అయినను, హిందూ దేశపుకట్టు నౌకలలో వ్యాపారము చేయుటవలన కలుగగల అపాయములు స్టీము నౌకాకంపెనీల ఉక్కునౌకలవల్లవచ్చే అపాయములకంటె చాలా తక్కువ అన్నమాట అందరకూ తెలిసిన విషయమే. ఇండియను నౌక 50 మొదలు 60 సంవత్సరములవరకును మన్నును; కాని స్టీమునౌక అందులో మూడవవంతుకాలమైనను మన్నజాలదు.

మనము చాలావరకు త్రోవతప్పినాము తిరిగీ ఇండియను నౌకా విషయమునకు వత్తము. హిందూదేశ నౌకా వ్యాపారము ఇండియాలో వర్ధిల్లనీయలేదు. దూరసముద్రములలో నూటికి రెండువంతుల వ్యాపారమునే ఇండియను నౌకలు చేయుచున్నవి; తక్కిన 98 వంతులును విదేశనౌకలే జరుపుచున్నవి. కోస్తావ్యాపారములో ఇండియను పడవలు 10% మాత్రమే జరుపుచున్నవి; తక్కిన 90% విదేశీనౌకలు జరుపుచున్నవి. క్రొత్తగా స్థాపించబడిన హిందూదేశపునౌకల కంపెనీలు యెట్టిఅవమాన అక్రమపోటీలతో డీకొనవలసివచ్చెనో తెలియబరచితిమి. 3-1-1930 తేదీని ఆంగ్ల హైందవదేశముల నౌకాకంపెనీల ప్రతినిధుల కాన్ఫరెన్సు వైస్రాయి అధ్యక్షత క్రింద జరిగినది. కోస్తావ్యాపారములో ఒకఅనుకూల మధ్య మార్గము దొరకకపోవుటకు కారణము ఇండియను రాజకీయ వేత్తల దురాకాంక్షకాదు; మంచి పెట్టుబడిస్తోమత్తుగల

బ్రిటిషు నౌకాకంపెనీలవారి చేతులలోనుండి అనుకూలమైన సదుపాయములను ఇండియను వ్యవహారస్థులు తీసుకొనజాలు శక్తి లేకపోవుటే కారణము. ఇండియాకు (యేడాదికి) ఒకనౌక చొప్పున అమ్మితే, నూరేసియేళ్లదాకా బ్రిటిషువారికి కలిగే లాభముల మొనాపలీ మాయమగునని నిర్ణయించబడినది.

హిందూదేశపు నౌకా వ్యాపారమును యెదుగనీయకుండా ఆటంకము కలిగించుటకు జపానుయొక్క వాణిజ్యనౌకా సమూహము కూడ ఒక కారణమే. కాని ఈ విషయమై క్రొత్తగా ప్రకటింపబడిన ఒక సిమ్లా (ప్రచురణ) కమ్యూనిక్యు ఈ రీతిగా తెలుపుచున్నది :—

"హిందూదేశపు కోస్తావ్యాపారములో జపాను నౌకలపోటీని అరికట్టుటకై ఇండియా ప్రభుత్వమువారు తమ పన్నాగముల నన్నిటితో సిద్ధముగా నున్నారు హిందూదేశపు సముద్రతీరమును సకలజాతుల నౌకా ప్రయాణమునకును బాహాటముగా తెరచియుంచు 1850 వ ఆక్టును వారు మొట్టమొదట రద్దు చేదామనుకొనుచున్నారు తరువాత కోస్తా నౌకా వ్యాపారములో కొన్ని నిర్బంధముల నేర్పరచుదుమని ఊహించుచున్నారు. ఊ రెండింటిని శాసనసభలో ప్రతిపాదించుటకై సెక్రటరీ అఫ్ స్టేటుగారి ఫార్మలు (అనుమాయిత) అంగీకారం యెప్పుడు వస్తుందా అని యెదురు చూచుచున్నాము. ఈ సంబంధమైన ప్రతిపాదనలను, సెంట్రల్ అసెంబ్లీ యొక్క కేంద్రసభలు ముగియులోపలనే, గవర్నమెంటువారు ప్రవేశపెట్ట గలరని ఊహించుచున్నాము

ప్రస్తుతం అతితొందరను కలిగించుచున్నది ఒక్క జపాను వాణిజ్య నౌకాసమూహమే యైనను, జర్మనీపడవలు కూడా అప్పుడప్పుడు ఈహిం

దూరదేశపు తీరములలోనికి దూరి గల్లాటము చేయుచున్నవని చెప్పఁబడినది. జపాను ఓడల రాకపోకలకు ఒక క్రమము లేదనిన్నీ, వస్తే మందమంద లుగా వచ్చి లేకుంటే అసలు రాకుండా, ఈ రీతిగా ఉండుననిన్నీ చూపించబడినది

మద్రాసు జపానులమధ్య జపాను నౌకావ్యాపారమును గురించి P. & O. కంపెనీవారు ఈ దిగువ వాక్యములను చెప్పుచున్నారు. జూలై 16 వ తేదిని లండను నుండి వచ్చిన టెలిగ్రాము :—

"మద్రాసు జపానులమధ్య జపాను నౌకావ్యాపార పరిస్థితిని గురించిన్నీ, కోస్తావ్యాపారములో యెక్కువగా పాలుగొనుటకై బ్రిటిషు ఇండియా యస్. యన్ కంపెనీ నిశ్చితాభిప్రాయమును గురించిన్నీ ఈ దిగువ స్టేటుమెంటు నేడు (పి. అండు ఒ.) కంపెనీయొక్క ప్రెస్ ఆఫీసు ద్వారా పంపఁబడినది.

"కొంచెము కాలముక్రిందటనే, జపానుదేశపు వర్తక నౌకాయజమానుల కంపెనీయగు మిట్సూయిూబుస్సాను కెయిషా సంఘము జపాను నుండి మద్రాసుకును, మద్రాసుతీరపట్టణములకును నేరుగా పడవలను పంపి వాణిజ్యము చేయ ప్రారంభించినారు యన్. వై. కె. సంఘమువారు తమ పడవలను కూడా పంపి మరికొన్ని నెలల తరువాత నుండియు వీరితో చేర జొచ్చినారు ఇండియానుంచి బయటకు, బయటనుంచి ఇండియాకు జరిగే ఇట్టి నౌకాప్రయాణ ప్రయత్నములు మరి సాగకూడదని బ్రిటిషు పడవల వారు చేసిన ప్రతిఘటనాందోళనమువల్ల ప్రయోజనము లేకపోయినది.

"ప్రస్తుత స్థితిగతు లెట్లున్నవనగా, 40 సంవత్సరముల క్రిందట జపాను ఇండియాలమధ్య నౌకావ్యాపారము 100% బ్రిటిషు నౌకలద్వా

రానే జరుపబడి యుండగా, నేడు 75% జపాను పడవలద్వారానే జరుగుచున్నది. బొంబాయి జపానులమధ్య వ్యాపారములో 80% న్ను జపాను బొంబాయీలమధ్య వ్యాపారములో 89% న్ను జపానుపడవలే సాగించుచున్నవి ఈ సంగతిని పరిశీలించిన యెడల కోబీ, మద్రాసుల మధ్య బ్రిటిషు ఇండియా నౌకాసంఘమువారు చేయుచున్న నౌకావ్యాపారము, దినదిన ప్రవర్ధమానమగుచున్న జపాను కంపెనీల పోటీని యెదుర్కొనుటకై చేయబడిన ప్రయత్నమే కాని, కొందరు రిపోర్టుచేసినట్లు బ్రిటిషు ఇండియావల్ల చేయబడెడి క్రొత్తపోటీ ప్రయత్నము కాదని తెలియగలదు"

ఈ అధ్యాయమును ముగించులోపల, భావి నౌకా వ్యాపారమునుగూర్చి క్రొత్తగా చేయబడిన శాసనమువైపు నకు పాఠకులదృష్టిని మరలించవలసియున్నది. 1928 లో కోస్టలుషిప్పింగుబిల్లు ఇండియను లెజిస్లేటివు అసెంబ్లీలో ప్రతిపాదింపబడినప్పుడు, ఇండియా సెక్రటరీయొక్క లీగలురిమాంబ్రన్సరులతో ఈ విషయమై లండనులో ఆలోచనలు జరిగినవి. ఇండియను లెజిస్లేటివు అసెంబ్లీలో ఈ బిల్లు ప్రతిపాదింపబడుటకు అప్పటి చట్టముద్వారా వీలు ఉన్నదా అనువిషయము చర్చించబడినది. ఇటువంటి బిల్లులను నిరాకరించుటకు డొమినియను గవర్నమెంటుల కెట్లు అధికారము లేదో హిందూదేశపు శాసనసభలో దీనిని ప్రవేశపెట్టకుండా నిరోధించుటకు ఇండియా ప్రభుత్వమునకు గూడ అధికారము లేదని వారు తమ అభిప్రాయమును తెలిపిరి. కనుక 1935 వ ఇండియాప్రభు

త్వపు చట్టములో ఇటువంటి బిల్లులను అంగీకరించు లేక నిరాక రించు అధికారము గవర్నరుజనరలుకు అందచేయబడినది. ఈ కారణమువల్ల హాజీగారి కోష్టల్ షిప్పింగు రిజర్వేషను బిల్లు వంటి బిల్లు ఇకముందు గవర్నరుజనరలు ముందుగా అంగీక రించనిదే ఫెడరలు అసెంబ్లీలో ప్రతిపాదించుటకే వీలులేదు. స్వాయంపరిపాలనా సందర్భములో మనము మునుపటికంటె యెంత ముందుకు వచ్చినామో దీనివల్ల తెలియగలదు. నేడు, తనకోస్తా నౌకావ్యాపారమును తాను అభివృద్ధి చేసుకొనే హక్కులు లేనిదేశము విశాలనాగరక ప్రపంచమున నెల్ల భరతఖండ మొక్కటియే యైయున్నది.

## అధ్యాయము

### బొగ్గు

ఇంగ్లండు దేశము యొక్క మహాసంపద యంతయు బొగ్గును ఇనుమును గనుకనే అది ప్రపంచవిక్రయస్థానములలో నెల్ల అగ్రస్థానమును నధిష్ఠించియున్నది. అది తనకు దిగుమతి యయ్యేడి సమస్తముడిపదార్థముల ఆహారపదార్థముల వెలలను కూడా తనబొగ్గు ఇనుముతో తయారుచేసే పదార్థముల రూపముగానే చెల్లించవలెను. తన తీరముల మధ్యస్థమున పండే పంటంతా కలసి ఇంగ్లాండుకు సంవత్సరములో అయిదు వారములవరకే సరిపోవును. తక్కిన 47 వారముల తిండియు పై దేశములనుండి దిగుమతి కావలసినదే. దీనినిగురించి ఇంకా తెలుసుకోవలసిన విషయములున్నవి. అవి మరోమాటు తెలుసుకొందాము. బ్రిటిషువారు యే పదార్థమునైనా యెగుమతి చేయగలుగుతున్నారంటే, వారికి బొగ్గు ఇనుమూ ఉన్నవి గనుకనే.

ప్రపంచమంతటిలో త్రవ్వబడు బొగ్గుపరిమితి సంవత్సరమునకు 1200 మెట్రిక్కుటన్నులు మాత్రమే. అనేకసంవత్సరములు దాటినను దీని పరిమాణము హెచ్చక నిశ్చలముగా ఉండెను. కాని జలశక్తియు తైలశక్తియు (Water power and oil) నేడు అతివేగముగా విజృంభించుచున్నవి. 1913 లో అమెరికారాష్ట్ర పరిశ్రమలకు కావలసిన శక్తిలో 84% బొగ్గునుండియే దిగబడుచుండెను కాని 1927 లో బొగ్గునుండి దిగ

బడినశక్తి 64% కు తగ్గిపోయెను. ప్రపంచములో దినదిన ప్రవర్ధమాన మగుచుండిన హైడ్రో-ఎలెక్ట్రిక్కు పవరుముందర బ్రిటిషుబొగ్గు పరిశ్రమ నేడు గడగడ లాడిపోవుచున్నది. 10 మిలియను టన్నులకంటె అధికమగు బొగ్గునుండి యెంతశక్తి రాగలదో అంతశక్తిని నేడు ఇటలీదేశము హైడ్రో-ఎలెక్ట్రిక్కు పవరుద్వారా తీసుకొనుచున్నది ; గనుక అంతవరకు బ్రిటిషు బొగ్గుపరిశ్రమకు ఇందువల్ల నష్టము కలుగుచున్నది.

లేబరుప్రభుత్వములో థామను, మంత్రియై నిరుద్యోగ నివారణసమస్యను తెమల్చవలసి వచ్చినప్పుడు, బ్రిటిషుబొగ్గును శాంపిలుకొరకు ఒక పడవలో కెత్తి తనవెనక వేసుకొని ప్రపంచమెల్లయు చుట్టుతిరిగి వచ్చెను. అతను కెనడా వెళ్లి తన దేశపు బొగ్గుకు ఇతర దేశముల బొగ్గుకుకంటె యెక్కువ ప్రిఫరెన్సు నీయుమని ప్రతిమాలుకొనెను. కెనడావారు, నావస్కోషియా న్యూసౌతువేల్సు దేశముల బొగ్గుకే యెక్కువప్రిఫరెన్సు నిస్తామన్నారు. థామసునిరాశాహతుడై ఇంగ్లాండుకు వచ్చినాడు.

బొగ్గును ఉత్తమ అధమ తరగతులక్రింద విభజించి హిందూదేశపు బొగ్గునకు ఎట్టి అనాదరణము నిచ్చుచున్నారో తెలుపుటకు కొన్ని ఉదాహరణములను చూపుట మంచిది. *

"రెయిల్వే కమిటీయెదుట ఘోషుగారు సాక్ష్యమునిచ్చుచు, మొదటి తరగతి బొగ్గు యూరపియను కంపెనీలవద్దనే దొరకగలదను

* ఈసమాచారము "Do they enjoy privileges" అను వ్యాసము నుండి పునర్ముద్రితములు. ఈ వ్యాసము 1931 "యంగుఇండియా" లో ప్రకటించ బడినది.

సిద్ధాంతమును ఖండించెను. బొగ్గుగనుల యజమానులు ఐరోపీయనులుగా హిందూదేశస్థులా అన్న విచక్షణపైనే బొగ్గుయొక్క ఉత్తమ అధమ తరగతి భేదమును పాటించుచున్నట్లు కనపడుచున్నదని ఆయన చెప్పెను. ఐరోపీయుని స్వాధీనములో ఉన్నప్పుడే బొగ్గును మొదటి తరగతియందురో, అదే భారతీయుని చేతులలో ఉన్నప్పుడు దానిని రెండవతరగతి యందురని దృఢపరచెను ముగ్గావద్దనున్న చాటాబారు బొగ్గుగనుల సంగతిని ఆయన ఉదాహరణముగా చూపించెను అది ఇప్పుడు విలియర్సు లిమిటెడు, కంపెనీ చేతులలో నున్నది. ఒకప్పుడు అది కుంజబిహారీ చౌదరీదై యుండెను అది అనేక యజమానుల చేతులలోనికి మారెను, కాని భారతీయుల చేతులలో ఉన్నన్నాళ్లు ఆ బొగ్గు నెవ్వరును కొనలేదనిన్ని, మైనింగు ఇంజనీరు దానినే నేవు అడ్మిరాలిటీ కోలుగా అంగీకరించెననిన్ని ఆయన చెప్పెను ”

ఇదివరకే “యంగుఇండియా” లో ప్రచురింపబడిన రచయిత వ్రాతలనుండి యీ దిగువ విషయములను గూడ ఉదహరించుచున్నాము.

“రెయిల్వే కంపెనీలకు స్వంత బొగ్గుగనులు లేని దినములలో వారెన్నడును ఇండియను బొగ్గుగనులనుండి కొనలేదు. అధమ తరగతి బొగ్గు అను మిషపెట్టి దానిని నిరాకరించేవారు. ఇండియనులు స్వంతదారులైయున్నప్పుడు కొనుక్కోని బొగ్గే తాము యజమానులు కాగానే ఉపయోగింపతగినదైనది ఇంతలో దాని గుణము మారిపోయినదా ?

“మైన్సుబోర్డు ఆఫ్ హెల్తు (మైన్సుబోర్డువారి ఆరోగ్యశాఖ) కు ఛీఫుశానిటరీ యుద్యోగస్థుని పదవిని తప్పకుండా ఐరోపీయునకే ఇచ్చుచున్నారు. తగిన లక్షణములు (qualifications) అన్నివున్నా భారతీయు

నకు అపడవిని ఈయరు. దీనికి కారణము ఆగనుల యూరపియను యజమానులు అపడవిని భారతీయున కిచ్చుటకు ఇష్టపడరు.

"హిందూ దేశపు బొగ్గు పరిశ్రమ చరిత్రయంతయు, అయిరోపీయ కంపెనీల కిచ్చెడి అభిమానాదరణముల (preferential treatments) ఉదాహరణములతో క్రిక్కిరిసియున్నది. ఒక ఉదాహరణమును చూతము. ఒక భారతీయుడు ఒకానొక ప్రదేశముయొక్క భౌతిక స్వభావ పరిశోధన (Geological survey) ను చేసి నివేదికను ప్రభుత్వమువారికి పంపించినాడు; ఈలోగానే మంచి మంచి ప్రదేశముల నన్నిటినీ అయిరోపీయ కంపెనీలకు ఇచ్చివేసినారు.

"చోటా నాగపూరు ప్రాంతములో ప్రశస్తమైన మైకా (కాకిబంగారము) గల ఖాస్‌భూముల నన్నిటినీ ఐరోపీయులకే యిచ్చినారు. వారు ఇండియను కంపెనీలకు వానిని కౌలుకు ఇచ్చినారు.

"ఐరోపీయులు, తమకు ప్రభుత్వమువారు ప్రసాదించుచున్న సమస్త సౌకర్యములతోనూ కూడా, భారతీయులతో సమానస్థానమున నిలచి పోటీచేయలేక పోయినప్పుడు, తమ పోటీదారులకు కష్టములు కలిగించుటకై కొన్ని శాసనములను చేయవలెనని ప్రభుత్వమును నిర్బంధము చేయుచుందురు. దీనికుదాహరణము బీహారు కౌన్సిలులో ప్రజాభిప్రాయమెంత ప్రతికూలముగా నున్నను సరకుగొనక మైకాబిల్లును ప్యాసు చేయించుటే."

# 9 వ అధ్యాయము

## నాణ్యములు, మారకము

హిందూదేశములో గౌరవనీయమగు చలామణీ విధానము లేకపోవుట అది చేసుకున్న దురదృష్టము. ఇతర నాగరిక దేశములందంతటను ఒకే లోహము ప్రధానచలామణియందుండగా, భారతదేశములో రెండు లోహములకు ప్రధాన చలామణియుండి ఆవిధముగా సంభవించే అనేక నష్టములకది పాల్పడుచున్నది. 1903 లోనే కర్జనుప్రభువు బంగారమునకు ప్రధానచలామణీ గౌరవమునీయ బూనుకొని, దానికి ముందుగా బంగారు మారకము స్టాండర్డు (Gold exchange Standard) ను సిద్ధముచేసినాడు. దీని ఫలితముగా రూపాయి విలువ తగ్గిపోయినది. తన్మూలకముగా వచ్చిన లాభములను బంగారు మారకము స్టాండర్డు క్షేమనిధిగా యేర్పరచినారు. ఇది క్రమముగా పెద్దమొత్తమునకు పెరిగినది. ఇదిన్నీ, నోట్ల పూచీకత్తుకొరకు ప్రత్యేకించబడిన క్షేమనిధిన్నీ కలసి 235 కోట్ల రూపాయలైనవి. కాని, ఇందులో శోచనీయమైన విషయమేమనగా, ఈ ధనమంతయు ఇంగ్లాండులో ఉంచబడినది. ఇండియా కార్యదర్శి దీనిని కనీసము దీనిలో కొంతభాగమును, బ్రిటిషు వర్తకసంఘములకు పదిహేనురోజుల కొకసారి తీర్చుచు చెల్లించే బాండులమీద 2 మొదలు 3% వడ్డీకి అప్పులనిచ్చుటకై ఉపయోగించుచున్నాడు. ఇండియా ప్రభు

త్వము తానుచేసే అప్పులమీద 4 మొదలు 6% వడ్డీ చెల్లించు చుండగా, ఇండియా సామ్ము్నను తత్కార్యదర్శి 2 మొదలు 3% వడ్డీకి ఇంగ్లాండులో ఋణములిస్తూ ఉండడము చాలా అసమంజసమైన విషయము. ఆ ఋణములనైనను భారతీయ వాణిజ్యవ్యాపార పరిశ్రమాభివృద్ధికై గాక, బ్రిటిషు వాణిజ్య సముద్ధరణకార్యములకై ఇచ్చుచున్నాము. ఇంగ్లీషు వాణిజ్య కంపెనీలు ఈవిధముగా హిందూదేశమునుండి వచ్చిన ధనముతో లాభాలను సంపాదించి మనకంపెనీలకంటె ప్రశస్తమైన భవనములు, బసలు సొగసులతో మెరయుచుండే సరుకులను తయారుచేసి యీ దేశములోనికి దించి అపారమైన లాభములను ఈవిధముగా తీయగలుగుచున్నారు.

సర్ డానియల్ హామిల్టను ఈక్షేమనిధిని ఇండియా దేశములోనికి తెప్పించవలెనని 10 సంవత్సరములనుండి సలహా యిచ్చుచుండెను. కాని ఇండియను ఆర్థికసమస్య లన్నిటిపై అధ్యక్షతవహించిన ఢిల్లీ వైటుహాలు పెద్దలందరును దీనికి ససేమిరా కాదంటున్నారు. ఆఖరున ఏర్పడ్డ కర్రెన్సీ కమీషనగు యంగుకమీషను ఈ క్షేమనిధిని ఇండియాకు మార్చవలెనని సిఫార్సు చేసినందుకు సంతోషమే. కాని ఇండియా ప్రభుత్వమువారు దీనిని లక్ష్యపెట్టలేదు. ఈధనము నుపయోగించుటకై అతి ప్రశస్తమైన విధానమును హామిల్టను కనిపెట్టెను. ఆయనవిధాన మతిసూక్ష్మమైనది. ఈ 235 కోట్ల రూపాయిలు ఇండియాలో స్థాపించవలసిన అఖిలభారత

బ్యాంకుకు ఆధారము (Nucleus) గా ఉండును. దీని నాధార ముగా చేసుకొని ఇంతకు మూడురెట్లు ధనమును డిబెంచర్ల రూపముగా వసూలు చేయవలెను. ఇవి రెండును చేరి 940 కోట్లు అగును. దీనిలో 235 కోట్లు బంగారము వెండిగిల్టు ఎడ్జి సెక్యూరిటీలుగా ఉంచవలెను. అట్లుంచిన యెడల యెప్పుడు కావలస్తే అప్పుడు నగదురూపముగా మారగలిగిన వ్యవహార ముగా అది తిరుగుచుండును. తక్కిన 705 కోట్లలో 615 కోట్లు రైతులకు దీర్ఘవాయిదా ఋణములుగా యిచ్చి వారికి అప్పులేకుండా చేయవచ్చును. 90 కోట్లు మిగులును. అందులో నుండి 20 కోట్లు సహకారోద్యమమునకును, 15 కోట్లు మ్యునిసిపలు డిబెంచరులకును, 20 కోట్లు రైల్వేల అభివృద్ధికిని, మిగిలిన దానిని వంగరాష్ట్రములో మురుగుకాల్వలను వ్యవ సాయపుకాల్వలను నిర్మించు నిమిత్తము, పంజాబు, సంయుక్త మధ్యరాష్ట్రములలో భూమిని ఫలప్రదముగా చేయుటకును వినియోగించవచ్చును. ఈవిధముగాపండెడి జాస్తీపంటలవల్ల డిబెంచరులమీాది వడ్డీలను తీర్చుటకు సరిపోవును. ఋణభార ముచే క్రుంగి కృశించియున్న భారతీయరైతును ఈరీతిని ఒక్క కలముపోటుతో నిరారుగా నిలబెట్టి ఆత్మగౌరవోపేతు డైన స్వతంత్రపౌరునిగా మార్చవచ్చును. ఇట్లు చేయవలె నంటే ఆధనమును ఇండియాకు తేవలెను. తెస్తే ఆంగ్లవర్తకు లకు లభించే చౌకవడ్డీ సౌకర్యములన్నియు అంతరించును. ఇది యిష్టములేకనే భారతీయరైతులను కష్టముల పాలుచేసి

ఆంగ్లవర్తకాభివృద్ధికై పాటుపడుచున్నారు. కాని మారకపు రేటులలో తారుమారుల మూలముగా ఇంతకంటెను ఘోర కర్మ మొనరించబడుచున్నది. ఇక దానికి వత్తము.

మారకపురేటు

కొంచెముకాలము క్రిందటివరకును మారకపురేటు రూపాయికి 1 షిల్లింగు 4 పెన్సుల చొప్పున ఉండెను. ఇంగ్లాండులో ఉన్న ఇండియను రిజర్వుధనము సవరనుకు 15 రూపాయీల రేటున ఉండెను. యుద్ధము ముగిసినతరువాత ననతి కాలములో అనగా 1922 లో మారకపురేటు రూపాయీకి 1 షిల్లింగు 4 పెన్నీలనుండి 2 షి. 10 పె. లకు లేచినది. ఇదంతా ఆరుసంవత్సరములలో జరిగినది. ఈ ఆరేళ్లలోనే ఇండియాలో ఉండిన ఇంగ్లీషువారందరూ "రివెర్సుకౌన్సిలుల" ద్వారా ఇంగ్లాండుకు 120 కోట్ల ధనమును పంపించిరి. ప్రస్తుతము సవరిను ధర 15 రూపాయీలనుండి రు 7-8-0 లకు తగ్గిపోయినదిగనుక ఇక్కడ ఇండియా ట్రెజరీలో రు 7-8-0 లు కడితేచాలును ఇంగ్లాండులో ఒకనిపేర ఒకసవరను జమయైనట్లు లెక్క వ్రాయబడును. లేక, దీనినే మరోవిధముగా చెప్పవచ్చును. ఇండియాకార్యదర్శి తాను 15 రూపాయీలు పెట్టి, కొని, ఇండియను రిజర్వులో ఒక్కప్పుడుంచిన సవరనులకును సవరను 1కి రు 7-8-0 లు చొప్పున విక్రయించుటకు మొదలుపెట్టినాడు. ఈ వ్యవహారమువల్ల ఆరువారములలో

రు 60 కోట్లు నష్టమైనది. దీనినే "లూటీని న్యాయముగా చేయుట" అనిన్నీ "త్రోవదోపిడిని సక్రమముచేయుట" అనిన్నీ "నిర్దాక్షిణ్యస్వభావులగు విమర్శకులు" దూషించి ఇండియా ప్రభుత్వమును బ్రిటిషు ప్రభుత్వమును ఇట్టినేరముల నొనరించినారని నిరూపణచేసిరి!

ఇంగ్లాండులో చదువుచున్న మీకొమారునికి మీరొకపౌను పంపవలెనన్నను, లేదా మీకు సీమనూలు బట్టలు పంపిన ఇంగ్లాండుమిల్లుకు మీరొక పౌను జమకట్టవలెనన్నను రూపాయి మారకము 2షి. 10 పెన్సు లైనప్పుడు, మీరు పోస్టాఫీసులో రు 7-8-0 లు చెల్లిస్తే చాలును; ఇంగ్లాండులో వారికి 1 సవరను చెల్లిస్తామని పోస్టాఫీసువారు మీకొకరసీదు నిస్తారు. ఈదేశమునకు వస్తువులను దిగుమతిచేసేవారికి ఈ విధము లాభమువస్తే, ఆవిధముగానే ఈదేశమునుండి వస్తువులను ఎగుమతిచేసేవానికి నష్టంవస్తుంది. 1925-26 లో దిగుమతిదారులకు ప్రోత్సాహమిచ్చుటకై రూపాయి యొక్క మారకపురేటును 1షి. 4 పెన్సుల నుండి 1షి. 6 పెన్సులకు హెచ్చించిరి. ఇందువల్ల అనేక భారతవణిగాగ్రేసరులకు పెద్ద నష్టమువచ్చినది. ఈమారకపురేటు ఏల ఇట్లు భారతీయ వ్యవసాయదారునకు ముప్పుకలిగేరీతిని బ్రిటిషు పరిశ్రామికునకు లాభముకలిగే రీతిని తారుమారు చేయవలెనో మనకు దురవగాహాముగా కనిపించును. ఇటువంటి పనులుచేస్తే ఇంగ్లాండుదేశమున కెక్కువలాభమనునది తప్ప వేరొకకార

ణము నింతవరకెవ్వరును తెలుపలేదు. ఇటువంటి మారకపు తారుమారువల్ల భారతీయ వస్త్రపరిశ్రమ కెటువంటి ఘోరతరమైన అపచార మొనరింపబడినదో ముందే తెలిపియుంటిమి. రెయిల్వే రేటులు, షిప్పింగుటారిఫ్ఫులతో కలసి ఈనాణ్యములు మారకము రేటును విదేశవాణిజ్యమున కెట్లు పూర్ణదోహదము నొనరించునో కూడా తెలిపియుంటిమి.

బ్యాంకు ఆఫ్ ఇంగ్లాండు 1931 సం॥ 21, 22, 23 తేదీలను, బొక్కసములో బంగారములేక, మూడు దినములు శెలవుతీసుకొన్నప్పుడును, ఇంగ్లాండు బంగారము స్టాండర్డును విరమించుకొన్నప్పుడును, ఇతరజాతులు కూడా తమ మారకము రేటులను ఆవిధముగానే మార్చుకొని, తమ దేశముల లోనికే దిగుమతులన్నియు మూగుకొనివచ్చునట్లు అదే తంత్రమును జరిపించుటకై ప్రయత్నముచేసినందువల్ల తిరిగీ మునపటిరీతికే పరిస్థితులన్నియు వచ్చి నిలకడచెంది పోయినవి. ఒక రిజర్వాయిరుచుట్టూ కొందరు రైతులకు పొలములున్నవనుకొందము. మొట్టమొదట ఒకరైతు ఆరిజర్వాయిరుకు కన్నములు పెట్టినాడనుకొందము. అప్పుడు తక్కిన రైతుల పొలములకంటె అతని పొలమున కెక్కువనీరు పారెను. అతడు చంకలు గ్రుద్దుకొని గొప్పలుచెప్పుకొనెను. వెంటనే ఇతర రైతులు కూడ ఈరహస్యమును గుర్తించి తమపొలములకు సూటిగా రిజర్వాయిరుకు కన్నములుపెట్టిరి. అప్పుడు రిజర్వాయిరులోని నీరు ఒకపొలమున కెక్కువ, ఇంకొక పొలమునకు

తక్కువ, అనుభేదములేక సర్వసమానముగానే గదా పారును. అట్లే స్వయంపరిపాలనగల జాతులన్నియు తమ మారకపు రేటులను ఆరీతిని సర్దుకున్నందువల్ల బ్రిటనుకు దానివల్ల అందరితో సమానమైన ప్రయోజనమేతప్ప అధికములేకపోయెను. కాని ఒక్క ఇండియాకుమాత్రము అట్టిభాగ్యము లేదు. అది స్వపరిపాలనగల దేశము కాకపోవుటచేత, ఇంగ్లాండు యెట్లా కళ్లెమును బిగిస్తే అట్లాలొంగి తనలాభములను గోలుపోయి బ్రిటిషువారి లాభములను పోషింపవలసివచ్చెను. ఏది యెట్లా గున్నను, 1935 వ ఇండియాగవర్నమెంటు చట్టమునకు పూర్వము, ఇండియాకు తన నాణ్యముల మీదను మారకపు రేటుమీదను మాట్లాడుటకైనను అధికారముండెను. 1928 లో గవర్నమెంటువారు మారకపురేటును రూపాయికి 18 పెన్సులచొప్పున మార్చినప్పుడు గవర్నమెంటు అంతసులభముగా త్రోసుకొనిపోలేదు. అది తన బలగముల నన్నిటిని కూడదీసుకొనవలసివచ్చెను. ఇంతాచేస్తే దానివిజయము సంపూర్ణమైనది కాక కొంచెము వోటులు మాత్రమే యెక్కువగా ఉండెను.

కాని ఈ క్రొత్తచట్టము ప్రకారము, రూపాయిలోని వెండివిలువను కాని, సవరనులోని బంగారము విలువనుగాని, చలామణీలో ఉన్న నోట్లతాలూకు బంగారు వెండియొక్క రిజర్వు మొత్తమునుగాని నిర్ణయించుహక్కు ఇండియాకు తొలగించబడినది. ఈ అధికారములన్నియు రిజర్వుబ్యాంకు పరము

చేయబడినవి. దాని డైరక్టర్లు 15 గురిలో 8 గురే నియోజక సభ్యులు. బ్యాంకును స్థాపించిన తరువాత 5 సంవత్సరముల ఆఖరున తప్ప ఆ యెనమండుగురును యెన్నికసభ్యులగుటకు వీలులేదు. ఏలననగా మొదటిసంవత్సరములో 15 గురును నామినేటెడుసభ్యులే. మొదటి సంవత్సరాంతమున మాత్రమే యిద్దరు యెన్నుకొనబడిన సభ్యులువస్తే యిద్దరు నామినేటెడు సభ్యులు విరమిస్తారు. ఈ విధముగా యేడాదికి ఇద్దరేసి యెన్నుకొనబడి సభ్యులువచ్చి యిద్దరేసి నామినేటెడు సభ్యులు విరమించే టప్పటికి అయిదుసంవత్సరములు పూర్తిఅగును. ఇది కాక 1927 లో రిజర్వుబ్యాంకు సభ్యత్వమును గూర్చి సర్ బాసిల్ బ్లాకెట్టును శాసనసభ సభ్యులును సంప్రతించినప్పుడు శాసనసభ్యులు నియోజకసభ్యులు తొమ్మండుగు రుండవలెనని రాజీపడిరి. కాని ఇప్పుడు వారు యెనమండుగు రే ఉన్నారు. తెల్లకాగితము ప్రకారము రిజర్వుబ్యాంకు కార్యముల (functions) ను మార్చుటకు ఫెడరలు శాసనసభకు వీలు లేకపోయినను సభ్యులసంఖ్య (Structure) ను మార్చుటకైనను వీలు ఉండేది ; కాని జాయింటు పార్లమెంటరీ కమిటీరిపోర్టున్ను దాని ననుసరించిన 1935 వ ఇండియాచట్టమున్ను ఈ సభకు గవర్నరుజనరలు యొక్క అనుమతిలేనిదే దేనిని చేయుటకును వీలు లేకుండా చేసినవి. రెయిల్వేబోర్డువలెనే రిజర్వుబ్యాంకున్ను బ్రిటిషుదేశ సౌభాగ్యమున కభేద్యమగు ఒక కోటవంటిది. అట్టి బ్యాంకునకే కర్రెన్సీమీదను యెక్సుచేంజిమీదను సంపూ

ణ్ణాధికారము లొసంగబడినవి. ఇండియా యందు బ్రిటనుకును బ్రిటిషువాణిజ్యమునకును కూర్చబడిన మహారక్షణల (Safe-guards) లో ఇదియొకటి. ఈ చట్టమువల్ల మనకింతకు ముందుగా ఉండిన హక్కులు కూడ తుడుచుకొనిపోయిన వనుటకు సందేహములేదు. ఈ కారణమువల్ల ఈ దేశములో బ్రిటను యొక్క వాణిజ్యపారిశ్రామిక సార్వభౌమత్వము శాశ్వతముగాను నిశ్చంచలముగాను వర్ధిల్లేటట్లు చేయబడినది.

# 10 వ అ ధ్యా య ము

## తపాలాఛార్జీలు—చెక్కులు

ఉప్పు మొదలుకొని సేనదాకా సమస్త భారతదేశ పరిపాలనమును బ్రిటిషువారి వాణిజ్యము నెట్లుపోషించుటా అను యేకైకదృష్టితో వ్యవహారింపబడుచున్నదని చెప్పియుంటిమి. ఉప్పుకంటెను తక్కువదియైన పోష్టుకార్డుతోనే మనమీ పరిశోధనను ప్రారంభించి యుండవలసినది. పోష్టుకార్డు వెలను మొట్టమొదట మూడుపైసలనుండి అర్ధణాకు అర్ధణానుండి మూడుకానులకు యెందుకు హెచ్చించినారా యను విషయమును పరీక్షించుటకైనను కాస్తసేపు యెవరూ శ్రమపడరు.

పోష్టుకార్డు నిజముగా పేదవాని కొక భోగ్యవస్తువు. జానపదప్రదేశములలో నుండేవారు తమకు దూరముగా ఉండే బంధువులకు తమ సుఖములో కష్టములో తెలుపుకొనుటకై అదియొక సులభమైన సాధనము. అయితే ఆ పోష్టుకార్డును నింపడ మంత సులభమైన పనికాదు వారికి. క్రిష్ణాజిల్లాలో పదిలక్షలకు పైగా జనులున్నారు. వేయిగ్రామము లున్నవి. కాని పోష్టాఫీసులు 40 యే యున్నవి (కల్లుదుకాణములు 80 ఉన్నవి !) కనుక ఎవడైనా ఒక పోష్టుకార్డును కొనుక్కోవాలంటే కొన్ని మైళ్లదూరం నడవవాలి. గ్రామాలలో నూటికి 92 గురు నిరక్షరాస్యులు కనుక, వారు చదువురానివారైతే తాను చెప్పదలచుకొన్న నాలుగుమాటలూ వ్రాయించేటం

దుకు ఒకలేఖరిని వెతకుకోవాలి. ఇదంతా అయినతరువాత, మళ్లీ అంతదూరమూ నడచి దానిని తపాలాపెట్టెలో వేయాలి. ఇల్లాగ యెన్నిజిల్లాలవారో ఉన్నారు. కాని వీరు పడుచున్న బాధలతో ఇండియాప్రభుత్వము వారికి తృప్తికలుగ లేదు. ఈ పోష్టుకార్డు ఖరీదును మొట్టమొదట నూటికి నూరు చొప్పున తరువాత 200 చొప్పున పెంచేశారు. హిందూదేశపు శాసనసభ (అసెంబ్లీ) లో కోట్లకొలది అనాధలగు ఈ పేదల కష్టములను గూర్చి యెన్నెన్నో చర్చలు విన్నపములుచేశారు. కార్డువెల ఎంతైనా సరే తగ్గించుమన్నారు. గవర్నరుజనరలు గారు వీరిమాటలను త్రోసేసి మునపటిరేటునే నిఖరపరచారు.

కాని ఇదే భాగ్యవంతులైతే గవర్నమెంటు ఏమి చేస్తుంది? చెక్కులమీద, బిల్సు ఆఫ్ డిస్కౌంటుమీద స్టాంపుడ్యూటీ తీసివేయలేదా? ఎంతమొత్తపు సొమ్ముగల చెక్కుమీదనైనా సరే, అణాస్టాంపు అంటించాలని న్యాయశాసనముండేదే! దానిని తీసివేయలేదా? అయితే దీనివలన లాభమెవ్వరికి కలిగినది? భాగ్యవంతులకు, అందులోనూ అధికముగా ఐరోపీయులకు. ఏలననగా వారు ఉపయోగించినంత మేరకు చెక్కులను మరియెవ్వరూ తీయరు. ఒక పెద్దకంపెనీ దినమునకు 1000 చెక్కులను డిస్కౌంటుబిల్లులను వ్రాయవచ్చును. దానికి 1000 అణాలు లేక రు 62-8-0 లు దినమునకు కూడికఅగును. అనగా నెలకు రు 1500 లును సంవత్సరమునకు రు 18,000 లును ఆదాయము మిగిలినట్లు. ఇదంతా

ప్రభుత్వమునకు నష్టమే. పోస్టుకార్డు వెలతగ్గిస్తే ఇటువంటి నష్టాలెట్లు పూటుపడగలవు ? కనుక శ్రీమంతులగు భారతీయుల శ్రేయస్సుకై పేదభారతీయులను బలియిచ్చినట్లైనది. అందులోనూ ఈ లాభము మరీ యెక్కువగా ఐరోపీయజనాభాది. వారు యెడతెగకుండా స్టాంపుడ్యూటీమీద, ఆదాయపుపన్నుమీద దండయాత్రలు సాగిస్తునే ఉన్నారు. వారి కందరకూ ఇవే ప్రధానమైన రాజకీయసమస్యలు. ఈ రెండింటిలో ఒకదానియందు వారు సంపూర్ణ విజయమును పొందినారు.

## 11 వ అ ధ్యా య ము

### బ్యాంకులు—భీమా కంపెనీలు

మనలను పరిపాలించుచున్న వారందరూ సివిలు ఉద్యోగస్థులు, పోలీసు సూపరెండెంటులే అని ప్రజలంతా సాధారాణంగా అనుకుంటున్నారు కాని ఈఉభయులకూ అసలేమియూ తెలియదు. దేశము నంతటినీ తమ మడమలక్రింద త్రొక్కిపెట్టగల నిజమైన అధికారులవలె వారు పైకి కనుపించుచున్నను, వారు మీరు చేసిన రాజద్రోహపు ఉపన్యాసమునకో వ్రాసిన రాజద్రోహపు వ్యాసమునకో మీకు ఒకటో రెండో సంవత్సరములు శిక్షవిధించుటకంటె అధికముగా మరేమీ చేయలేరు. కాని బ్యాంకర్లూ, భీమాయేజంట్లూ, కాస్త నెట్టుకుంటే చాలును. మీ యావజ్జీవన భాగ్యమును ముక్కముక్కలుగ చేయగలరు.

వర్తకుల వాణిజ్య భాగ్యమంతయు బ్యాంకుల దయాదాక్షిణ్యములమీాదనే ఉన్నది. దేశములో ఒక్క ఇంపీరియలు బ్యాంకే కాకుండా ఇంకా అనేక స్వదేశీబ్యాంకు లుంటేనే దేశీయ వాణిజ్యము వర్ధిల్లుతుంది. ఇంపీరియలు బ్యాంకుకు చిన్న చిన్న క్రొత్త బ్యాంకులంటే యెటువంటి సవతిప్రేమయో ఉదాహరణములద్వారా చూపించవచ్చును. ఎక్కడైనా ఒక చిన్న బ్యాంకు పెడతారంటే, అక్కడ ఉండే ఇంపీరియల్

బ్యాంకుతో సంబంధమున్న వారు (constiuents) ఎవరూ మొట్టమొదట అందులో భాగస్వాములు (share-holders) గానూ, తరువాత డైరక్టర్లుగాను, తరువాత ఉద్యోగస్థులు (office bearers) గాను, ఆఖరుకు కాన్స్టిట్యూయన్సుగాను ఉండకుండా ఆటంకపరచ బడుచున్నారు. ఈ ఇంపీరియలు బ్యాంకునే సర్ బేసిల్ బ్లాకట్టు బ్యాంకర్సు బ్యాంకు అన్నాడు. ఈ బ్యాంకు చిన్న బ్యాంకుల కన్నిటికి సహాయముచేసి వర్ధిల్ల చేస్తుందని ఆయన నోటితోనే అన్నారు. కాని ఈబ్యాంకు స్వదేశీపరిశ్రమలకు వేనికిగాని ఓవరుడ్రాఫ్టుకాని, ఇతరసహాయము (accomodation) దేనిని గాని చేయదు.

ఈ గ్రంథకర్తయే ఒకప్పుడు ఒక బ్యాంకును ప్రారంభించి వ్యవహరించుచుండెను. ఆయనకు రు 25,000 లకు ఒక చిన్న ఒవరుడ్రాఫ్టు కావలసి, ఆబ్యాంకు తాలూకు 8 లక్షల రూపాయలు విలువగల ప్రోనోట్ల నన్నిటిని జామీనుగా ఉంచబోయెను. ఇదికాక బ్యాంకు డైరక్టర్లందరును కలసి మొత్తముగాను, వేరువేరుగాను తీర్చే బాధ్యతపైని ప్రామిసరీనోటు వ్రాసి యియ్యబోయినాడు. ఇదిగాక బ్యాంకు పేరనే ఒక ప్రామిసరీనోటు వ్రాయించి యిస్తానన్నాడు. కాని ఇంపీరియలు బ్యాంకువారు యిందు కంగీకరించలేదు. ఈచిన్న సదుపాయమును చేయించవలెనని యెన్నో ప్రయత్నములు చేసినారు. అన్నియును వ్యర్థమైనవి. హిందూదేశమునకు బట్టల

వ్యాపారములో 72 కోట్లు నష్టము వచ్చుచున్నది గాని ఈ బ్యాంకులు విదేశీభీమాకంపెనీల మూలముగా 100 కోట్లు నష్టము వచ్చుచున్నదని అనుకొందురు.

ఇంగ్లీషువా డెవడైనా ఇంగ్లాండునుండి ఇండియాకు సామాను తెచ్చినట్లు ఒక బిల్లును (Bill of Lading) తన జేబులలోనుంచి తీసి చూపించితే చాలును. ఇండియాలోనున్న ఇంగ్లీషుబ్యాంకులు అతను అడిగి అడగడములో ఓవరుడ్రాఫ్టు నిస్తారు. కాని సహకారోద్యమము వెనుక మద్రాసు రాజధానిలో 17000 సంఘములు పరిమితిలేని పూచీ సూత్రముపై నిర్మింపబడి 1000 కోట్ల రూపాయల ఆస్తి పూచీకత్తు (Security) తో ఉన్నా, 31 సెంట్రలు బ్యాంకులమీదను ఒక అపెక్సు బ్యాంకిమీదను 54 లక్షల రూపాయలు ఓవరు డ్రాఫ్టును సంపాదించుకొనేటందుకు నానాకష్టములను పడ్డది.* ప్రతిదినమును ఈబ్యాంకులకు ఆ ఇంపీరియలు బ్యాంకునుండి యేదో ఒక చిక్కు సంభవించుచునే ఉండును. ఒకప్పుడు స్వల్పవాయిదా ఋణముల కాలపరిమితి 12 మాసములు మాత్రమే ఉండవలెనని విధించినది. ఇంకొకప్పుడు ఓవరు డ్రాఫ్టు మొత్తమునకు సరిపడా బ్యాంకులవద్ద స్వల్పవాయిదా ఋణములే ఉండవలెనని నిర్ణయించెను. చివరకు ఈ ఓవరు

* ఈ అంకెలు 1929 నాటివి.

డ్రాఫ్టు మొత్తమునకు సరిపడియుండు జామీనులు (Collateral Securities) సహకారతత్వస్వభావము గలవి కాక గవర్నమెంటు సర్టిఫికేటులు (Government Scrip) అయి యుండవలెనని తీర్మానించెను.

అయినా ఈ ఇంపీరియలు బ్యాంకే మద్రాసు మౌంటు రోడ్డులో ఉన్న యూరపియను కంపెనీలకు, రిజస్టరైనవానికి కానివానికికూడా, 9 లక్షలు మొదలు 120 లక్షల మొత్తము నకు ఓవరుడ్రాఫ్టులనిచ్చి అనంతమైన సౌకర్యముల నెట్లు యిచ్చుచున్నదో ఊహించుకొనుము. మద్రాసులో ఉన్న మౌంటురోడ్డు ఫర్మ్లు కాని, బొంబాయిలో ఉన్న హారన్బీ రోడ్డు ఫర్మ్లుకాని, కలకత్తాలో ఉన్న చౌరంఘీఫర్మ్లు కాని, లాహోరులో ఉన్న మాల్ఫర్మ్లుకాని, యిచ్చే జామీనుకాని ఆయూరాష్ట్రములలో ఉండే వేలకొలది పరిమితి లేని పూచీసంఘములతో కూడిన సహకారోద్యమ మిచ్చెడి జామీనులకంటె యెక్కువది కాదుగదా!

పోనీ, ఇదంతా సహకారోద్యమమునకు సంబంధించిన విషయమని సరిపెట్టుకొందము. వాణిజ్య పరిశ్రమల విషయము నకే తిరిగీ వత్తము. మిల్లుతరువాత మిల్లు కాస్త కష్టదశలో ఇంగ్లీషు బ్యాంకులవద్దకు వెళ్లడము. ఆమిల్లుకు అప్పటికాస్త సహాయము చేయడము, తరువాత అది దుఃఖభాజనము కావ డము, ఈచరిత్ర సుప్రసిద్ధము. చిట్టీవలసలోని జనుపనార

మిల్లుకు ఇంపీరియలు బ్యాంకు ఆఫ్ ఇండియా 13½ లక్షల రూపాయీలు బదులిచ్చినది. ఈ మిల్లుకు అధికారులు సౌతు ఇండియన్ ఇండస్ట్రియల్సు కంపెనీవారు. వారిని 7 దినముల లోగా ఆ అప్పును తీర్చుమంటే తీర్చలేకపోయినారు. చెన్న పురి హైకోర్టువారు ఆమిల్లును 1 గంటలోగా ఎత్తివేయ (wind up) చేయ, వలెనని ఆజ్ఞాపించినారు. మిక్లోడు అండు కో అనే ఒక కలకత్తా ఫర్మువారు? దానిని బహిరంగపు వేలాములో కొనుక్కొన్నారు.

రాజమహేంద్రవరమునందున్న కర్నాటక పేపరుమిల్లు వారికి మద్రాసుప్రభుత్వమువారు స్టేటుఎయిడు టు ఇండస్ట్రీసు ఆక్టు క్రింద 4½ లక్షల రూపాయలు బదులిచ్చిరి. ప్రభుత్వము కూడా బ్యాంకులవలెనే చేసినది. పై ఆక్టు ప్రకారము ప్రభుత్వము ఆమిల్లులను స్వాధీనము చేసుకోవచ్చును. తానే పని చేయవచ్చును. విక్రయించవచ్చును. వేరే మేనేజమెంటు యేర్పాటు చేయవచ్చును. ఒక ఇండియను దళారీ (బ్రోకరు) ద్వారా ఆమిల్లును ఒక యూరపియను కంపెనీకి స్వాధీనము చేస్తారని పుకారు పుట్టగానే, మద్రాసు శాసనసభ పెద్ద ఆందోళన చేసినది. దీనిఫలితముగా ఆమిల్లును ఐరోపీయుల స్వాధీనముచేయక ఒక జాయింటుస్టాకు కంపెనీని యేర్పరచి దానికి ఒప్పచెప్పినారు. మద్రాసు హైకోర్టువారు అయిదు నిమిషముల ఇంక్వైరీ నొకదానిని సాగించి దానిని యెత్తి వేయవలెనని ఆర్డరు ప్యాసుచేసినారు. ఈలోగా 40,000

రూపాయల చిన్న మొత్తమును ఆకంపెనీకి బదులిచ్చిన ఋణదాత యొకడు దానిని స్వాధీనము చేసుకొనుటలో విజయము నందినాడు. ఆఖరుకైనా కాస్త మంచి తెలివి వచ్చి, ఆమిల్లును లిక్విడేటు చేయించకుండా ఇండియను పెట్టుబడిదారులకు ఒప్పచెప్పినందుకు సంతోషము.

బెజవాడ స్పిన్నింగు అండు వీవింగుమిల్లు ఆరులక్షలు పెట్టి స్థాపించినారు. దీనిలో ౫ లక్షలు చెల్లించబడిన మూలధనము (Paid-up Capital) ఇండియను బ్యాంకు లక్షాయిరవై వేల రూపాయలను, ఇంపీరియలు బ్యాంకు ముప్పై వేల రూపాయలను దీనికి బదులిచ్చినవి. మేనేజింగు డైరక్టరు యెంతో నిస్వార్థముగా పనిచేసి తన స్వంతధనము లక్షాయాభై వేల రూపాయలను అందులో పెట్టినను, ఈమిల్లు 6—6—1929 తేదీని యెత్తివేయవలసి వచ్చినది.

ఆఖరు ఉదాహరణము మచిలీపట్టణము సుగరుమిల్లు. దీనికి ఇంపీరియలు బ్యాంకు రు 30,000 లు బదులిచ్చెను. దీని మేనేజింగు డైరక్టరులు, ఈ అప్పునకు ఆరు రెట్లు ధనమునకు అధికారులు, తమ సంయుక్తబాధ్యతలు వేరువేరు బాధ్యతల (Joint and several liabilities) మీద ఈకంపెనీకి అడ్వాన్సు పెట్టియుండిరి. స్వల్పవాయిదా ఋణమును తీర్చవలసిన సందర్భమున ఒక తగాదావచ్చి, ఆఖరుకు మూలధనముచాలక కంపెనీని యెత్తివేయవలసి వచ్చినది.

యదార్థమేమనగా ఇంగ్లీషు బ్యాంకులును గవర్న మెంటుతో సంబంధముగల (Quasi Governmental) బ్యాంకులును దేశీయపరిశ్రమలకు తోడుపడవలసిన బాధ్యత తమకున్నట్లు ప్రవర్తించవు. ఈదేశమునుండి విదేశములకు వస్తువుల నెగుమతిచేసే కార్యములకే అవి మిక్కిలి తోడుపడ గలవు. చట్టము (Statute) ప్రకారము ఇంపీరియలుబ్యాంకు ఆరుమాసములకు మించిన కాలమునకు ఋణముల నీయ జాలదు. అట్టి స్వల్పవాయిదా ఋణములు వాణిజ్యమునకే తప్ప పరిశ్రమాభివృద్ధికై యెందుకును పనికిరావు.

ఈ దేశమునుండి విదేశమునకు వస్తువులను యెగుమతి చేసే అనేకఫర్ములు, వాల్కాటు బ్రదర్సు, ర్యాలీ అండు కో మొదలైనవి ఐరోపీయ ఫర్ములై ఉండుట చాలా ఆశ్చర్యము. ఎక్సేంజి బ్యాంకులతోను, ఇతరబ్యాంకులతోను రాయబార ములు జరిపి కావలసిన సహాయములను ఆఫర్ములే కుదర్చ గలవు. వీరుకాక యే ఇండియను ఉత్పత్తిదారో, యెగుమతి దారో అయినచో వీరితో సమానముగా ఆపనిని చేయజాలరు. ఛాన్సువల్ల యెవడైనా ఒకడు ఈమార్కెటులో దూరి కాస్త ముందుకు రాగలిగినాడా, ఇంగ్లాండులో ఉన్న బ్యాంకులు బటువాడా సంస్థలు (clearing houses) అతనితో ప్రత్య క్షము (Direct) గా వ్యవహరించుటకు నిరాకరించును గనుక అతను బోల్తాపడతాడు. యూరపియను ఫర్ములు, యూరపి యను మేనేజిమెంటులో ఉన్న సంస్థలకే సహాయముచేసే

బ్యాంకులు, వీనివల్ల హిందూదేశ వాణిజ్యపరిశ్రమలు ఈరీతిని అడుగంటుచున్నవి. ఈ బ్యాంకులు పంటదినుసుల హామీమీద బదులిచ్చునప్పుడు, న్యాయముగానే, ఆసరుకులను భీమా చేయించవలెనని కోరును. ఆభీమా కంపెనీలన్నియు నిన్నటివరకును పూర్తిగా విదేశీయములే. నగరములలో వాని శాఖలుండిన యెడల ఆశాఖల యేజంట్లుకూడ విదేశీయులకు యేజంట్లే. బ్యాంకింగు యందుగల ఈ నిరంకుశత్వసమస్యను, అందుగల పక్షపాతసమస్యను మన మిప్పుడిప్పుడే ఛేదింప గలుగుచున్నాము. ఇదివరకే చెప్పి "యంగుఇండియా"లో ప్రకటింపబడిన "Do they enjoy privileges" అనే వ్యాసమునుండి ఈ అంశమునుగూర్చి ఈదిగువ భాగముల నుదహరించుచున్నాము.

"బ్యాంకింగు సందర్భమునను గూడ ఐరోపీయుడు పాలకజాతికి చెందిన లాభము ననుభవించుచున్నాడు. బ్రిటిషువారు ఈదేశమునకు రాక మునుపే ఈదేశమున బ్యాంకింగు, విదేశములతో బ్యాంకింగు సహా, స్థిర పడి వర్ధిల్లుచునే యుండెను. కాని ఈష్టు ఇండియాకంపెనీ అధికారము పెరిగినకొలదీ, ఈబ్యాంకింగు అంతా కంపెనీసేవకుల చేతులలోనికి పోయి నది. దేశీయబ్యాంకరూ దేశీయవర్తకుడూ కూడా ఇందువల్ల నాశనమైనారు. ఇందువల్ల విదేశీబ్యాంకరుకు ఈదేశమునందు తలకుతగనంత ప్రాధాన్యము వచ్చినది, తనతో పోటీచేసేవా రెవరూ లేక నిరాటంకముగా శ్రీమంతుడైనాడు. ఈవిదేశీబ్యాంకులు వచ్చి స్వదేశీబ్యాంకులను బలవంతముగా ఊడపీకుటయేకాదు, దేశీయపరిశ్రమలను వాణిజ్యమును వర్ధిల్లనీయ

కుండా చేసే పెనుభూతము లైనవి. అవి భారతీయ ఉద్యమముల కెట్టి ప్రోత్సాహమును నీయని దుర్నీతిని ప్రారంభించినవి. ఆదుర్నీతియే నేటి వరకును సాగుచున్నది. కొన్ని ఉదాహరణముల నీదిగువను చూపుచున్నాము.

కీ॥ శే॥ లాలాహరికిషనులాలు ఇండస్ట్రియలు కమీషను యెదుట నిచ్చిన సాక్ష్యములో ఇట్లు చెప్పుచున్నాడు "పంజాబు బ్యాంకింగును నాశనముచేయు నిశ్చితోద్దేశముతో ఒకకుట్ర (conspiracy) ప్రారంభ మైనది. ఈకుట్రలో అధికారవర్గమువారు అనధికారవర్గమువారు అందరూ చేరిరి పంజాబు బ్యాంకింగును నాశనముచేయుటకై వీరుచేయని ప్రయత్నమును అవలంబించనిమార్గమును లేదు. ఈకుట్రయే సాగకుండినయెడల పంజాబుబ్యాంకులు పంజాబురాష్ట్రమునకును ఇతరరాష్ట్రములకును యెంతో ఉపకారమును కలుగజేసియుండేవి" ఇదే సాక్ష్యములో అతను ఈదిగువ విషయములను గూడ తెలుపుచున్నాడు.

"ఒక ఆంగ్లోఇండియను బ్యాంకునకు ఋణముకొరకై ఒక ఐరోపీయుడు దరఖాస్తును పెట్టెను. ఈఋణధనమువల్ల ఏభారతీయునకుగాని, ఇతరబ్యాంకునకుగాని ఏవిధముగానూ లాభము కలుగదని ఖచితముగా తెలిపెదవా? అని అతనిని అడిగినట్లు నాకు స్పష్టముగా తెలుసును. ఈ రీతిని ఖచితముగా చెప్పినయెడల అతనికి ఋణము ముట్టేయేర్పాటు చేస్తామనీ, లేకుంటే చేయమనీ అతనికి చెప్పినారు"

"ఇటువంటి ప్రశ్నలవల్ల ఒక దశాబ్దము క్రిందట అనగా 1921 ప్రాంతములలో దేశముయొక్క అవస్థలెట్లున్నవో తెలియగలదు. అప్పటి నుంచి ఇప్పటికి పరిస్థితులేమీ మారలేదు. సెంట్రలుబ్యాంకు ఇంక్వైరీకమిటీ వద్ద చెప్పఁబడిన కొంత ప్రధానమైన సాక్ష్యమునుబట్టి విదేశమారకపు

(Foreign exchange) బ్యాంకులు, ఒకటికాదు అనేకమార్గముల ద్వారా, జాతీయవ్యవహారములకు విరోధముగా వర్తించుచున్నట్లు మనము గ్రహించగలము. కమిటీవద్ద సాక్ష్యము చెప్పుటకై వెళ్లిన భారతీయ వర్తకులు ఎక్స్ఛేంజి బ్యాంకులమీద కొన్నిఫిర్యాదులను నిర్దేశించి చూపినారు. వీరందరిఫిర్యాదులలోనూ సమానముగా కనిపించునదొకటిఉన్నది. అది యేమనగా, ఎగుమతి దిగుమతి వ్యాపారస్థులకు బదుళ్లిచ్చే సందర్భమున ఎక్స్ఛేంజి బ్యాంకు లెల్లప్పుడును ఇండియను ఫర్ముల ఐరోపీయ ఫర్ముల మధ్య భేదమును పాటించుచునే యున్నవి. కమిటీయెదుట సాక్ష్యము చెప్పిన ప్రతీవాణిజ్యసంస్థయు బ్యాంకులమీద నిట్టి నేరమును చూపించుచునే యున్నది ”

ఇదికాక ఈబ్యాంకులు చేసే ఇతర అపచారములు కూడా ఉన్నవి. ఉదాహరణ మొకటి చూతము. హిందూదేశపు ఫర్ములను గురించి విదేశములలో జరిపే విచారణ ప్రశ్నావళిలో ఎక్స్ఛేంజి బ్యాంకులు ఇండియను ఫర్ములను గురించి నీరసముగను, అంతకంటె తక్కువనైననుసరే ఐరోపీయ ఫర్ములను గురించి అయితే గౌరవముగాను ప్రవర్తించుచుండును ఇండియను ఫర్ములతో విదేశవ్యాపారమునందు పోటీచేసే ఐరోపీయ ఫర్ములకు ఇట్టి చర్యలవలన అన్యాయముగా అనేక లాభములు కలుగుట సహజము. ఇండియను వర్తకులు ఋణములకై ఈబ్యాంకులకు దరఖాస్తుపెడితే, తమచే అంగీకరింపబడిన ఆడిటర్లు తనిఖీచేసి వ్రాసిన బ్యాలన్సుషీటులను ఆదాయ వ్యయపట్టికలు చూపించుమని ఈబ్యాంకులుకోరును ఇదీకాక, ఈవిదేశ బ్యాంకులు భారతీయవర్తకులకు తాము బదుళ్లిచ్చే సమయమున, ఆబదుళ్లు యేసరకుల యెగుమతిదిగుమతికొరకై చేయబడుచున్నవో ఆసరకులను భారతీయేతర భీమాకంపెనీలలోనే భీమా చేయించవలెనని నిర్బంధించును.”

"ఇన్ని అన్యాయములు చేస్తున్నా ఈబ్యాంకులు చేయుచున్న మోస్తరు వ్యాపారములో వీనికి సర్వాధికారము (Monopoly) ఈయ బడినది. ఇంపీరియలు బ్యాంకు ఎక్సుఛేంజి బ్యాంకులు చేసే పనులనుకూడా చేయుచున్నయెడల, ఎక్సుఛేంజి బ్యాంకుల హక్కులలోనికి చొచ్చుకున్నట్లగును గనుక అట్టివ్యాపారములలో పాల్గొనకుండా నిషేధింపబడినది. కాని, అది బ్యాంకర్సు బ్యాంకు అయి, ప్రభుత్వమును ఇతర ప్రజాహిత సంస్థలును దాచుకొనుసొమ్ముతో వ్యవహరించునదైనప్పటికిని ఇండియను జాయింటుస్టాకు బ్యాంకులతో పోటీచేయుటకు మాత్రము అంగీకారము ఈయబడినది.

"గవర్నమెంటు ఋణములు చేసే పద్ధతియు, దానితో చేరి ఇంపీరియలు బ్యాంకు దేశమంతటా తనశాఖల నేర్పాటుచేయుటకై తోడుపడుచుండు పద్ధతియు ఇవిరెండూకలసి, హిందూదేశపు షరాబులుచేసే దేశీయబ్యాంకింగు విధానమును పూర్తిగా చావగొట్టినవి"

# 12 వ అ ధ్యా య ము

## వి ద్యు చ్ఛ క్తి.

ఇంగ్లాండులో నిరుద్యోగసమస్యప్రజల మనగానే ఇం గ్లీషుపరిశ్రామికులకు మంత్రులకు క్రొత్తవాలాలు క్రొత్తబిల్లు లేదా క్రొత్త క్రొత్తబజార్లు క్రొత్తమార్గాలు వెదకుకొనుటకై ప్రపంచమంతటా తిరగవలసివచ్చినది. పూర్వాపూతరమునాటి సరుకులు అంగళ్లు అన్నీ సంపూర్ణం చేసేసినారు గనుక విద్యు చ్ఛక్తిపరికరములు యంత్రములు ప్రచారముచేసి తద్వారా తరించుటకు వారు పూనుకున్నారు. ఇప్పుడు ప్రభుత్వమువారు ప్రతీపట్టణమునందును టెలిఫోనుస్తంభములను పాతించుట కును, నగరమును నగరమును ఆ రీతిగా చేర్చి ముడిపెట్టుటకును చాలా ప్రోత్సాహమును ఇచ్చుచున్నారు. ఇంతేకాదు, పట్ణా లన్నిటిని విద్యుద్దీపవిరాజితములుగా చేయుటకై మునిసిపాలి టీలవారు ప్రణాళికలను ఎష్టిమేటులను తయారుచేసి పంపించ వలెనని 1926 లో సర్క్యులరు కూడా పంపించినారు.

ఈ విధంగా కొంతకాలము జరిగినది. కాని రెండేండ్లు దాటకుండానే ఈ విషయమున క్రొత్తవ్యవహారసూత్రము నవ లంబించవలసి వచ్చినది. రాజమహేంద్రవరం, కాకినాడ, బెజ వాడ, కర్నూలు కూనూరు మొదలుగా గల మద్రాసురాజ ధానియందలి నగరములు తమ కంట్రాక్టులను ఇండియనుఫర్మ్ లకు ఇవ్వడం, ఈ ఫర్ములు తమకుకావలసిన యంత్రములను

జర్మను అమెరికను పారిశ్రామికుల వద్దనుంచి కొనుక్కోవడం తటస్థించగానే, బ్రిటిషుపారిశ్రామికులకు నష్టంవచ్చినట్లు ప్రభుత్వమువారికి తెలిసినది. కనుక మద్రాసుప్రభుత్వమువారు ఒక క్రొత్త జి. ఒ. ను ప్యాసుచేసినారు. ఈ ఆర్డరుప్రభుత్వానుకూల వర్తియగు స్థానికప్రభుత్వశాఖ (లోకల్ సెల్ఫు గవర్నమెంటు డిపార్టుమెంటు) ముఖతానే కష్టంలేకుండా వచ్చేసింది. దీనిప్రకారం, గవర్నమెంటు ఎలిక్ట్రికలు ఇనస్పెక్టరు (ఇతడు ఇంగ్లీషువాడుగానే ఉండును గదా) సిఫార్సుచేయనిదే యే మునిసిపాలిటీయు ఎలెక్ట్రికు మిషీనరీకొరకు టెండర్లను అంగీకరించరాదు. మునిసిపాలిటీలకు తమ విచక్షణానుబట్టి తీర్పులనుబట్టి ఇష్టమువచ్చిన టెండర్లను స్వీకరించుటకును, ఇచ్చుటకును, ఇష్టమువచ్చిన కంట్రాక్టరులను నిర్ణయించుకొనుటకును శాసనసిద్ధమైన అధికారములు ఉన్నప్పటికీ, వాని స్వాతంత్ర్యమును సంకుచితపరచుటకు గవర్నమెంటువారు ఈ రీతి వ్యవహారములను చేయుచునే యుందురు.

ఇంతకుముందు మునిసిపాలిటీలవారు విద్యుద్దీపములకై తగిన సన్నాహములను చేసుకోకముందు రెండుమూడు సంవత్సరములకు పూర్వమే వారిమీద మూడునాలుగు లక్షలరూయీల ఋణములను కమ్మరించి వడ్డీలు లాగుచుండే న్యాయము నవలంబించుచుండిన ప్రభుత్వము, ఎలెక్ట్రికు మిషీనరీల కొరకయ్యే టెండర్లను తగినరీతిని (అనగా బ్రిటనుకు లాభకరమగు రీతిని వ్యవహరించక పోయినట్లయితే ఋణముల నీయ

జాలనని బెదరింపజొచ్చినది. దీని అర్థమింతే. అయినా, 1930 లో సమావేశమైన కలకత్తాఎలెక్ట్రికలు ఇంజనీర్లు మద్రాసు ప్రభుత్వముయొక్క ఈ చాతుర్యమును మిన్నంట ప్రశంసించుచు మద్రాసుప్రభుత్వమునకు తంతివార్తల నంపినారు.

కలకత్తాఎలెక్ట్రికు సప్లయికార్పరేషనువారు తమ సంఘసూత్రముల (ఆర్టికిల్సు ఆఫ్ అసోసియేషను) ను సవరించుకొనిరనిన్నీ, ఆ సవరణలప్రకారము ఆ కంపెనీవ్యవహారములు బ్రిటిషు ప్రజల (British Subjects) చేతులలోనే ఉండునట్లు చేయబడినవనిన్నీ మాకు తెలియుచున్నది. బెంగాలు ప్రభుత్వమువారే ఈ కంపెనీకి ఇట్టి జాగ్రత్తకరమైన అనుకూలములను నిర్బంధముగా కలిగించినారు.

# 13 వ అ ధ్యా య ము

## సై న్య ము లు

ఆఖరుకు, హిందూదేశపు సైనికనిర్మాణ వ్యవహారము లను తీసుకొందము. పాశ్చాత్య జాతులందరివలెనే బ్రిటిషు వారును నిర్మాణ వ్యవహారదక్షత (Organising Powers) యందు దిట్టమైనవారని ప్రసిద్ధిపొందినవారు. ఈనిర్మాణ వ్యవహార దక్షతయందే ప్రాగ్జాతుల కెట్టినైపుణ్యమునులేదని తరుచుగా వారిపైని నేరము మోపబడుచుండును. నిర్మాణ దక్షతాశబ్దమునకుగల సరియైన అర్థమేమో బహుశా చాలామందికి తెలియదు. శాంతిసమయములందు నిర్మాణ దక్షత అంటే ఇతరులకు నష్టకరమగు నట్లును తమకు సర్వ సౌకర్యవంతమగు నట్లును పరిశ్రమలను దిట్టపరచుకొని కూర్చుండుట (దీనినే "ఇండస్ట్రియాలిజము" అంటారు). యుద్ధసమయములందు నిర్మాణదక్షత అంటే ఇతరసీమల నన్యాయముగా ధ్వంసముచేసి తమక్రిందకు తెచ్చుకొన యత్నించుట (దీనినే "మిలిటారిజము" అంటారు). ఇండస్ట్రియాలిజము విషయములో బ్రిటను ఇండియాను కేవలము బ్రిటిషువాణిజ్య పారిశ్రామిక సౌకర్యములకొరకే యెట్లు పరిపాలించుచున్నదో చూచియుంటిమి. మిలిటారిజము విషయములోకూడా అటువంటి నీతియే జరుపబడు చున్నదనిమనము ఒప్పుకోక తప్పదు.

హిందూదేశములో నేడు బ్రిటిషు ప్రభుత్వమువారు 61,000 బ్రిటిషు సైనికులను పోషించుచున్నారు. వీరందరూ

మొట్టమొదటిలో 17, 24 సంవత్సరముల మధ్యవయస్సు లోపలివారే. ఇండియాదండుగమీద వీరికి 7 సంవత్సరములు శిక్షణమిస్తారు. వారికి 24 సంవత్సరముల వయస్సు రాగానే, ప్రశస్తమైన సైనికశిక్షణము పూర్తికాగానే, అనగా అటువంటి వయస్సువచ్చి ఆశిక్షణము మూలముగా దేశమునకు ఉత్తమసేవచేయు తరుణము రాగానే, వారివల్ల ఇండియాకు ఎట్టి ప్రయోజనంకూడా లేకుండా చేస్తారు. అప్పుడు వారిని సైనికసేవలనుండి తప్పించేస్తారు. కొందరు హిందూదేశములో సిపాయిలుగా ఉంటారు, కొందరికి సివిలు ఉద్యోగాలు, కొందరికి పోలీసు ఉద్యోగాలు ఇస్తారు, కొందరిని ఇతర శాఖలలో చేర్చుకుంటారు. కొందర్ని ఇంగ్లాండు పంపించేస్తారు. వీరంతా బ్రిటిషు సిపాయీలు, బ్రిటిషు పౌరులు. అయినా వీరికి శిక్షణము నిచ్చుటకై వల్లమాలినంత ఇండియా ధనము వ్యర్థము చేయబడుచున్నది.

ఈదండుగ ఇంతటితో సరియా? కాబోయే సిపాయి నొక్కొక్కరిని ఇండియాకు తెచ్చుటకు తల 1 కి పౌ. 28 షి. 14 లు అగును. 61,000 మందికి ఇందుకోసమే 15 లక్షల పౌనులగును. ఇల్లాగ ఒకసారితో తీరిందా? యేటేటా శిక్షణము పూర్తియైనవారు కొందరు పోతునేఉంటారు, క్రొత్తవారు కొందరు వస్తునేఉంటారు కనుక ఇందులో కొంతభాగము యేటేటా దండుగఅవుతూ ఉండవలసినదే. భరతఖండ మిట్టి నిస్సహాయస్థితిలో ఉన్నది. సైనికనిర్మాణదక్షతకొరకు ఇం

గ్లాండు భరతఖండము నీరీతిగా దోచివేయుచున్నది. భారతీయులు సైన్యములో ఉద్యోగస్థులగుటకు వీలులేదు, ఇంజనీరింగు ఆర్టిల్లరీశాఖలలోనికి వారిని చేర్చుకోరు. ఈవిధముగా వారిపై విధించబడిన అసౌకర్యములను మనమిక్కడ వల్లించనక్కరలేదు. దీనితో మన గ్రంథోద్దేశమునుబట్టి మన కిక్కడ ప్రసక్తిలేదు. 1929 లో 3200 సైనికోద్యోగస్థులు (Officers) లో 91 రు మాత్రమే భారతీయులని చెప్పినచాలును.

స్కీను కమిటీవారి సిపార్సుల కెట్టిగతి పట్టినదో మన కందరకును తెలియును. ఈదేశపు సైనికవ్యవహారముల నేరీతిని పునర్నిర్మాణము (reorganisation) చేయవలెనా అను సందర్భమున భారతదేశమునకును బ్రిటనునకును గల ప్రధాన భేదములన్నియు ఈదిగువ విషయములనుగురించియై యున్నది. ఇండియాలోని సైనికసంబంధమైన ఆయుధముల (arms) పైని అధికారము బ్రిటను చేతులలోనుండి ఇండియాదేశమునకు ఒప్పచెప్పవలెను. ఆయుధముల కొరకయ్యే ఖర్చులు ఇండియను మంత్రుల అధికారముక్రింద జరుగవలెను. ఇండియాను ఆక్రమించుటకై ఉన్న బ్రిటిషుసేన (British army of occupation in India) ఈదేశమును విడిచిపెట్టి పోవలెను. మనము ముఖ్యముగా గమనించవలసిన దేమనగా ఈసమస్య వెనుకనున్న రాజకీయదృక్పథము మాట యెట్లున్నను, ఆర్థికవిషయమునుబట్టి చూచినను ఇది ఆంగ్లసత్ప్రవర్తనకును శీలమునకును ప్రశంసను గూర్చినది కాదనియే.

# 14 వ అ ధ్యా య ము

## స్టోర్సు, ఇతరవిషయములు

ఇండియాపట్ల ఇంగ్లాండు ఒనరించుచున్న ఆర్థికపు దోపిడు లన్నిటిలో కూడా, స్టోర్సును కొనుక్కొనుటలో జరుగుచున్న అన్యాయము చాలా అపకీర్తిదాయకమైనది. ఈస్టోర్సు డిపార్టుమెంటంతా ఇంగ్లాండులో ఉన్నది. స్టోర్సుకమిటీవారు తమ నివేదికను 1920 లో ప్రకటించి కొన్ని సిఫార్సులను చేసినను నేటివరకును ఫికరు అన్నమాట లేదు. ఎన్నోపర్యాయములు అసెంబ్లీలో ఈస్టోర్సు కొనుక్కొనే సమస్యపై ప్రశ్నలు వేయబడినవి, కాని లాభములేదు. ఈచరిత్ర అంతా చాలా దీర్ఘమైనది. దీని నిక సూక్ష్మముగా ముగించవలెనంటే ఒక్క మాట చెప్పితే చాలును. ఈస్టోర్సు కొనుక్కోవడము విషయమై గవర్నమెంటువారు 1929 లో ప్రకటించిన సూత్రములు (rules) కొంతవరకు సంతృప్తికరముగా నున్నవి. హిందూదేశములోనే పండించబడిన ముడిపదార్థములను హిందూదేశములో పండించబడిన ముడిపదార్థములవల్ల ఇండియాలో తయారుచేయబడిన (manufactured) పదార్థములను, దిగుమతివస్తువులనుండి ఇండియాలో తయారుచేసిన పదార్థములను, విదేశములలో తయారైవచ్చి ఇండియాలో స్టాకుచేయబడిన పదార్థములను, కేవలము విదేశపదార్థము

లను కొనుక్కొనుటలో యెటువంటి ప్రిఫరెన్సు చూపవలెనో నిర్ణయించుచు రూల్సు ప్యాసుచేయబడినవి.

అయినను శస్త్రములు, మందుగుండుసామానులు మొదలుగా యుద్ధమునకు సంబంధించిన మారణాస్త్రములను, నౌకాబలమునకు సైనికబలమునకు విమానబలమునకు కావలసిన ఇతర వస్తువులను కొనుక్కొనుటకై కొన్ని ప్రత్యేక లక్షణములను విధించినారు. వీనిని తయారుచేయవలసిన విధానమునుగూర్చి, అడ్మిరాలిటీ, వార్ అఫీసు, ఎయిర్ మినిస్ట్రీ, ఇండియాగవర్నమెంటు లేక కమేండర్ ఇన్ ఛీఫు—వీరంతా కొన్ని డ్రాయింగులు, నమూనాలు, కొలతలు రీతులు నిర్ణయించియున్నారు.

ఇటువంటి లక్షణములుగల వస్తువులను మాత్రమే ప్రభుత్వమువారు ఇండియాలో దొరికితే ప్రిఫరెన్సు నిచ్చి కొంటారు; లేకుంటే లండనులోనున్న స్టోర్సుడిపార్టుమెంటుమీాద ఇండెంటుచేసి తెప్పించుకుంటారు. వీటన్నింటి విషయములో మరోషరతును కూడా చేర్చినారు. విదేశీవస్తువు లెంత సలక్షణమై యుండునో ఈదేశములో తయారైనవి కూడా అంత సలక్షణములై యుండవలెను. ఈసూత్రముల కేమాత్రం భేదంగా ఉన్నవానిని కొనకుండా త్రిప్పివేయవచ్చును. ఇంకొక సంతోషకరమైన విషయమేమనగా ఈస్టోర్సు అన్నింటిలోను సూపాయి టెండర్లు ఉదహరించవలెనని ఇప్పుడు ఖచితముగా వచింపబడినది. మొన్న మొన్ననే (1937 లో) దోమతెరలకై

ఒకఆర్డరును కాన్పూరుఫర్మువారికిని, బాకుల (daggers) కై ఒకఆర్డరును దయాలుబాగు కంపెనీవారికిని మిలిటరీడిపార్టు మెంటువారు ఇచ్చినారని తెలియుచున్నది.

## ఇ త ర వి ష య ము లు

ఇంకను అనేక విషయములున్నవి. వానిని పరిశోధిస్తే, ఇండియాలో బ్రిటను అవలంబించుచున్న నీతియంతయు బ్రిటిషు వర్తకులను ఉత్పత్తిదారులను, తోటలవారి (Planters) ని పారిశ్రామికులను లాభస్థానములలో ప్రతిష్ఠించుటయే అని తెలియగలదు. చాంపరాను చరిత్రయు, అచ్చటి ప్లాంటర్లు జనుల నుండి 64 విధములైన పన్నులను పిండుచుండుటయు యీ గ్రంథ కర్త వ్రాసిన కాంగ్రెసు చరిత్రవల్ల తెలియగలదు. బెంగా లులో ప్లాంటర్లు ఒనరించిన క్రౌర్యములే 1859 లో నీలిమందుకు సంబంధించిన అల్లరలకు కారణమైనది. సామ్రాజ్యసంరక్షణా వశ్యకత కలిగినప్పుడు ఇండియాలోఉన్న బ్రిటిషుప్రభుత్వము ఐరోపీయులనైనను నిర్దాక్షిణ్యముగ అణగద్రొక్కుటకు వెను దీయదు. ఇదివరకే మనమొక ఉదాహరణమును చూచినాము. భాన్లేమరణించిన తరువాత, నాగపూరుకోటను 1854 లో ముట్టడించి మధ్యరాష్ట్రములను కలుపుకున్న తరువాత, బెంగాలు ఎస్టాబ్లిషుమెంటుయొక్క ఒక రిటైరుడు ఆఫీసరు, మేజరు బొన్లీ యను ఒక ఐరోపీయుడు, విగతభర్తృకలైన రాణీలయొక్క ఇంగ్లీషు కరెస్పాండెన్సు పనిని చూచే పనిమీద నాగపూరు

పోవుచుండగా అతనిని వెంటనే అరెస్టుచేసి, నాగపూరు సీమను విడచిపెట్టి పోదునన్న వాగ్దానముపైని విడుదలచేసినారు. ఐరోపీయ ప్లాంటర్లుచేసిన అన్యాయములను బయలుపెట్టుటకై వ్రాసిన ఒక బెంగాళీ ప్రచురణమును ఇంగ్లీషు భాషలోనికి తర్జుమా చేసినందుకై రివరెండులాంగు అనే ఒక ఐరోపీయుని కలకత్తా హైకోర్టువారు జెయిలులోపెట్టి జరిమానా వేసినారు.

మొన్న మొన్నటివరకును ఇండియాలోని తేయాకు తోటలన్నియు ఐరోపీయుల మొనాపలీయందుండెను. మొట్ట మొదటి రోజులలో అస్సామునందును, కుమాఓను యందును వీనిని పెంచుటకై ప్రథమ ప్రయత్నములు జరుగుచున్న కాలములో వీనికైన ఖర్చులన్నిటినీ ప్రభుత్వమువారే భరించి యుండిరి. విత్తులను చీనానుండి తెప్పించిరి. చీనాలో తేయాకు నెట్లాపండించుదురో ఆవిషయములు నేర్చుకోబడినవి. మొదటి దినములలో చైనావారిని కూడా రప్పించినారు. ఇదంతా భరత దేశమునందలిపన్ను చెల్లించువారి సొమ్మువల్ల జరుపబడినది. ఆఖరుకు "ఈపరిశ్రమ నంతటినీ ప్రభుత్వమువారు తమ దేశస్థులకు బహుమానముక్రింద చదివించినారు. ఈ తోటలలో పనిచేయుటకై వెళ్లినవారిని బానిసలలాగ చేసుకొని పనిచేయించుకొనుటకై కావలసిన సదుపాయముల నన్నింటినీ వారికిచ్చినారు. అస్సాములో కార్మికులను తోట యజమానులు అరెస్టుచేయవచ్చునని ఒక స్పెషలు ఆక్టును ప్యాసుచేసినారు. కార్మికుల పనులలో యేమైనా లోపములు కనిపించినయెడల

వారిని క్రిమినల్సువలె దండింపవచ్చును, శాశ్వతముగా వారిచేత పనిచేయించుకొనుచుండవచ్చును.

బెంగాలులో జనపనార పరిశ్రమ పూర్తిగా యూరపియనుల (హక్కు) మొనాపలీ అని చెప్పవచ్చును. దీనివల్ల వారికి 1915—26 సంవత్సరముల మధ్య 30 కోట్ల రూపాయీలు లాభమువచ్చినది. హిందూదేశ పరిపాలనమంతయు, ముడి పదార్థములు బొగ్గుస్టోర్సు కొనుక్కోవడమునుంచి భీమావ్యాపారము దళారీ వ్యాపారమువరకూ అంతా ఐరోపీయులతో సంబంధముగలదే. ఏవస్తువుల గుణము లెట్లా ఉండవలెనని నిర్ణయించినను, అదికూడ ఐరోపీయులకు లాభప్రదముగా నుండుటకై ఊహించబడినదే.”

# 15 వ అ ధ్యా య ము

## 1935 చట్టముక్రింద వాణిజ్య రక్షణలు

హిందూదేశమునందలి బ్రిటిషు వాణిజ్యమున కంతటి కిని తాళముచెవి, అది ఈదేశములో నిర్మించిన రాజకీయాధి కారమే అనిన్నీ—ఆరాజకీయాధికారము ద్వారా (1) రైల్వే రేటులు, (2) నాణ్యములు, (3) మారకపురేటు, (4) సుంక ములు మీాద అది సంపాదించుకొనిన స్వాధీనత అనిన్నీ ఇది వరకే తెలిపియుంటిమి. వీనిలో మొదటి మూడింటిని గూర్చి వేరువేరు అధ్యాయములను వ్రాసి యుంటిమి. నాలుగవ దానిని గూర్చి యింక చెప్పవలసియున్నది.

1919 లో జాయింటు పార్లమెంటరీ కమిటీవారు, మాంటుఫోర్డు సంస్కరణములను ప్రశంసించుచు తన్మూలముగా ఇండియాకు ఆర్థికస్వపరిపాలనము ప్రసాదింపబడినదని పెద్ద ఆర్భాటము చేసినారు. కేంద్రశాసనసభలును, కేంద్ర ప్రభుత్వమును ఏకీభవించి అంగీకరించిన యెడల, బ్రిటిషు సామ్రాజ్య లాభమునకు ప్రమాదము కలుగనిపక్షమున, హిందూదేశము తనసుంకములను తానే విధించుకొనుటకై స్వాతంత్ర్యమీాయబడినదని ఆ చట్టమునందు గలదు. ఈచిన్ని దయాలేశమును మితవాదులందరును ఆసమయమున గొప్ప పురోగమనము (great advance) అనిన్నీ, డొమినియను స్టేటస్సువైపునకు చాలా దూరము తీసుకొని పోవుచున్న

దనిన్నీ చాటినారు. కాని 1935 ఇండియా ప్రభుత్వచట్టము ద్వారా వికసింపజేయబడిన ఇండియా రాజ్యాంగప్రణాళికా పరిణామమును చూచితిమేని, ఈవిశ్వాసమునందుగల సత్య మేమాత్రమో విశదము కాగలదు.

వాణిజ్య హక్కులలో సరిసమానత్వం

హిందూదేశములో బ్రిటిషువారి వాణిజ్యహక్కులు (British Trading Rights) ను గురించి 1935 ఇండియా ప్రభుత్వచట్టమునందుగల కొన్నిసూత్రములను (provisions) మనమిప్పుడు పరించవలసి యున్నది. కాని యీసూత్రములను మనము తీసుకొనేముందర, ఇతఃపూర్వము "వాణిజ్య హక్కుల సరిసమానత్వం" యేరీతినుండేదో కాస్త తెలుసు కుంటే, మనవిషయము సుగోచరము కాగలదు. ఈవిషయ మును స్పష్టముగా తెలుపుటకై శ్రీయుత గగనవిహారి యల్. మెహతా, యమ్.ఎ., 1931 ఏప్రిల్ "మోడర్న రెవ్యూ" సంచికయందు ప్రకటించినట్టియు, అప్పటినుండి పునర్ముద్రితమై కరపత్రరూపమున ప్రచారమునం దున్నట్టియు ఒక వ్యాసము నుండి కొంతభాగము నెత్తి యుదహరించుటకంటె అధికముగా యేమియును చేయనవసరములేదు.

"ఇప్పుడు బ్రిటిషువారు ఇండియా దేశమునందు తమకు ఇండియను లతో పాటు "వాణిజ్యహక్కులలో సరిసమానత్వం" కావాలని సాధి స్తున్నారు. ఏమిటా "ఈవాణిజ్యహక్కులలో సరిసమానత్వం" అని ఆలోచించిన యెడల, స్టాట్యూటరీ కమీషను ఇక్కడ ఉన్నదినములలో

వారువేసిన పొలికేకకు ఇది ప్రత్యుచ్చరణమనియు ఆపొలికేకయొక్క అంతిమ పరిణామమే ఇది అనియు తెలియగలదు కనుక అప్పటి పొలికేక యేమియో మనమెరుగవలెను "Safe guards against discriminatory legislation" అని అప్పుడు కేకవేసినారు. అనగా హిందూదేశీయుల చేతులలోనికి పరిపాలనాధికారము వెళ్లినప్పుడు, వారు, తమకు కావలసిన ఆర్థిక సౌకర్యములన్నెల్ల కల్పించుకొనుటకుగాను, విదేశీయులకు అనగా బ్రిటిషువాణిజ్య పరిశ్రమలవారికి ప్రతికూలములు కలిగించే శాసనము లేమీ చేయకుండా ఉండేటట్లు, ప్రభుత్వచట్టములోనే రక్షణలు కూర్చవలెనని ఆకేకయొక్క అర్థము. తేటతెలుగులో చెప్పవలెనన్న దీనినే "కేటాయింపులేకుండా చేయుట" లేక "పృథక్కరణమునుండి రక్షణ" మనవలెను.

కనుక ఈరక్షణసిద్ధాంతమును మనమెరుగవలెనంటే దానిపుట్టుపూర్వోత్తరములవద్దకు వెళితేనేకాని మనకాచరిత్ర అర్థముకాదు. పృథక్కరణమునకు వ్యతిరేకముగాను, దానినుండి శాసనసిద్ధమైన సంరక్షణ కనుకూలముగాను ఈఅపూర్వాందోళన మొట్టమొదట ఇండియను కోస్టల్ ట్రాఫిక్కు బిల్లు శాసనసభలో ప్రవేశపెట్టినసమయమున ప్రారంభమైనది. 1928 సంవత్సరములో ఇండియా, సిలోను దేశముల అసోసియేటెడు చాంబరు ఆఫ్ కామర్సు (సంయుక్త వణిక్సంఘము) ఒక పెద్దమెమోరండమును ప్రకటించిన సంగతిని మనము జ్ఞప్తికితెచ్చుకోవలెను ఇండియాలో ఉన్న బ్రిటిషువాణిజ్యసంస్థలవారికి ప్రతికూలముగా పృథక్కరణ శాసనములను హిందూదేశరాజకీయవాదులు ప్రవేశపెడతారేమో అని అది చాలాభయమును ప్రకటించినది. మరియును, జాతిభేదమును పురస్కరించుకొని అట్టి శాసనములను చేసేశక్తి భారతీయశాసనసభలకు లేకుండా చేయవలెనని వారు ఆ మెమోరండములోనే తొందరచేయుచు ప్రకటిం

చిరి. అటుతరువాత, రాజ్యాంగ సమస్యపై సమావేశమైన ఆల్ పార్టీసు యొక్క రిపోర్టు, — దీనినే నెహ్రూరిపోర్టు అంటారు. — ఈవిషయమై ఆలోచించి ఈరీతిని ప్రకటించినది:

‘ ఐరోపీయ వాణిజ్య విషయమై, పెద్దమొత్తములను హిందూదేశము నందు పెట్టుబడిపెట్టినవారు ఎందుకు భయపడవలెనో మాకు తెలియకున్నది. న్యాయశాస్త్ర సమ్మతమగురీతిని హిందూదేశములో వ్యవహారమును చేయు చున్న యేమానవ తరగతికిగాని ప్రతికూలముగా పృథక్కరణ రూపకమైన శాసనము లొనరింప ఒడగలవని ఊహించుటకైనను సాధ్యము కాదు ’’

“ ఈప్రశ్నయే, కొంచెము కాలము దాటిన తరువాత, లెజిస్లేటివు అసెంబ్లీలో చర్చింపబడినది ఇండియను కోష్టలు ట్రాఫీక్కుబిల్లును సెలెక్టు కమిటీకి పంపవలెనను ప్రతిపాదనము వచ్చినప్పుడు, అసోసియేటెడు చాంబరు అఫ్ కామర్సు యొక్క ప్రతినిధులు, కీ॥శే పండితమోతీలాలు నెహ్రూ మొదలైనవారు ఈవిషయమును పూర్తిగా చర్చించిరి.

“ ఈప్రశ్న తిరిగీ 1928 డిసెంబరులో అసోసియేటెడు చాంబర్సు సమావేశమునందు చర్చింపబడినది. కాని 1929 లో అసోసియేటెడు చాంబర్సువారు, స్టాట్యూటరీ కమిటీకొరకే అని యుద్దేశించి ఒకపెద్ద కమ్యూనికేషనువ్రాసి పంపించిరి. దీనిని పార్లమెంటు మెంబర్లకు, ఇంగ్లాండులోఉన్న వాణిజ్య సంస్థలవారికి, బాగా పంచిపెట్టినారు. ఈ కమ్యూనికేషనులో అసోసియేటెడు చాంబర్సువారు, తాముపూర్వము స్టాట్యూటరీ కమిటీవారియెదుట తొందర చేసినట్లువలెనే, పృథక్కరణా శాసనములనుండి సంరక్షణమును కోరుకొనిరి అట్టి పృథక్కరణ శాసనము నకుఉదాహరణముగా కోష్టలు రిజర్వేషను బిల్లును వారు పేర్కొనిరి. ఇది జరి గిన రెండుమాసములలోనే అనగా 1929 అక్టోబరులో ఇండియను చాంబరు

ఆఫ్ కామర్సు అండు ఇండస్ట్రీసుయొక్క ఫెడరేషనువారు దీనికి తగిన జబాబును ప్రకటించిరి. "హిందూదేశమునకు తన జాతీయఆర్థికవ్యవహార నీతిని తనకనుకూలమగు రీతిని సర్దుకొనేహక్కు నిరాకరింప బడినయెడల, స్వపరిపాలనమేలేదు. తన ఆర్థికాభివృద్ధికై, అవసరమైన యెడల, విజాతీయుల ఆర్థిక లాభములకు ప్రతికూల మగునట్టి పృథక్కరణ శాసనములను కూడా చేయవలసిన హక్కు ఈ ఆర్థిక వ్యవహార నీతియందిమిడియే యుండవలె" నని ఆ ఫెడరేషను స్పష్టముగా చెప్పినది. చట్టసిద్ధమైన సంరక్షణల కొరకై ఈ ఆందోళనము అటుతరువాతకూడా సాగుచునే యుండెను. 1930 జూలైలో, అసోసియేటెడు చాంబర్సువారు పృథక్కరణ శాసనములమీద మరియొక సర్క్యులరును ప్రకటించిరి. కాని, పృథక్కరణశాసనముల నాటంక పరచు సూత్రమును రాజ్యాంగ విధానమునందు నిర్ణయింప బూనుకొను ఆలోచన శాస్త్రీయము కాదనిచెప్పి స్టాట్యూటరీ కమిటీ దానిని స్పష్టముగా త్రోసివేసినది (2 వాల్యూము 129_30 పుటలు చూడుము.)

"గతసంవత్సరం (1930), రౌండుటేబిలు కాన్ఫరెన్సు జరిగి నప్పుడు, ఐరోపియ జాతులు తమ డిమాండుకు (హక్కుగా కోరే కోరికకు) కొంచెము మారురూపమును కలిపించిరి. హిందూదేశమునందు వాణిజ్యము చేయు "ఐరోపీయ ఇండియను జాతులవారిమధ్య ఒక పరస్పరాంగీకార భావముండవలెననిన్నీ, ఇద్దరిని వర్తకవిషయములలో సరిసమానమైన అంతస్తునందుంచేటట్లు నమ్మకము కలిగించవలెననిన్నీ, వారు సూచనచేసిరి. అనధికార వర్గమునకు చెందిన ఐరోపీయ ప్రతినిధులును కన్సర్వేటివు లిబరలు పక్షముల ప్రతినిధులును, ఇండియాకు కేంద్ర ప్రభుత్వమునందు బాధ్యతను ఒప్పచెప్పే ముందర, దీనినొక షరతుగా చేయవలెనని రౌండుటేబిలు సభలో నిర్బంధింప మొదలుపెట్టిరి. స్టాట్యూటరీ కమీషను రిపోర్టుమీద

ఇండియా ప్రభుత్వమువారు ప్రచురించిన శ్రీముఖము(dispatch) యందు ఈ విషయమును తిరిగియెత్తుకొని, పృథక్కరణ శాసనములనుండి సంరక్షణ మేర్పరచవలె ననెడి హక్కును బలపరచినారు.

"గతసంవత్సరం (1931) జనవరిలో, రౌండుటేబిలు కాన్ఫరెన్సు యొక్క మైనారిటీ సబ్‌కమిటీ 14 వ క్లాజును చేర్చిరి దీని ప్రకారము బ్రిటిషు వాణిజ్య తరగతుల హక్కులకును, హిందూదేశములో పుట్టిన ప్రజల (subjects) హక్కులకును మధ్య నెట్టిపృథక్కరణమును ఉంచరాదనియు, ఇందుకొరకై ఒక ఒడంబడిక (convention)ను వ్రాయించవలెననియు ఈసబ్‌కమిటీ ప్రతినిధులు అంగీకరించినారు ఈఒడంబడికను గురించి వార్తాపత్రికలలోను ఉపన్యాసవేదికలపైనను జరిగిన వాదోపవాదము లన్నియు మన చెవులలో ఇంకను మారుమ్రోగుచున్నవి కనుక వానిని గూర్చిన వివరముల నిక్కడ ఉదహరించనక్కరలేదు.

"ఇప్పుడు, ఈడిమాండు యొక్క సరియైన భావమేమిటి? పృథక్కరణ శాసనములను చేయకుండా ఉండేటట్లు చట్టములోనే కొన్ని రక్షణలు లేక పూచీకత్తుల నీయవలెనని ఐరోపీయ వాణిజ్య సంఘముల వారు హక్కుగా కోరుచున్నారు. కోష్టలు రిజర్వేషను బిల్లును ఉదహరించినప్పుడు తప్ప ఈఐరోపీయజాతులు "పృథక్కరణశాసనములు" "ఆర్థికపృథక్కరణము" అను పదముల భావమును నిరూపించుటకెట్టి ప్రయత్నమును చేయకుండుటయు, వారికి కావలసిన రక్షణల స్వభావమెట్టిదో స్పష్టముగా తెలుపకుండుటయు చాలా వింతయైన విషయము. ఈరక్షణపదమునకేరీతి యర్థమును నిరూపించవలెనో, దానిఫలితము లేరీతిని పరిణమించగలవో మనకు స్పష్టముకానిదే మనమేమిచెప్పుటకును వీలులేదు. పూర్తిగా ఐరోపీయ సభ్యులతో కూడుకొన్నట్టియు, సహజముగా ఐరోపీయ వాణిజ్యలాభముల పట్లనే అభిమానమును చూపించవలసినట్టియు

స్టాట్యూటరీ కమిటీవారే, భారతీయేతరుల లాభములను రక్షణలుగూర్చే వాక్యములను ఇండియా చట్టమువంటి రాజ్యాంగవిధానములో యెట్లు ఇమిడించవచ్చునో ఊహించలేక తల్లడిల్లిపోయినారు. పన్నులు, వాణిజ్యము వ్యాపారము మొదలైన విషయములలో కొన్ని ప్రత్యేకతరగతులకు ప్రతి కూలముగా పృథక్కరణశాసనములను ఇండియాప్రభుత్వము చేయకుండా రక్షణలు కూర్చుటకై యిరోపీయ వాణిజ్యసంఘములవారు దాఖలుచేసిన చిత్తువాక్యములను ఆకమిటీవారు చాలా జాగ్రత్తగా పరీక్షించిరి. ఇటు వంటి మార్గములగుండా రక్షణలుకూర్చుట సాధ్యముకాదని వారా చిత్తు క్లాజులను తిరస్కరించిరి. ఇటువంటి రక్షణవాక్యములను ఒకవేళ చేర్చినా, ఏదోయొక్క తరగతి జనులకును వర్తకవాణిజ్య విషయములకును మాత్రమే వానిని సంకుచితపరచి యుంచుటకు వీలులేదు. "ఒకవేళ ఇట్టి చట్టరక్షణ వాక్యములను చట్టములో చేర్చినను, అవి చాలా జనరలు (విశాలము) గాను ఇదమిద్ధమని నిరూపింపసాధ్యముగాని సూత్రప్రాయము (abstract principle) గాను ఉండవలెనేగాని కోర్టులకెక్కి సాధించుకొనతగినంత న్యాయసిద్ధముగా ఉండరాదని వారు తీర్మానించిరి.

"1930 లో జరిగిన మొదటి లండనుకాన్ఫరెన్సుయొక్క 3 నెం బరు సబ్‌కమిటీ (మైనారిటీలు లేక అల్పసంఖ్యాకులు) వారిచే అంగీకరింప బడినట్టియు, కాన్ఫరెన్సు అంతటియొక్క కమిటీచే స్వీకరింపబడినట్టియు ఒడంబడిక వాక్యములయొక్క కట్టకడపటి నమూనా (ఫైనలుడ్రాఫ్టు) ఈరీతిగనున్నది. ఒక్క జిన్నామాత్రమే దీనికంగీకరింపకుండుట గమనింప తగినవిషయము:—

"బ్రిటిషువాణిజ్యజాతుల కోరికపైని, హిందూదేశములో వాణి జ్యముచేయుచున్న బ్రిటిషువాణిజ్యతరగతులు ఫర్మిలు కంపెనీలహక్కు లకును హిందూదేశములోపుట్టిన ప్రజలహక్కులకును మధ్య నెట్టి పృథక్క

రణమును ఉండరాదని ఒక సూత్రము విశాలభావముతో అంగీకరింపబడి నది. ఈహక్కులకు సరియైనమార్గము నేర్పరచుటకై వీరిద్దరి పరస్పరసం బంధము లెట్లుండవలెనో నిరూపించుటకై, ఉచితమైన ఒడంబడిక యొకటి జరిపించవలెనని అంగీకరింపబడినది.

'క్రిమినలు నేరములను ఐరోపీయులు జరిపినప్పుడువారిని దండించు విధానమునందిప్పుడున్న ప్రత్యేకసౌకర్యముల హక్కులను ఇప్పటివలెనే యుంచవలెనని అంగీకరింపబడినది.'

"ఇప్పుడు ఈ అగ్రిమెంటు లేక అంగీకారముయొక్క గూఢార్థ మును పరీక్షింతము మొట్టమొదటిలో, వాణిజ్యహక్కులవిషయమున మాత్రమే అయోగ్యమైన లేక అశాస్త్రీయమైన పృథక్కరణమే కాక సకలవిధములైన పృథక్కరణములును త్రోసివేయబడినవి. జ్యూరీవిచార ణలో, ఇతరసౌకర్యములలో, జెయిళ్లలో, రెయిల్వేలలో హిందూదేశీయు లకు ప్రతికూలముగా జరుగుచున్న పృథక్కరణము లిప్పటివలె సాగుచుండ వలసినదే. ఇటువంటి రక్షణలను వర్తకవాణిజ్యవిషయములకు మాత్రమే నిబంధించుటగాని, ఒక్క ఐరోపీయులకు మాత్రమే ప్రసాదించుటగాని యుక్తమైన కార్యములుకావు. హిందూదేశపు లాభముల (interests) కు ప్రాధాన్యమును స్థిరపరచుట (establishing the paramountcy) కైనను, ఇట్టి కార్యము జాతీయాభివృద్ధి కత్యంతావశ్యకమై యుండినప్పు డైనను ఇట్టి పృథక్కరణమున కనుమతియొసగబడకుండుట రెండవవిష యము. ఏదైనా ప్రభుత్వపు రెయిల్వేకంపెనీ యొకటి తనకుకావలసిన బొగ్గును ఇండియను బొగ్గుగనులవారివద్దనే కొనుక్కొన్న యెడల అది పృథక్కరణమా ? స్టోర్సు డిపార్టుమెంటువారు, తమకు కొంతనష్టము వచ్చినను సరే, స్వదేశవస్తువులను కొనుక్కొనుటలో ఆధిక్యతచూపిన

యెడల, అది పృథక్కరణము క్రిందకే వచ్చునా? ప్రజాహితకార్యముల నొనరించు ఒక కంపెనీని ఐరోపీయ స్వంతదారులనుండి కొనేసుకొనుట ఒక రాష్ట్రీయ ప్రభుత్వమునకు ఇష్టమై, ఇండియను స్వంతదారులక్రింద నట్టిదే మరియొక కంపెనీయుండుట కభ్యంతరములేనియెడల, దానిని పృథక్కరణముక్రిందనే భావించవచ్చునా? జాతీయసౌభాగ్యమున కత్యావశ్యకమని తలచినప్పుడు భారతీయేతరమైన ఎక్సుఛేంజి బ్యాంకులు భీమాకంపెనీలమీద తగినన్ని నిబంధనలను, రాబోవు ఈ అగ్రిమెంటు ఉంటూవుండగా, భారతీయ ప్రభుత్వము ప్రయోగింపగలదా? గనులు, తోటలు అడవులు మొదలగువానిపై ప్రస్తుతము భారతీయేతర కంపెనీలకున్న లైసెన్సులను రద్దుచేయుటకు లేదా అట్టిలైసెన్సులకు పునః అంగీకారము నీయకుండుటకు (refuse to renew) భారతీయ ప్రభుత్వమునకు సాధ్యమగునా? అట్టిలైసెన్సులు భారతీయేతరులకుండుటవలన భారతీయ సౌభాగ్యము క్షీణించుచున్నను అనుభవించవలసినదేనా?

ఇటువంటి నిర్బంధములు చేసినయెడల ఇండియాలో నివసించుచున్న భారతీయేతరుల ప్రస్తుతపు హక్కులకు భంగము కలుగుననియు, వారి భవిష్యత్తు హక్కులకు కూడా ప్రతిబంధము కలుగుననియు ఊహించుట సులభసాధ్యమే. అయినను భారతీయ సౌభాగ్యముకొరకు అట్టిచర్యల నవలంబించవలసి వచ్చినప్పుడు, వానిని విధించకుండుటకై తగిన కారణమేదియును లేదు. ఏలననగా పృథక్కరణ శబ్దమునకు మనము నిరూపించగల అర్థము, హక్కు అను శబ్దమునకు మనమీయగల వ్యాఖ్యానముపై ఆధారపడియున్నది. ఒక ఉదాహరణమును చూతము. కొన్ని వర్తక పారిశ్రామిక గోళములపై బ్రిటిషువారే సర్వాధికారములు (monopoly) అనుభవించుచు భారతీయులను అందు ప్రవేశింపనీయకుండా అధికారము చలా

యించుటకై హక్కు ఉన్నదా? లేదా భరతఖండములో భారతీయ పరిశ్రమలను వర్ధిల్లకుండా నాశనము చేయుటకై హక్కు ఉన్నదా?

పూర్వముననో ప్రస్తుతముననో భారతీయులకు ప్రతికూలముగా బ్రిటిషువారు విధించిన పృథక్కరణమునకు ఫలితముగా వారికిప్పుడీ సౌకర్యము లుండవలసినదేయని భావించి దానిని నీతిశాస్త్ర ప్రకారము సమర్థింతమే అనుకొందము, కాని భారతీయులతో మేమును సమానులమే అన్న కారణమున నీ సౌకర్యములను వారు అనుభవింపగోరుచున్నారని, క్రిమినలు నేరవిచారణలలో వారికి ప్రత్యేక సౌకర్యములను డిమాండు చేయగల న్యాయశాస్త్రకారణమేమి? ఒక సందర్భమున నీవు భారతీయులతో తుల్యుడవును, వేరొక విషయమున ఉత్తమజాతివానివలె సౌకర్యము లనుభవించవలసిన యోగ్యుడవును కానేరవు. ఇదికాక, ఈతగాదా అంతా బ్రిటిషువారికుండే ప్రస్తుతహక్కుల శాశ్వత సంరక్షణకొరకు మాత్రమే కాదు. ఈవిషయమును గూర్చి రీడింగుప్రభువును, సర్. హ్యూబర్టుకార్ న్ను స్పష్టముగా అభిప్రాయములను ప్రకటించినారు. ఈక్లాజును చట్టములో చేర్చేషరతుపైనే కేంద్రప్రభుత్వమునందలి బాధ్యత భారతీయులకు మార్చబడునని రీడింగుప్రభువు చెప్పినాడు బ్రిటిషువారి వాణిజ్యహక్కులను గూర్చి సంప్రతించి తగ్గించుటకు భారతీయులకు వీలులేదని రెండవయాతను నిర్మొగమాటముగా చాటినాడు. అయినను భారతీయులు తమ ఆర్థిక స్వాతంత్ర్యమునకు సంబంధించిన కొన్ని ప్రధాన విషయములను అమ్ముకొని, దానికంటె తక్కువైన రాజ్యాంగ సౌకర్యములను బేరమాడుకొనుటకై అంగీకరించినారు. కొన్ని మూలపరిశ్రమల (key-industries) పట్ల ఇండియా ప్రభుత్వమునకు పృథక్కరణాధికార ముండవలెనని కొందరు భారతీయ ప్రతినిధులు డిమాండుచేసినను, దానిని లక్ష్యముచేయలేదు, చివరకు అంగీకరింపబడిన క్లాజులో ఇట్టి అవకాశము లేమీ లేకుండా

తుడిచివేయబడినవి. మూలపరిశ్రమ యను శబ్దముయొక్క అర్థము నిర్వచింప బడనియెడల అట్టి సంకుచితాధికారము మనకున్నను లాభములేక పోయె డిది. ఈపరిశ్రమనా, ఆపరిశ్రమనా, ఈప్రయత్నమునా, ఆప్రయత్నమునా మనము రక్షింపవలెననునది కాదు మన ప్రధానసమస్య. భారతదేశ శాసన సభలు తమ కవశ్యమై వాంఛనీయమైన వ్యవహారనీతి ననుసరించవలెనను ప్రకృతి సిద్ధమైన హక్కునకు చట్టములోనే ప్రతిబంధకములు కలిగించుట ఆక్షేపణీయమనియే మన ప్రధానవాదము.

"ఇంక రెండవ విషయమును చూతము. హిందూదేశములో రిజస్టరయిన కంపెనీలకు మాత్రమే ఇట్టి సౌకర్యములను కూర్చ నూహించుటతో వీరు తృప్తినొంది యూరకొనలేదు. ఒక కంపెనీ హిందూదేశములో రిజస్టరు అయినా కాకపోయినా, అది ఒక ఇంగ్లాండులోనో లేక దక్షిణాఫ్రికా లోనో రిజస్టరయినా, బ్రిటిషు సామ్రాజ్యమునకు వెలుపలను ఆఫర్మ స్థాపితమైనా సరే, అది హిందూదేశములో వాణిజ్యము చేస్తూవుంటే చాలును, దానిమీద పృథక్కరణము చేయుట సాధ్యముకాదు. 821 కంపెనీలు, 568,068,672 పౌను పెయిడప్ క్యాపిటలు (చెల్లించబడిన మూలధనము) గలవి, హిందూదేశము లేక ఇతరదేశములందు రిజస్టరు అయి హిందూదేశ ములో పనిచేయుచున్నవి. కాని విరాళములు ఇతర ఆర్థిక సౌకర్యములు మొదలగు ప్రభుత్వసహాయముల (state aids)ను ఇచ్చే సందర్భములలో ఇదివరకే ఇండియా ప్రభుత్వమువారు పృథక్కరణ సిద్ధాంతముయొక్క ధర్మము నంగీకరించి, అట్టి సహాయమును చేసిన కంపెనీలన్నిటి మీదను, భారతీయుల హితమునకై, కొన్ని విశిష్టనిర్దిష్ట నిబంధనలను విధించుచునే యుండిరి. ఉదాహరణము 1924 స్టీలు ఇండస్ట్రీ ప్రొటెక్షను ఆక్టు 5 వ సెక్షను ఇంకార్పరేటు చేయబడిన కంపెనీలన్నియు 1913 సం. ర. ఇండి

యను కంపెనీసు ఆక్టు క్రింద రూపాయి పెట్టుబడి (rupee capital) తో రిజష్టరు చేయబడి యుండవలెననియు, డైరక్టర్లలో సగమైన సంఖ్యవారు భారతీయులై యుండవలెననియు, పనినేర్చుకొనేవారి (apprentices) కి యంత్ర పరిజ్ఞాన శిక్షణము (technical training) నిచ్చుటకు వలయు సౌకర్యములను కూర్చవలెననియు విధించుచున్నది. ఇట్లే, ఇండియను రేడియో టెలిగ్రాఫు కంపెనీకి ప్రభుత్వపు లైసెన్సు కావలసినప్పుడు, ఆకంపెనీకి క్రొత్తగా చేరే మూలధనములో 60% భారతీయులకై అట్టే పెట్టబడవలెనని ప్రభుత్వమొక నిబంధన మేర్పరచినది. విమాన సంస్థలకు సబ్సిడీల (విరాళముల) నిచ్చేసందర్భమున కూడ, షేరుకేపిటలులోను, డైరెక్టర్ల సంఖ్యలోను అధికభాగము భారతీయులదై యుండవలెనని ఒక సూత్రమును ప్రభుత్వమువారు అంగీకరించినారు. ఇండియనుల లాభములను రక్షించుటకై ఇటువంటి నిబంధనలనే విధించవలెనను సూత్రమును ఎక్సు టెర్నలు క్యాపిటలు కమిటీవారే అంగీకరించినారు. రౌండుటేబిలు అగ్రి మెంటు షరతులక్రింద ఇటువంటి నిబంధనలను రక్షణలను పృథక్కరణ ముగా భావించి త్రోసివేయవచ్చునని ఊహింప సాధ్యము. కనుక ఈ అగ్రి మెంటుద్వారా మనలను చాలావరకు వెనుకకు నెట్టివేసినారని చెప్పవచ్చును.

ఇంక మూడవవిషయమునకు వత్తము. రక్షణవిధానములు (protective measures) అన్నియు పృథక్కరణభేదములే ఏలననగా అవి యన్నియు విభేదసిద్ధాంతము (differenciation) పైనే ఆధారపడియు న్నవి. టారిఫులు విరాళముల ద్వారా జరిపినను, ప్రత్యేకశాసనచర్యల ద్వారా జరిపినను పృథక్కరణము పృథక్కరణమే. అయినను, టారిఫులు మొదలైన వానిద్వారా జరిగే పృథక్కరణము న్యాయమైనదే కాని, ఈ దేశములో పాతుకొనిన భారతీయేతర పరిశ్రమలకు ప్రతికూలముగా చేసే పృథక్కరణము ఘోరమైనదని వాదించుచున్నారు. కాని ఈ సమస్యను

గూర్చి ఆలోచించునప్పుడు అనేకవిషయములను నొక్కి చెప్పవలసియు న్నది. భారతీయపరిశ్రమలను పృథక్కరణ మొనరించి భారతీయులను నష్ట పరచు చర్యలు సాధనముల మూలముననే అవి యెట్లు ఈ దేశములో పాతుకొని పోయినవో ఆ చర్యలను మనము పరిశోధించవలెను. అట్టి చర్యలు సాధనముల మూలమున పాతుకొనిపోయి అనుభవించబడుచున్న లాభములను శాశ్వతము చేసుకొనుటకై వారు ప్రతిపాదించుచున్న హక్కుల సిద్ధాంత మెంతదుర్బలమైనదో ఆ మూలముగా మనకు తెలియ గలదు భారతీయేతరులు స్వాధీనపరచుకొని వ్యవహరించుకొనుచున్న ఈపరి శ్రమలు ఇంతవరకు పాతుకొనిపోయి యుండుట కెల్లయు ప్రధానకార ణము బ్రిటనుకు ఈ దేశమునందు గల రాజకీయాధికార నిరంకుశత్వము వల్లనే కలిగినదనుటకు సందేహములేదు. నూనె, జనుపనార, బొగ్గు, పడ వలు, బ్యాంకింగు, భీమా మొదలు గాగల యెన్నో వ్యాపారములలో భార తీయేతరులకు దేశప్రభుత్వము పక్షపాతబుద్ధితో చూపించిన అక్రమసౌక ర్యముల మూలముననే అవి దేశీయపరిశ్రమల నడుగునకు త్రొక్కగలిగినవి. జండాచుట్టు వాణిజ్యము మూగుకొను వచ్చునన్న సిద్ధాంతము మన మంద రమును ఎఱిగినదే, శాంతియుతముగా వచ్చేవర్తకులు రాజ్యాధికారముల నెట్లు చేపట్టగలుగుచున్నారో, రాజకీయాధికారసూచకమైన జండాను చేపట్టినవారు తమకు కావలసిన ఆర్థికసౌకర్యముల నన్నిటిని అట్లే బిగపట్టు కొనగలుగుచున్నారు. కనుక, ఈ పరిశ్రమలవారికి హిందూదేశపు నాలుగు కోణముల మధ్యను ఇట్టి శాశ్వతస్వరూపము సిద్ధించుట ప్రకృతిసిద్ధము కాక కేవలము కాలకర్మవశమై యున్నది, ఏలననగా, నూనె పరిశ్రమా విధానమువల్ల స్పష్టమగుచున్నట్లు, వారు ఈ దేశమునకు సర్వవిధములను విదే శీయులే.

ఇంతకూ, ఈ విషయమున మనము రక్షణసిద్ధాంతము యొక్క ముఖ్యోద్దేశమును పరీక్షింపవలెను. దిగుమతి సుంకములను జాతీయ పరిశ్రమా సంరక్షణముకోసమే విధించవలసి వచ్చినప్పుడు, ఒకప్పటి టారిఫ్ లేక దిగుమతి సుంకములిచ్చిన అవకాశమువల్లనే ఇక్కడకు దూరి పాతుకొనిపోయి నేటికిని దేశీయపరిశ్రమ లణగ ద్రొక్కగలు గుచున్న విదేశీపరిశ్రమల వారి బారినుండి వానిని రక్షించుట దేశీయప్రభుత్వముయొక్క ప్రధానకర్తవ్యము గాదా? ఈ విషయమున, ఇండియాప్రభుత్వపు కామర్సుమెంబరు సర్ విలియమ్ క్లార్కుయొక్క అభిప్రాయమును మనము గమనించిన నెంతో ముచ్చటగా ఉండును. ఇండష్ట్రియలు కమిషను స్థాపనకుమార్గదర్శకమైన తీర్మానమునుమీద అతను 1916 లో ప్రసంగించుచు "పెట్టుబడి (capital) స్వాధీనము (control) వ్యవహారము (management) అన్నియు భారతీయహస్తము లందుండు నటువంటి పరిశ్రమావిధానమును నిర్మించుటయే మన అందరిదృష్టిలో నున్న ప్రధానాశయము" అని ఆయన చెప్పెను. "ఇదివరకు దూరమున నుండి నీతో పోటీ సలుపుచుండిన పారిశ్రామికుడు ఇప్పుడు నీయింటి లోనే దూరి నీ సరిహద్దులమధ్యకే తనకార్యమును మార్చి నీతో పోటీచే చేయుటకై" అవకాశము కలిగించే చర్యలను ఆయన హేయములని తిరస్కరించెను.

"దిగుమతిసుంకములను విధించు అధికారమును చట్టముద్వారా నీకిచ్చినంతమాత్రమున నీకు ఆర్థికస్వపరిపాలనము నిచ్చినట్లు అర్థముకాదు. అట్టి అధికారము ఆర్థికస్వపరిపాలనము నందలి ఒక స్వల్పభాగము మాత్రమే. ఆర్థికస్వపరిపాలనమంటే, నీజాతీయపరిశ్రమల నభివృద్ధిచేయుటకై, నీవాణిజ్యపరిశ్రమలను సరియైన మార్గముల నడిపించుకొనుటకై,

సుంకములను రవాణా సౌకర్యములను జాతీయానుకూలముగా యేర్పాటు చేసుకొనుటకై, కావలసినశాసనములను చేసుకొనుటకును, విధించవలసిన పన్నులను విధించుకొనుటకును నీకు అధికార మొసగఒడినప్పుడే అది ఆర్థికస్వపరిపాలన మనిపించుకొనును. భారతీయులచేతను భారతీయేతరుల చేతను నడిపించఒడుచుండు పరిశ్రమలపై భిన్నభిన్నములగు పన్నులను విధించుట, తీరము నందున్నట్టియు దేశాంతర్గతమైనట్టియు జలమార్గములను భారతీయుల ప్రయోజనముకొరకే ప్రత్యేకించి బలతరముగా కాపాడుట, బ్యాంకింగు భీమా మొదలుగాగల కొన్ని ఆర్థికగోశములనుండి భారతీయేతరులను నిషేధించియుంచుట, ఇవన్నియు ఆర్థికస్వపరిపాలనములో చేరినవే. (రౌండుటేబిలు) గుండ్రబల్ల ఒడంబడికవల్ల మనమట్టి ఆర్థికస్వపరిపాలననుండి దూరముగా తేసుమఒడినాము.

“ఇందువల్ల మనకుకలుగు అపాయములు యెప్పుడో మనకు రావచ్చునని అకారణముగా బెదగుచుండునట్టివి కావు. మనకు క్రొత్తగా కలిగిన అనుభవములవల్ల పెద్దటారిఫులను విధించినంత మాత్రముననే మనకు కావలసిన రక్షణము సమకూరలేదని మనము గ్రహించినాము. విదేశీ మూలధనము ఈదేశములో పీటపెట్టుకొని కూర్చొని భారతీయస్వంతదార్ల పరిశ్రమలన్నిటితో అన్యాయమార్గముల ద్వారా పోటీచేయుచున్నది. అగ్గిపెట్టెల పరిశ్రమ దీనికొక ఉదాహరణము. లంకాషైరువారు ఈదేశములో తమ ప్రత్తిమిల్లులను నెలకొల్పవలెనని సంకల్పించుకొనుచున్నారు గనుక, ఇటువంటిసందర్భములలో జాతీయ పరిశ్రమలకు రక్షణమును కూర్చుకొనే అధికారము భారతప్రభుత్వమువారి కుండవలెను. విదేశీయ ఆర్థికపరాధీనతా శృంఖలములతో కట్టబడి భారతదేశము నేలకూలియున్న యెడల, హిందూదేశములో జాతీయపరిశ్రమల నభివృద్ధిపరచుట సాధ్యమే కాదు.”

ఇటువంటి వాదములకు కొందరు భారతీయ ప్రతినిధు లిచ్చిన జవాబులను రెండింటిని మనమిక్కడ సంగ్రహముగా విచారించవలెను. వీరు ఆయొడంబడిక క్లాజునందుగల "విశాలభావముతో" (Generally) అను పదముమీద నొక్కి వక్కాణించుచు ఇట్టి పృధక్కరణము బ్రిటిషువాణిజ్య మంతటిమీదను మొత్తము (whole sale) గా జరుగకుండా నిషేధించుటకు మాత్రమే ఊహించబడినదని వాదించిరి. కాని మన ప్రశ్నయెల్లయు ఈపృధక్కరణ మెంతమేరవరకు జరిగించకూడదా యనికాదు, పృధక్కరణమును జరిగించుటకు మనకు సంపూర్ణమైన హక్కు ఉన్నదాలేదా యని మాత్రమే. కొన్ని విషయములలో పృధక్కరణము చేయుట మనకు అనవసరమును నష్టకరమును కూడా కావచ్చును. కాని ఈకారణము వల్ల హిందూదేశపు శాసనసభల కిట్టి పృధక్కరణాధికారము లేకుండాచేసి ముందరికాళ్లకు బందములువేయుటకు వీలులేదు. వీరి రెండవవాద మేమనగా, విశాలమైన సూత్రప్రాయముగా మాత్రమే ఈక్లాజు ఉన్నది గనుక, పరస్పరసమాన లాభదాయకమగు రీతిని వివరములనన్నిటిని వ్రాసుకొని మరియొక ఒడంబడిక చేసుకొనవచ్చునని ఈవిషయమునందుగల ప్రధాన సూత్రమును లేక హక్కును గోలుపోయిన తరువాత ఆంగ్ల భారతదేశముదిమధ్య వాణిజ్యసంబంధములను మనకు లాభదాయకమగురీతిని యేర్పాటుచేసుకొనే ప్రయత్నములెల్లయు వ్యర్థమగును. బ్రిటిషువాణిజ్యమునకు కావలసిన సౌకర్యముల

కొరకై భారతీయ ప్రభుత్వము యొక్క అధికారమునే ముందు సంకుచితపరచితిమి గనుక, ఈసంకుచితాధికారముతో మన మేమియును చేయజాలము. బ్రిటనుకు ఇండియాకు కూడా యేది పరస్పరసమాన లాభదాయకముగా ఉండునో నిర్ణయించుట దుస్సాధ్యము. ఏలననగా బ్రిటనులో ఉండే భారతీయులు అరడజనుమంది ఉంటారు, ఇండియాలో బ్రిటిషు వారు లక్షలకొలది ఉన్నారు. మొదటి ఆరుగురి నిమిత్తమును కొన్ని స్వల్పలాభములు కలుగుటకై, ఇక్కడనున్న బ్రిటిషు వారికి మనమనేక లాభములను కూర్చవలెను. బ్రిటను ఇండియాలో తన పరిశ్రమల నన్నిటిని ఇప్పటికే బాగుగా పాదుకొల్పినది. ఇదివరకే అది పారిశ్రామికముగ మిక్కిలి అభివృద్ధిపొందిన దేశము కనుక ఇంకను అతిసులభముగా ఇండియాలో తన పరిశ్రమల నది పాదుకొల్పగలదు. ఇంగ్లాండులో అట్టి పరిశ్రమలను ఇండియాదేశము పాదుకొల్పగలదని ఊహించుట కేవలము పరిహాసమునకు మాత్రమే చెప్పబడిన వాక్యము. ఇది పైకి చూచేటందుకే న్యాయమగు రీతిని కనిపించవచ్చును కాని హిందూదేశపు ఐశ్వర్యమును శాశ్వతముగా దోచుకొనుచుండుటకై బ్రిటను పన్నిన మాయావాగురు తప్ప ఇందు అంతకన్న నేమియు విశేషము లేదు.

"జాతీయ విజాతీయ పరిశ్రమల మధ్య పృథక్కరణ మొనరించు హక్కు ప్రతీదేశమునకును ఉన్నది. కొన్ని దేశీయ పరిశ్రమలను కేవలము దేశీయులకొరకే ప్రత్యేకించుకొను హక్కుకూడా వాటికిఉన్నది. కొన్ని

హక్కులను సౌకర్యములను తాముమాత్రమే అనుభవించుచు, అనేక కారణములవల్ల వానిని విదేశీయులకు ఇవ్వకుండా ఉండడము ప్రతీదేశములోను సర్వసాధారణమైన సంప్రదాయమైయున్నది.

“ఉదాహరణములకు కొదవలేదు అమెరికాసంయుక్తరాష్ట్రముల వారు ఒక శతాబ్దమునకు మించి కాలమెల్లయు తమ కోస్తా వాణిజ్యమంతటిని తమదేశపు పౌరుల పడవలకొరకు మాత్రమే ప్రత్యేకించి యుంచుకొనిరి. అమెరికా సంయుక్తరాష్ట్రములన్నియు ఒకే జాతీయప్రభుత్వము నందుంటున్నను, ఈ రాష్ట్రములన్నింటికి మధ్యను జాతీయవాణిజ్యపోషకమైన ఆదరణము నిచ్చుటకు ఖరాఖండీషరతులుంటున్నను, ఆ షరతులు ఈ జాతీయవాణిజ్యమునకు మొత్తముమీద సంబంధించినవై తగినంత విశాలమైయుంటున్నను, ఆయారాష్ట్రముల కోస్తావ్యాపారముల పట్ల మాత్రము ఈ సూత్రమునుండి మినహాయింపు చేయబడినవి. ఈ కోస్తావ్యాపార మొక్కటియే కాదు ఆయారాష్ట్రములకు సంబంధించిన భూములు, అందులోనూ వ్యవసాయభూములు, చేపలుపట్టుకొను వ్యాపారము, మరికొన్ని వృత్తులు, వర్తకములు వీనిపట్ల ఒకప్రక్క విశాలమైన జాతీయాదరణము నిచ్చుచునే, వాని వాని మధ్య చేసుకొనిన వేరే వేరే ఒడంబడికలలో వివిధరాష్ట్రముల కనుకూలములైన పృథక్కరణములు కూడా చేసుకొనబడినవి. ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీ, డెన్మార్కు, చైలీ, రుమేనియాదేశములు విదేశీఫర్మ్లమీదను వ్యాపారములమీదను కొన్ని నిర్దిష్టమైన నిబంధనల నేర్పరచి అందుకు తగిన సూత్రముల (rules)ను వ్రాసుకొన్నవి. “రుమేనియాదేశములో వ్యాపారము చేయలేక వస్తువులను తయారుచేయు కంపెనీలలో $\frac{2}{3}$ పెట్టుబడియు $\frac{3}{4}$ వంతు డైరక్టర్లు రుమేనియా జాతీయులైయుండవలెనని” ఒక శాసనముచేయబడినది రుమేనియా శాసనముల

ఆదర్శమెల్లయు ఆ దేశమునందలి పరిశ్రమలన్నిటినీ రూమేనియనైజు చేయుటయే అను సూత్రము ననుసరించియే ఈ పనులెల్లయు జరుపబడినవి. చీనా, గ్రీసు, చైలీదేశములలో విదేశస్థులకు తమదేశములందలి గనుల విషయమై యెట్టి మొగమాటముల (concessions) ను చూపరాదని శాసనములు ప్యాసుచేయబడినవి 1923 లో ఫ్రాన్సుదేశములో విదేశీయు లెవ్వరును ఆస్తులను కలిగియుండరాదని ఒక శాసనము చేయబడినది బ్రిటిషు సామ్రాజ్యములో కూడా, స్వేచ్ఛావాణిజ్య (free trade) సూత్రము ననుసరించు ఇంగ్లాండుదేశమే విదేశీయుని కెవ్వనికిని బ్రిటిషునౌక యందు పూర్తిగా కాని కొంచెముగా నైనా కాని స్వంతదారీహక్కు ఉండనట్లు 1894 సం॥ మర్చెంటు షిప్పింగుఆక్టువల్ల నిషేధించినది. బ్రిటనులో పుట్టినట్టియు బ్రిటిషుపౌర స్వత్వపుహక్కులను సంపాదించినట్టియు వారికిమాత్రమే బ్రిటిషునౌకలలో కొన్ని ప్రత్యేకహక్కులను ఉంచుటయే ఈ శాసనముయొక్క ముఖ్యోద్దేశము. బ్రిటిషు కొలంబియాలో రెయిల్వేలు నిర్మించుట లేక పనిచేయుట, బ్యాంకింగు భీమా ట్రష్టువ్యవహారములు చేయుట ఈ మొదలైన పనులను చేయనుద్దేశించిన విజాతీయకంపెనీలను రిజష్టరు చేయరాదని ట్రష్టుకంపెనీసు ఆక్టు నిషేధించుచున్నది.

ఆస్ట్రేలియాదేశపు వార్ప్రికాపన్సురిపేలు ఆక్టు (1921) 8 వ సెక్షను ప్రకారము యే కంపెనీలో నైనను విదేశీయులకు $\frac{1}{3}$ కంటె యెక్కువషేరులున్న యెడల అది ఆ దేశపుగనులలో పనిచేయరాదు, వడ్డీలను తీయరాదు, లోహపు పనులేమియు చేయరాదు. ఆ ఆక్టుయొక్క 2 వ సెక్షను ప్రకారము, ట్రెజరరు (కోశాధికారి) యిష్టములేనిదే యే విదేశీయునకును షేరులను సంపాదించుకొనుటకు హక్కులేదు బ్రిటిషు కామనువెల్తులోనే పృథక్కరణసిద్ధాంతమున కనేక ఉదాహరణములున్నవి. బ్రిటిషుడొమినియనులు బ్రిటిషు కామనువెల్తుకు వెలపలనున్న దేశములతోనే గాక తమలో

తామే పృథక్కరణమును పాటించుకొనుచున్నవి. విదేశస్థులను తమదేశములలో నివసింపనిచ్చుటలో, ఎన్నికలు, వర్తకపుసైసెన్సులు, ఆస్తిని కలిగియుండుట మొదలగువానిలో బ్రిటిషు డొమినియలు తమదేశస్థుల నొకరీతిగాను ఇతరడొమినియనుల నింకొకతీరుగాను చూచుచున్నవి. ఇంతే కాదు. బ్రిటిషునేషనాలిటీ అండు స్టేటస్ ఆఫ్ ఏలియన్సు అక్టు (1914-22) దీనినే ఇంపీరియలు నేషనాలిటీ అక్టు అంటారు, 26 (1) సెక్షను "వివిధ తరగతుల బ్రిటిషుపౌరుల (Subjects) ను వివిధరీతులుగా చూడకుండా" ఆ అక్టునందలి యే భాగముకాని బ్రిటిషు వారిక్రిందనున్న యే ప్రభుత్వపు శాసనసభను ఆటంకపరచదని స్పష్టముగా నిర్వచించుచున్నది. కనుక హిందూదేశములో పృథక్కరణము నుండి రక్షణములు కావలెనని బ్రిటిషు వారు డిమాండుచేయుచుండగా పృథక్కరణమును శాసనముల ద్వారా చేసే హక్కునకు సామ్రాజ్యశాసనము (Imperial statute) రక్షణల నొసంగుచున్నది. ఇండియాలోనున్న బ్రిటిషువాణిజ్యతరగతులవారు వాదించుచున్నట్లు బ్రిటిషుపౌరులన్నంత మాత్రమున ఒక వలసరాజ్యమువారు ఇంకొక వలసరాజ్యము నందనుభవించుచున్న జాతీయములగు రాజకీయ లేక సాంఘికహక్కులు కలవను సిద్ధాంతము శుద్ధాబద్ధము.

"ఇప్పుడు ఇండియావంటి దేశము ఇట్టి పృథక్కరణమును విధిస్తానంటే, ఇదివరలో ఈదేశమును దోచుకొనుట (exploit) యందు విశృంఖలమైన హక్కులనుభవించుచున్నట్టియు, ఇంతకుముందు బాహాటముగా తెరచియుంచబడిన వాణిజ్య భవనమునందు దూరి అనంతలాభములను కలిపించుకొనినట్టియు కొందరి ప్రస్తుతపు హక్కులకు చిక్కులును నష్టములును కలుగవచ్చును, కాని ఇది తప్పనిసరి పరిస్థితి. చీనా నుదాహరణముగా తీసుకొందము. "విదేశస్థులెవ్వరును చీనాలో ఆస్తులను కలిగియుండరాదు, బ్యాంకులను తెరవరాదు, బ్యాంకు నోటులను అచ్చొత్తించరాదు, ఇట్లా

చేయుట చీనాచట్టములకు, అచారములకు, మామూళ్లకు వ్యతిరిక్తమైన కార్యము" అని చీనా నేషనలిష్టుపార్టీ లేక క్యూమింటాంగువారు వ్యాసు చేసినారు ఈచట్టము వ్యాసయిన ఒకసంవత్సరములోనే విదేశీ పడవలవారు చీనా కోస్తావ్యాపారమును, దేశాంతర్గత జలమార్గ వ్యాపారమును చేయకుండా జాతీయప్రభుత్వము నిరోధించినది. గత సంవత్సరం, చీనా విదేశవ్యవహారమంత్రి చీనా నౌకావ్యాపార హక్కులు చైనావారికొరకే ప్రత్యేకించుకొనుటకై చెయబడిన ప్రయత్నముల కెంతయు హర్షించి "ఈ హక్కులను విదేశస్థులనుండి ఊడపీకుకొనుటకై సకల ప్రయత్నములును జరుపబడు" నని చెప్పెను.

"ఈడిమాండు (హక్కుగా కోరే కోరికలు) యొక్క రాజకీయ భాగమును చూచుకొన్నను దీని ప్రాముఖ్యత సమానతుల్యమైనదే ఈసమస్యపై బ్రిటిషు వాణిజ్యతరగతులవారు అవలంబించుచున్న పద్ధతి యెంతమాత్రమును సబబైనదికాదు. బ్రిటిషువారు ఒకొక్కప్పుడు తాము ఇండియాయందలి అల్పసంఖ్యాక తరగతులవారమని వాదింతురు. వారు దుర్బల, రక్షణాశూన్య, అధికార రహిత అల్పసంఖ్యాక వర్గమువారట. ఇంకొక్కప్పుడు తాము ఈదేశమునందు తమ అస్తులను కుదువబెట్టుకొన్న జాతివారమని వాదింతురు ఇంకా కొన్ని సమయములయందు తాము సామ్రాజ్య పౌరులు కనుక భారతీయులతో సమానమైన హక్కులు కలవారమని వాదింతురు. వారు ఇప్పుడు అల్పసంఖ్యాకులమను కారణమున తమ హక్కులను డిమాండు చేయలేదనియు, పాలకజాతివారు కనుక తమ హక్కులను మునపటివలెనే కొనసాగించుకొన చూచుచున్నారనియు స్పష్టము. ఇంతవరకు హిందూదేశమునందుగల యేమైనారిటీశాఖవారు కాని తమ జాతివారివల్లనే తాము (నేరములకై) విచారింపబడవలెనను వాదమును పెట్టలేదు; ఏమైనారిటీశాఖవారు కాని తమ మీద పృథక్కరణమును విధించకుండా

రక్షణమార్గములతో రాజకీయ చట్టమును ఓగింప చేయవలెనని కోరలేదు. బ్రిటిషువారు తాము ఇంగ్లీషుజాతివారు గనుక తమకు ప్రత్యేకహక్కులు కావలెనంటున్నారేకాని తాము భారతజాతీయులమన్న కారణమున అట్టి హక్కులను కోరలేదు. నిజంగాచూస్తే వారికి తమ విజాతీయతా జ్ఞానమును చైతన్యమును యెంతదృఢముగా ఉన్నదంటే, నూనెపరిశ్రమలో తమకు రక్షణకావలెనని గురించి వారు వాదిస్తూ అది దేశీయుల పరిశ్రమకంటె అన్యముకాదు కనుకనే తమకు రక్షణకావలెనని తెలిపినారు బ్రిటిషువారు తమకు కావాలనే స్పెషలు హక్కులు తాము హిందూదేశపు మైనారిటీ శాఖవారను కారణమున కానే కాదనిన్నీ, తాము పాలకజాతులకు చెంది నవారు గనుక, హిందూదేశమును తమ సైన్యములతో ఎట్లు స్వాధీనముచేసి అణగద్రొక్కి యుంచినారో, తమ వాణిజ్యలాభములతో కూడ అట్లే నొక్కిపెట్టి యుంచవలెనను కోరికతోనే అనిన్నీ, అద్దమునందలి నీడ వలెను స్పష్టమగుచున్నది ఐరోపీయులకును భారతీయులకును వర్తక వాణిజ్యాది విషయములందు ఇప్పటికే అపరిమిత తారతమ్య భేదములుండగా, భారతీయులతో మాకు సమానత్వ ముండవలెనని వారు వాదించేవాదము చాలా విపరీతమైనది. ఈతరగతి భేదసిద్ధాంతము మీదనే ఇంత వృద్ధిలోకి వచ్చి బాగుపడిన బ్రిటిషువారు, ఈతరగతి భేదసిద్ధాంతము మీదనే భారతీయులకు కొస్త సౌకర్యములను చిలుకుట కుద్దేశింపబడిన చిహ్నములు గోచరించీ గోచరించడములో, ఈతరగతి భేదసిద్ధాంతముపైనే ప్రతిఘటించడమున్ను తన్మూలముగా తమ ఆర్థిక భవిష్యత్తునకు సంభవించగల ఆపత్తులను గుర్తించగలగడమున్ను—ఇది కూడా కొస్త శుభసూచికమైనదే

“చట్టములో పూచీకత్తు (statutory guarantee) వర్తకపు ఒడంబడిక (trade convention) రూపములుగా, తామింతముందు నుండి అనుభవించుచున్న ఆర్థికమహాభాగ్యస్థితిని పొడిగించవలెనని కోరుట

స్వయంపరిపాలక దేశమునుండి కాపిట్యులేషను (లొంగియుండుటను సూచించుటకుగా చేయబడిన లాభములు) ను డిమాండుచేయుటయే. ఈ కాపిట్యులేషన్సుయొక్క అసహ్యాకరమైన చరిత్ర నిచ్చుట విస్తరించి చెప్పపనిలేదు. ఈజిప్టు, పెర్షియా, చీనా, టర్కీ దేశములలో ఇవి ఒకప్పుడుండెవి అవి తమ యావచ్ఛక్తిని కేంద్రీకరించుకొని వీనిపై యుద్ధములను సలిపినవి. ఐరోపీయదేశములు ఆఖరుకులొంగి వీనిని పోనాడుకొనవలసివచ్చినది. విదేశీయులు శస్త్రధారులైవచ్చి అల్పదేశములపై పడి తమకు ఫలానా ఫలానా న్యాయైక (judiciary) ఆర్థికవాణిజ్యపు హక్కుల నిస్తారా యీయరా అని అన్యాయముగా బెదిరించి ఆ విధముగా సంపాదించుకొనిన సౌకర్యములకును ఈ దేశమునుండి కోరుచున్న ఈ రక్షణలు, "సమాన అంతస్థు" (equality of status) డిమాండులకును భేదమేమియును లేదు. చీనాలో విదేశీయుల లాభములు "అసమాన ఒడంబడికలు" (అన్ ఈక్వలుట్రీటీసు) ద్వారా రక్షింపబడియున్నప్పుడు, ఇద్దరకును సమానత్వము సిద్ధించుటకుగాను ఈ ఒడంబడికలను రద్దుచేయవలసి వచ్చినది. ఈ వర్తకపు ఒడంబడిక (trade convention) ద్వారా అసమానహక్కులను పొడిగించుటకై ఇప్పుడీదేశమునందు ప్రయత్నములను చేయుచున్నారు. క్యూమింటాంగుయొక్క మొట్టమొదటి డిమాండు యేమనగా "విదేశీయులకు స్వదేశస్థులను మించి కూడా ఉన్నటువంటి దేశాతీతహక్కులు (extra territorial rights) లు మొదలైనవానితో కూడియున్న అసమాన ఒడంబడికల నన్నిటిని రద్దుచేయవలెను." ఏ జాతివారు తామింతకుముందు అనుభవించుచున్న ఈ అసమానహక్కులను తమంతట తామే ముందుగా విడచిపెట్టుకొందురో వారిని తక్కినదేశము లన్నిటికంటె నెక్కువ అభిమానజాతిగా (most favoured nation) గా

చూచి వారి వ్యాపారముల కెక్కువ ఆదరణమును ఇచ్చెదమని వాగ్దాన మొనరించెను. ఇట్లే టర్కీదేశమునందు 1920 లో ప్యాసుచేయబడిన నేష నలుప్యాక్టులో ఈ విధముగా చెప్పబడినది:-

మా జీవనము మునపటికంటె సౌఖ్యవంతమై అట్లే కొనసాగవలె నంటే, మే మీప్రధానమైన యేర్పాటును చేసుకొనక తప్పదు. మా దేశము నార్థికముగ ఉద్ధరించుటకై మేము సంపూర్ణమైన హక్కులను స్వాతంత్ర్య మును కలిగియుండవలెను. ఇట్లు జరిగినప్పుడే మాకు జాతీయమైన ఆర్థికా భివృద్ధి సాధ్యమగును. ఇందుకై మా దేశపరిపాలనములో, ఇతరదేశము లెట్టి అధునాతన సక్రమవిధానములను తమ పరిపాలనములలో విధించుకొను చున్నవో అట్టివానిని విధించుకొనవలెను. ఈ కారణమున మా రాజకీయ, న్యాయైక ఆర్థిక, ఇతర అభివృద్ధులకెల్ల నిరోధమైన నిర్బంధములన్నింటిని మేము నిరోధదృష్టితో చూచుచున్నాము.

"బ్రిటిషువాణిజ్య తరగతులు ఈ దేశములో తమకు కావలెనని డిమాండుచేయుచున్న రక్షణలును పూచీకత్తులును పైని చెప్పిన దేశాతీత హక్కులు కాపిట్యులేషన్సువలె, భారతజాతీయతా గౌరవమున కవమానా స్పదములు. కాపిట్యులేషన్సు అని చెప్పబడువానికిని ఇట్టిహక్కులకు ఎట్టి భేదములున్నను, క్రియవేళకు ఇవన్నీ హిందూదేశపు స్వపరిపాలన సార్వ భౌమహక్కుల (administrative sovereignty) ను సంకెళ్లతో బం ధించియే తీరును. మరియు కొన్నిసందర్భములలో ఆర్థికాభివృద్ధిని అడు గడుగునకును స్తంభింపజేయుచునే యుండును. మనము ప్రస్తుతము అనుభ వించుచున్న రాజ్యాంగవిధానము నందలి బాధ్యతారాహిత్యము స్థానే ఆర్థికదాస్యమును ప్రతిష్ఠింపనొల్లము. విదేశీయులు న్యాయముగా కోరెడి సదుపాయములకు యథోచితమైన రక్షణమును చూపించుచు, మనజాతీయ జీవనాభివృద్ధికి ప్రతిబంధములు కూర్చు సమస్తఆర్థిక రాజకీయనిర్బంధములను

పూర్తిగా తొలగింపవలెననియే మన ఆశయము. ఈ తొలగింపునకు ముందర యెవ్వరను యెట్టిషరతులను గాని విధించుటకు మన మంగీకరింపము.

"హిందూదేశములో క్రొత్తగా వ్యాసుచేయఁబడు రాజ్యాంగచట్టముద్వారా ఐరోపీయులు తమకుగా కోరుకో తగిన లేక సంపాదించుకొన గలిగెడి సదుపాయములు, ఇతర విజాతీయులెల్లరును యుక్తమగురీతిని న్యాయముగా తమకై కోరుకొనగల స్వభావమును మాత్రమే కలిగియుండవలెను. ఇంతకంటె అధికసదుపాయములను వారు సంపాదించుకొన గోరినయెడల, ఇండియాదేశపు భవిష్యత్తు పార్లమెంటు విధించే షరతులకును నిబంధనలకును లోబడు సజాతీయులుగాను పౌరులుగాను మారుటకు వారు సంసిద్ధపడవలెను.

"హిందూదేశములో సామ్రాజ్యపౌరుల (subjects) కందరకును సమానమగు ఆదరణము కూడేటట్లు చూడవలెనా వద్దా అను సమస్యనే ఈచర్చలకెల్ల మూలసూత్రముగా పరిగణించవలె ననునదియే తమవాదమని కొందరు చెప్పుచున్నారు. దీనికి జవాబుచెప్పు ముందర ఈదిగువ విషయములను మన మాలోచించవలెను. బ్రిటిషుసామ్రాజ్యము నందలి యేభాగమునకు గాని వలసరాజ్య స్వపరిపాలనము లేక సంపూర్ణ బాధ్యతాయుత స్వపరిపాలనమునిచ్చు, ముందర ఈ మోస్తరు చట్టసిద్ధములైన పూచీకత్తులు షరతులుగా విధించబడినవా? పృధక్కరణ స్వాతంత్ర్యమునకు విరోధమైన ఇట్టి రక్షణలు ఏవలసరాజ్య చట్టమునందును కూర్చబడలేదు కనుక భారతీయ రాజ్యాంగచట్టమును జాతీయసౌకర్యములకు భంగకరమగునట్లు బంధించుటయు, హిందూదేశపు స్వరాజ్య ప్రభుత్వ సార్వభౌమాధికారము (sovereignty) ను ఈరీతిగా సంకుచితపరచుటయు రాజ్యాంగ ధర్మశాస్త్రము ప్రకారమే అధిక్షేపించతగ్గది."

## II ఇండో్బ్రిటిషు ట్రేడుఅగ్రీమెంటు

ఈ రక్షణల చరిత్రలో విచిత్రమైన విషయమొకటున్నది. హిందూదేశ రాజ్యాంగచట్టమునకు ఇంకా రూపురేఖ లీయనేలేదు, దీనికి చాలకాలము పూర్వమే ఇండోబ్రిటిషు ట్రేడు అగ్రీమెంటుమీద సంతకము లైపోయినవి. అటువంటి అగ్రీమెంటుకు 1930 లో జరిగిన మొదటి గుండ్రబల్ల సభ యొక్క III సబ్ కమిటియే ఒక ఆకారమును సూచించినది. తెల్లకాగితములో చేర్చబడిన మొట్టమొదటి ప్రతిపాదనల (proposals) లోనే అటువంటి అగ్రీమెంటును మనపైని ప్రయోగించినారు. 1935 జూనులో ఈ చట్టమును ప్యాసు చేయకపూర్వమే, 10–1–1935 తేదిని ఇండోబ్రిటిషు ట్రేడు అగ్రీమెంటు అనే దానిపైని సర్. బియస్. మిత్ర., సర్. వాల్టర్ రూన్సిమను గారలు సంతకములు పెట్టినారు. మొదటాయన హిందూదేశపు హైకమీషనరు అధికారముతోను, రెండవ ఆయన యూనైటెడు కింగ్డమునందలి హీజ్‌మెజెస్టీను ప్రభుత్వము తరఫునను వైటుహాలులో ఇరుగుపొరుగున నున్న చెరియొక గదిలోనూ కూర్చొనియుండిరి. రెండవ ఆయనకు పార్లమెంటువారే అధికారము నిచ్చిరి. మొదటి ఆయనకు కేంద్ర శాసనసభతో ఆలోచనయైనా చేయకుండా గవర్నరు జనరలు ఆజ్ఞలను ఇచ్చెను. ఇండోబ్రిటిషు ట్రేడుఅగ్రీమెంటు A అనుబంధమునందు ప్రకటింపబడినది. దానిని బాగా పరించిన యెడల 1935 ఇండియా ప్రభుత్వచట్టమునందు చేర్చబడిన

వాణిజ్యరక్షణల రూపురేఖలన్నియు మనకు దూరమునుండియే గోచరించగలవు. అనగా, హిందూదేశపు రాజ్యాంగచట్టములో చేర్చబడవలసిన క్లాజులు ఇంకా ఆలోచనీయములుగను పార్లమెంటుచే అంగీకరింపబడుటకై కనిపెట్టుకొని యుండవలసిన స్థితిలోను ఉంటూఉండగానే, అధికారవర్గమువారు హిందూదేశమును ఈ అగ్రిమెంటులలో పూర్తిగా నిర్బంధించివేసిరి.

### III వాణిజ్యరక్షణలు (కమర్షల్ సేఫుగార్డుసు)

హిందూదేశపు టారిఫువ్యవహారము (policy) యొక్క తరువాతి చరిత్రయు, ఇండియాచట్టములో ముడిపెట్టబడిన వాణిజ్యరక్షణచరిత్రయు సంగ్రహముగా ముగించవచ్చును. యునైటెడు కింగ్డమునుండి ఇండియాకు దిగుమతి అయ్యే సరకుపైని పృథక్కరణ రూపకమైనట్టిగాని మరియెట్టి శిక్షణార్హ (penal treatment) మైనట్టిగాని చర్యలను ఇండియాప్రభుత్వము జరిపించకుండా ఆపుటకై గవర్నరుజనరలుకు ఇండియాచట్టము అధికారముల నిచ్చుచున్నది. అనగా, హిందూదేశములోనికి యునైటెడు కింగ్డములో తయారై దిగుమతిగా వచ్చేసరకులపైని, హిందూదేశములోనే తయారయ్యే వస్తువులకంటె యెక్కువ ఖరీదుపెట్టి అమ్మవలసినంత ఆపత్తు సంభవించని రీతినిమాత్రమే, హిందూదేశపు కేంద్రశాసనసభలు దిగుమతి సుంకములను విధించుటకు స్వాతంత్ర్యమును కలిగియున్నవి. ఇటువంటి సుంకములను వేనినైనను విధించునప్పుడు, యునై

టెడు కింగ్డమునందలి యే పౌరునకైనను తనసంగతిని టారిఫు బోర్డువారి యెదుట చెప్పుకొనుటకు హక్కు ఉన్నది. అటు తరువాత, అటువంటి సుంకముల నే చట్టమైనను తనతో ఆలోచించకుండా విధించినప్పుడు, యునైటెడుకింగ్డము నందలి యే పౌరుడైనను దానిపైని ఫెడరలుకోర్టులో దావాచేసి, పైని చెప్పినషరతున కది వ్యతిరేకమైనదను కారణమునుబట్టి దానిని రద్దుచేయించవలెనని తొందరచేయవచ్చును. ఇంతేకాక, ఏ కంపెనీయైనను ఇంకార్పరేటు కావలసినస్థలము, దాని రిజస్టరుడు ఆఫీసు నెలకొనవలసిన స్థలము, దానిపెట్టుబడియే చలామణీ (నాణ్యములు) రూపమున నుండవలెనను విషయము, ఆ కంపెనీయొక్క గవర్నింగు బాడీసభ్యులయొక్క వాసస్థలము జాతి వంశము భాష మతము పౌరస్వత్వ సంవాసమును మార్చుకొంటే ఆ స్థలము లేక దాని కాలపరిమితి ఈ విషయములను గురించికాని; ఆ కంపెనీలోని షేరులు స్టాకులు డింబెంచర్లు మొదలగు వానియొక్క హక్కుదార్లను గురించి కాని; లేదా ఆ కంపెనీయొక్క ఉద్యోగస్థులు ఏజంట్లు నౌకర్లు మొదలైన విషయమును గురించి కాని:—ఆ కంపెనీ యునైటెడు కింగ్డములోని శాసనముల ప్రకారము ఈ ఆక్టుకు ముందర స్థాపించబడినను వెనుక స్థాపించబడినను సరే—హిందూదేశపు ఫెడరలు శాసనసభ కాని రాష్ట్రీయశాసనసభ కాని; యేదైనా షరతులను కాని నిబంధనలను కాని చేయసంకల్పించుకొన్నప్పుడెల్ల; యునైటెడుకింగ్డములోని పౌరునితో ఆలో

చించి మరీ జరుపవలెనని ఇందు లిఖించబడియున్నది. మరియు బ్రిటిషు ఇండియాలోని శాసనముల క్రింద ఇంకార్పొరేటు చేయబడిన కంపెనీలతో తుల్యముగా అవియును ఇండియా ప్రభుత్వమునుండి గ్రాంటులు సబ్సిడీలు విరాళములు పొందుట కర్హతకలిగియున్నవి. పరస్పరసమాన లాభదాయకమైయున్నప్పుడు అని దీనికొక చిన్న విశేషణము చేర్చబడినది. ఈ విశేషణము దగా ఉద్దేశముతో చేర్చబడకపోయినా, ఫార్సుగా మాత్రమున్నది. ఏలననగా ఇండియాలో ఇంకార్పొరేటు అయి యునైటెడుకింగ్డముతో వ్యాపారముచేయుచున్న కంపెనీలకు యునైటెడుకింగ్డమువారు తమదేశములో ఇంకార్పొరేటు చేయబడిన కంపెనీలతో తుల్యముగ బ్రిటిషుఆదాయములనుండి గ్రాంటులు సబ్సిడీలు విరాళములు ఇచ్చుట అర్హముకాదని ఆ రాజ్యమునందలి చట్టములు విధించునెడల ఈ గ్రాంటుల నీయనక్కరలేదని సబ్ సెక్షను మినహాయించుచున్నది.

హిందూదేశమునుండి ఒకకంపెనీ ఇంగ్లాండువెళ్లి అక్కడ వ్యాపారముచేసి బ్రిటిషుకంపెనీతో తుల్యమైన గ్రాంటుకావలెనని యేనాడైనా కోరగలదా? ఇది ఊహింపసాధ్యము కానిది; కేవలము యెగతాళి. యునైటెడుకింగ్డము వారి యే పడవ, దాని యజమాని ఉద్యోగస్థులు జనులు బాటసార్లు సరుకు మొదలైనవిషయములను గూర్చి బ్రిటిషుఇండియాలో రిజిస్టరైన పడవలకు వ్యతిరిక్తములైన యెట్టి పృథక్కరణమును

విధించరాదని నిర్బంధించబడినది. ఇక్కడ కూడ పరస్పర సమానలాభములకు సంబంధించిన ఒక క్లాజు చేర్చబడినది. పై క్లాజువలె ఇదియును పరిహాసాస్పదమే. ఈ విధముగా ఒకరీతిని ఇంగ్లాండు ఇండియాను పీకపట్టి బంధించినదని తెలియగలదు. రెయిల్వే రేటులు, మారకము, చలామణీ, దిగుమతి సుంకములమీాద సమస్తమైనహక్కులను బిగపట్టుకొని, హిందూదేశవాణిజ్యమును స్వాధీనము నందుంచుకొని యున్నైటెడుకింగ్డముతో పోటీచేయుట దుస్సాధ్యమగునట్లు ఈ రక్షణ క్లాజులు చేయుచున్నవి.

# 16 వ అ ధ్యా య ము

## ము గిం పు

బ్రిటిషువారును బ్రిటిషు ప్రభుత్వమును హిందూదేశ పరిపాలనమునందలి ప్రతీ వ్యవహార శాఖయందును ఒకేమో స్తరు అర్థిక స్వలాభప్రేరణ నీతితో యెట్లు వర్తించుచున్నారో తెలుపుటకై తగినంతగా ప్రయత్నించితిమి. ప్రభుత్వమువారు తమ అధికారమును శక్తిని సర్వమును హిందూదేశమునందు బ్రిటిషువారు జుర్రుకొనుచున్న ఆర్థిక లాభములను విస్తరింప జేయుటకే వినియోగించుచు మన వాణిజ్యమును పరిశ్రమలను అభివృద్ధిపరచునట్లు నటించుచున్నారు ఇంగ్లాండు దేశపు సరుకునకై ఇండియాలో అంగళ్లను కట్టకపోతే ఇండియావల్ల ఇంగ్లాండుకు ప్రయోజనమేలేదు. ఇంగ్లాండు వస్తువులను ప్రపంచపు టంగళ్లన్నియు తమనుండి గెంటివేసినవి.

ఇంగ్లాండు బొగ్గు పరిశ్రమ యెట్లు క్షీణించెనో తెలిపియే యుంటిమి. ఇదివరకు ఇనుము యెక్కడెక్కడ ఉపయోగింపబడుచుండెనో అక్కడ సిమెంటు కాంక్రీటు వంతెనలు కట్టించి దాని అవసరమును తగ్గించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. సామ్రాజ్యాభిమాన (Imperial preference) సూత్రముపై ఇంగ్లీషు వస్తువుల నెక్కువగా చెల్లించుకొనుటకై ఇంగ్లీషువారు చేసిన ప్రయత్నములు కెనడావారిపట్ల నెట్టి విజయమును పొందలేదు. ఒట్టావానుండి వెళ్లిన రిపోర్టువల్ల లంకా

షైరులో ఎంతో నిరాశ ఉత్పన్నమైనది: ఏ వస్తువులైనను ఇంపీరియలు ప్రిఫరెన్సు భాగ్యమునకు పాలుగావలెనంటే, ఆవస్తువును తయారుచేయుటలో నయ్యెడి శ్రమలో కనీసము 50% బ్రిటిషు జాతీయుల (British National Labour) దై యుండవలెనను ఇప్పటి సిద్ధాంతములో యెట్టి మార్పునుగాని సిఫార్సు చేయుమని కెనాడియను టారిఫుబోర్డువారు నిశ్చయించుకొనియున్నారు. మునపటివలె 25% కు కెనడావారు ఈ బ్రిటిషు నేషనలు లేబరు సూత్రమును మార్చకున్నను 50% కంటె యేమాత్రమైనను మార్తు రేమోయని లంకాషైరు వారు ఆశించియుండిరి. కెనడా కన్స్యూమర్ల (వినియోగించువారు) యొక్కయు ముడిప్రత్తి దారపు దిగుమతిదార్ల యొక్కయు ప్రతినిధి లంకాషైరు కోరికను బలపరచెనుకాని వస్త్రపారిశ్రమికులు దానిని ప్రతిఘటించిరి. సామ్రాజ్యములో పండిన ప్రత్తి విశేషముగా లంకాషైరుకు వస్తున్నది గనుక దీనిని మార్చనక్కరలేదని వారు వాదించిరి.

ఇది ఇట్లుండగా గత కొంచెము సంవత్సరములలో హిందూదేశము లంకాషైరు వస్తువులపైని దిగుమతి సుంకముల ననేకపర్యాయములు హెచ్చించెనని లంకాషైరు పరిశ్రామికులు దుఃఖించుచున్నారు. ఆస్ట్రేలియా తన దిగుమతి వస్తువులు కొన్నింటిపై సుంకములు హెచ్చించుకొనెను. కెనడా యేదైనా అనుకూలమైనచర్య తీసుకొనునని ఆశించిరికాని అది ఆపనిచేసే తలంపుతోలేదు.

పరిస్థితు లిట్లుండగా, ఇన్నాళ్లనుండియు తాను హేయముగా చూచుచుండిన రష్యాతో ఇప్పుడింగ్లాండు రాయిబారములు ప్రారంభించినది. మనదేశములో ఇంకా బాగా తెలియకున్నను, 700 మిలియన్లు సావరినులు పెట్టుబడి మొత్తముగల 1500 బ్రిటిషు ఫర్ముల తాలూకు 84 గురు ప్రతినిధులు, రష్యాయందలి సోవియట్టు అంగళ్ల స్థితిగతుల నన్నిటిని పరిశీలించి సోవియట్టు రిపబ్లికుతో వాణిజ్యమును ప్రారంభించు ఉద్దేశముతో రష్యాకు వెళ్లియుండిరి. రష్యాలో అంగళ్లెంత తీరుగా ఉండునో వాటి ధరవరలు చలామణీలు యెంతక్రమముగా ఉండునో వీరు నివేదికలను తయారుచేసి లేబరు ప్రభుత్వమునకు పంపించిరి. కనుకనే ఇంతకుముందొకరి నొకరు క్రూరులని ఘోరులని యెత్తిపోసుకొని దూషించుకొనుచుండిన ఇంగ్లాండు రష్యాలు లేబరు ప్రభుత్వముతో రాయబారముల (diplomatic relations) ను ప్రారంభించుకొనినవి. రాయబారుల (ambassadors) ను మార్చుకొనుచున్నవి. ఇంగ్లాండు ఈవిధముగా తన జాతీయ జీవనములో దేనికైనను తెగించుకొనగలస్థితి యేర్పడినది.

ఐరోపాయుద్ధములో కలిగిన విజయమునకు ఫలముగా ఇంట్లో నిరుద్యోగ మెక్కువగుటయే ఇంగ్లాండునకు తటస్థించినది. ఫ్రాన్సు ఇంతకుముందు తనకు కావలసిన ఇంజనులు, బొగ్గు, ఇనుము ఇంగ్లాండునుంచి కొనుక్కొనుచుండెను. ఇప్పుడు జర్మనీ దేశము ఫ్రాన్సు కీయవలసిన యుద్ధపరిహార ఖర్చులు

(war reparations) క్రింద ఈ వస్తువులను తయారుచేసి ఫ్రాన్సుకు సప్లైచేయుచున్నందువల్ల ఫ్రాన్సు ఇంగ్లాండునుండి వీనిని కొనుక్కొనుట మానినది. ఓడిపోయిన జర్మనీ దేశము అహోరాత్రములు తన ప్రజలకు పనులు కలిపించి ఆహారమును సమృద్ధిగా పెట్టుచు నిరుద్యోగ పిశాచమును దరి చేరనీయకుండగా, జయించిన ఇంగ్లాండు ఫ్రాన్సులోగల తన అంగళ్లను గోల్పోయి తన ప్రజలను నిరుద్యోగ పిశాచమున కెఱలుగా ఒప్పచెప్పవలసి వచ్చెను.

చీనా, పెర్షియా, ఆఫ్గనిస్థానము, అరేబియా, ఇరాకు, ఈజిప్టు దేశములందెల్ల బ్రిటిషు వస్త్ర బహిష్కారము చెలరేగిపోయినది. 1909–13 మధ్య చీనాకు వెళ్లిన బ్రిటిషు వస్త్రముల దారము పొడవు 587.3 మిలియనుల గజములు. 1930 లో 69.4 మిలియనుల గజములు మాత్రమే వెళ్లినది. పాలస్తైనును విభజించుటవలన అరబ్బులకు కోపమువచ్చి ఆ దేశములో ఒకచివరనుండి మరియొక చివరవరకు వి దేశవస్త్ర బహిష్కారమును ఏర్పాటు చేయుచున్నారు.

ఇండియాలో ఇంగ్లాండు దేశ వర్తకమెట్లు క్షీణించుచున్నదో కొన్ని అంకెలద్వారా తెలియపరచుచున్నాము. 1913 లో ఇంగ్లాండు తన వస్త్రములలో 40% న్ను దారములో 63% న్ను ఇండియాకు యెగుమతిచేసెను. 1931 లో మొదటిది 20% కున్ను రెండవది 19.5% కును తగ్గిపోయినవి. 8–6–1937 తేది రూటరు తంతివార్త ద్విదేశ వాణిజ్య ఒడం

బడికలకై (Bilateral trade Bargaining) బేరములు సాగుచుండగా దూరదేశములందున్న మార్కెట్టుల నన్నిటిని లంకాషైరు ప్రత్తివస్త్రముల విడుదలకొరకై కాపాడుకొనవలసిన అవసరమెంతో కలదని చెప్పుచున్నది. కాటన్ ట్రేడు సంస్థల జాయింటు కమిటీవారు ప్రత్తిపరిశ్రమయొక్క ప్రస్తుతస్థితిని, భవిష్యద్భాగ్యమును బాగుగా పరిశీలించి ప్రకటించిన గ్రంథము నాధారము చేసుకొనియే పైవాక్యము చెప్పబడినది. ఇంగ్లాండుయొక్క యెగుమతి వాణిజ్యమును విదేశముల యెగుమతి వాణిజ్యముతో సరిగా పోటీచేయించుటకై ఇంగ్లీషు పరిశ్రమలను దేశములో నెంతో దిట్టపరచవలసిన ఆవశ్యకతనుగూర్చి కూడ రూటరు సందేశము నొక్కి చెప్పుచున్నది.

లంకాషైరు ఇండియాదేశమునుండి కోరే ప్రత్యేక సౌకర్యము లేమీ లేవనిన్ని, ఈదేశపు పారిశ్రామికులతోను విదేశపు పారిశ్రామికులతోను తుల్యముగా పోటీచేయుటకై సబబైన అవకాశములిస్తే చాలుననిన్ని పదిసార్లు చెప్పుచున్నను, హిందూదేశముతో వాణిజ్యము విషయమై ప్రభుత్వమువారు ఇప్పటికంటె యెక్కువగా చేయవలసిన పనియెంతో ఉన్నదని కూడా వారు చెప్పుచున్నారు. లంకాషైరు పరిశ్రమ యెల్లయు హిందూదేశీయుల కొరకే నిర్మించబడినను, హిందూదేశపు అంగళ్లలో లంకాషైరు సరుకు 85% తగ్గిపోయినందువల్ల ఆ పరిశ్రమ యెంతక్షీణించినదో తెలుసుకొనవచ్చునని కూడా ఆసందే

శము చెప్పుచున్నది. ఆఖరుకు, ప్రత్తి వాణిజ్యములో ఇంపీరియలు పాలసీవల్ల కలిగే ఫలితములందు బ్రిటిషు ప్రభుత్వము వారు తమ బాధ్యతలను గుర్తింపవలసియున్నదను అభిప్రాయము కూడా స్పష్టముగా వచింపబడినది. ఈ సందర్భమున మద్రాసు "సండే టైమ్సు" పత్రిక 27—6—37 వ సంచికలో ప్రకటింపబడిన వ్యాసమును ఇచ్చట నుదహరించుచున్నాము. ఈ వ్యాసమువల్ల ప్రస్తుతము (1937) జరుగుచున్న ఇండో బ్రిటిషు త్రేడు రాయబారములను గూర్చి యెన్నో సంగతులు తెలియగలవు.

"హిందూదేశముతో జరుగనున్న ట్రేడు అగ్రిమెంటులో తమకు అత్యంతానుకూలములైన షరతులను సంపాదించుకొనుటకై వలయు ప్రయత్నములెల్ల చేయుటకై బ్రిటిషు పెట్టుబడిదార్లు కృతనిశ్చయులైయున్నారు.

"ఇందుకొరకై వారు తేగల ప్రబలమైన ఆయుధమును తీసుకొని వచ్చినారు— అదే "ఫెడరేషన్ ఆఫ్ బ్రిటిషు ఇండస్ట్రీసు" సంస్థ. ఈ సంస్థయే బ్రిటిషుదేశమెట్టి ట్రేడు పాలసీని అవలంబించవలెనో విధించు అధికారమును ఇంచుమించుగా కలిగియున్నది

"ఈసంస్థ రంగములోనికి వచ్చినదంటే యేదో ఉపద్రవము ఇంచుమించుగా మూడుచున్నదనే అర్థము. ఆఖరుకు తేలే అగ్రిమెంటువల్ల "తలలు మాకులాభం, తోకలు మీకు నష్టం" అన్న సామెత సత్యమగును. ఈసమయమున ఢిల్లీ తీవ్రముగా పోరాడితేనే యేమైనా ప్రయోజనం.

"ఆఖరుకు ఢిల్లీ కూడా ఇంపీరియలు గవర్నమెంటుకు లొంగియుండవలసిన ఒక చిన్న శాఖయే యన్నమాట యథార్థమే కావచ్చును. ఈ కారణమువల్ల కడపటి నిశ్చయము సంపూర్తిగా వైటుహాలుదే. కాని

ఢిల్లీ బాగా శ్రమపడితే, అగ్రిమెంటుమీద లండనులో సంతకములు పెట్టి నంతమాత్రమున పనిముగిసినట్లు కాదనిన్నీ, దానిని ఇండియా అనుసరించు నట్లు చేయుట కష్టతరమనిన్ని వారికి తెలియజేయవచ్చును.

"అసెంబ్లీవోటోను పైసురాయి సర్టిఫై చేయవలెనని పైటుహాలు ఆజ్ఞాపించవచ్చును. అందువల్ల గుఱ్ఱమును నీటియొద్దకు ఈడ్చుకొనిపోయి నట్లే అగును కాని దానిచేత నీరుత్రాగించుట దుస్సాధ్యము.

"ఇంకొక ఒట్టావా యెగ్రిమెంటును అయిష్టముగా ఉన్న హిందూదేశముపై రుద్దవలెనని బ్రిటను ఊహించినయెడల, రాష్ట్రప్రభుత్వములు ఆట్టిదాని నెంతవరకు ప్రతిఘటించునో లెక్క వేసికొనవలసి యున్నది. హక్కులు సికందరుషాలు కూడా అటువంటి యేకైకపక్ష లాభదాయకములైన ఒడంబడికలను అంగీకరించరు. రాష్ట్రమంత్రులు నెట్టి కొంటే, ఢిల్లీ కలుగజేయు లాభములన్నెల్ల తాము త్రుళ్లగొట్టి బ్రిటిషువాణిజ్యమును స్తంభింపజేయగలరు.

"ఢిల్లీ యీవిషయములన్నెల్ల ఈరాయబారముల సందర్భమున ప్రకటించవలెనని హిందూదేశ మెదురుచూచుచున్నది. ఇంతేకాక బ్రిటను కూడా, తనయొక్క స్వలాభమునే పూర్తిగా ఆలోచించుకొన్నను, హిందూదేశ వాణిజ్యసంపర్కమున మనపటి జోరావరీనీతిని మార్చుకొనవలసిన అవసరమెంతయో కలదు.

"ఇప్పటివరకు ఇండియాకు ఇంగ్లాండు చేసే యెగుమతులకంటె ఇండియానుండి తెచ్చుకొనే దిగుమతులు తక్కువ కనుక వాణిజ్యసంబంధమైన ఆదాయము ఇంగ్లాండుకే యెక్కువగా ఉన్నది.

"ఇంగ్లాండుకు తక్కినదేశములన్నిటితో చేసెడి వాణిజ్యము నంతటినీ కలిపినను నష్టమెక్కువవుచుండగా ఒక్క హిందూదేశవాణిజ్యమే

లాభప్రదమైయున్నది. అనగా ఇతరదేశములవల్ల కలిగే నష్టమును ఇండియా భర్తీచేయుచున్నది. ఈసందర్భమున ఇతరసామ్రాజ్య దేశములు ఇంగ్లాండుకు నిష్ప్రయోజనములు

"ఇండియా ఈవిధముగా భర్తీచేయుచున్నదంటే, ఇతరదేశముల వాణిజ్యములో ఇండియాకు బోలెడులాభము కలుగుచుండుటవల్లనే.

"ఇండియాకుగల ప్రకృతిసిద్ధమైన బలవంతస్థితివలన, అది తన వాణిజ్యసంస్థితి (balance) కై ఇంగ్లాండు తప్ప ఇతరదేశములకు పంపవలసిన దానికంటె యెక్కువసరకును పంపె ఆమూలమున లాభములనుతీసి ఇంగ్లాండునుంచి మితిమీరినన్ని సరుకులుకొని వానిఖరీదులను చెల్లించుటయే గాక, లండనులో చెల్లించవలసిన అనేకదండుగ ఖర్చులను కూడ చెల్లించగలుగుచున్నది ఇది భరతఖండమునకు చాలా శోచనీయమై దురదృష్టవంతమైనగతి ఇందువల్ల దానిదారిద్ర్యము నానాటికిని వృద్ధియగుచున్నది.

"ఇప్పుడు, హిందూదేశమున క్లిష్టమైననుసరే ఈమోస్తరు వ్యాపారమును మరిచేయజాలదు. ఏలననగా ఇతరదేశములనుండి ఇండియాకువచ్చే వాణిజ్యాదాయములు (Balance of trade) పడిపోయినవి. కనుక లండనులో చెల్లించవలసిన దండుగలకై అది క్రిందుమీదుపడుచున్నది. బ్రిటను ఇప్పటికంటె యెక్కువగా ఇండియాకు సరుకును యెగుమతీచేయవలెనని కోరెయెడల, ఇండియా సరకు నిప్పటికంటె యెక్కువగా దిగుమతి చేసుకొనవలెను (ఇది దుస్సాధ్యమని పూర్వానుభవమువల్ల తేటయైనది) లేదా ఇండియానుండి ఖర్చులక్రిందవచ్చే విశేషాదాయమునైనను లండను గోల్పోవలసియున్నది ఇదితప్ప వేరేమార్గము లేదు

"లండను పెట్టుబడిదార్లు ఈచిక్కులనెట్లు ఊహించుకొనకున్నారో మనకు తెలియకున్నది బహుశా వారి ఉద్దేశమొకటియై యుండవచ్చును.

ఇండియామీద బలవంతంమీద సరుకు కుక్కుతున్న కొద్దీ, ఇండియానుంచి బలవంతాన యెల్లాగో ఒకలాగ ఖర్చులు పిండుకోవచ్చునని వారి ఊహ యేమో, ఇటువంటి చర్యలవల్ల, వచ్చే ముప్పేదో మరింతముందుగా సంభవించుట తప్ప వేరుప్రయోజనములేదు. ఇండియామీద ఇంకా ఎక్కువగా బలవంతాన ఇంగ్లాండు ఎగుమతులను కుక్కుతే యనుకొందము. వీనిఖరీదులను చెల్లింపించుకొనుటకై ఇండియాతరపున ఇంగ్లాండు ఋణము లెక్కువ చేయవలసినదే. లండను ఇండియాకు ఎన్నాళ్లు ఈరీతిని ఋణాలు హెచ్చిస్తూ ఈయగలదు? ఎప్పుడో ఒకనాడు ఇచ్చుట మానివేయక తప్పదుగదా!

"ఎప్పుడోమాట యెందుకు? ప్రస్తుతం లండను అవలంబించుచున్న ఈనీతివల్ల బ్రిటిషువాణిజ్యమునకు తాత్కాలిక సంతృప్తియైనా సిద్ధించే సూచనలేమీ కానరావు. ఆర్థికవిషయములలో నిర్బంధవిధానములు నిష్ప్రయోజనములను సిద్ధాంతముయొక్క సత్యమును బ్రిటను వెంటనే గ్రహించవచ్చును. ఇండియాను యెంతనిర్బంధిస్తే తన వాణిజ్య మంత క్షీణిస్తుందని కూడా అది గ్రహించవచ్చును. ఏలననగా ఇట్టి నిర్బంధ విధానములవల్ల ఇండియాకు కలిగే కోపమువల్ల సంభవించే ఆపత్తులను కూడా గమనింపవలసినదే. ఇండియా చేసే ప్రతిఘటనమువల్ల బ్రిటిషువస్త్ర బహిష్కారము పూర్తిగా జరుగకపోయినా, చెల్లుబడి తక్కువయౌనన్న సంగతి నిస్సందేహము.

"ఈసందర్భములో కొంత సహాయకరమైన ఆలోచన యొకటున్నది కాని ఇంతవరకు బ్రిటిషుతంత్రకారులు దానిని గ్రహించినట్లు తోచదు.

"బ్రిటిషు క్యాపిటలిష్టుల సలహా విని బ్రిటను ఇండియామీద సుంకములగోడ నీరీతినే నిర్మించుచు పోయినయెడల, ఇతరదేశములతో

అనగా ముఖ్యముగా అమెరికా జర్మనీలతో వర్తకపు ఒడంబడికలు వేరేగా జరుపుకొనే ఆశలను విడచిపెట్టుకోవాలి ఒట్టావా ఒడంబడికను రద్దుచేసుకొననిదే తాము బ్రిటనుతో యెట్టివాణిజ్యరాయబారములలోనికిని దిగమని ఆదేశములు బ్రిటనుకు స్పష్టముగా తెలియచేసినవి. ఈఅంతిమ సందేశము నది తృణీకరించగలదా? అయితే యేమిటిచెయ్యడం? ఈసందర్భమున నే ఢిల్లీ వైటుహాలుకు సలహానీయగలదు. బ్రిటిషువస్తువులపైని ఇండియా యెక్కువ ఆదరణమును చూపవలెననే నిర్బంధవిధానములను తొలగించుకొనుమని ఇండియా బ్రిటనుకు సలహాచెప్పవలె ఇట్టి నిర్బంధవిధానమువల్ల బ్రిటనుకు ఇండియాలోనే కాక సామ్రాజ్యేతర దేశములలో కూడా చాలా నష్టములువచ్చును."

యథార్థ మేమనగా, ఏ ప్రక్కనుంచి చూచినను ఇంగ్లాండుయొక్క స్థితి ఆశాసూచకముగా లేదు. నేడు ఇంగ్లీషు రాజకీయవేత్తలు ఇండియాకు ఒక మోస్తరు డొమినియను స్టేటసు నిచ్చుచున్న ఉదారత్వముతో కనిపించుచున్నను, అది కేవలము ఇండియా మేలుకొరకే కాదు. ఇండియాకు ఉపకారము చేయు సదుద్దేశమువలె పైకి కనిపించుచున్నను, అది ఇంగ్లాండుయొక్క క్షేమముకొరకు కూడా అయివున్నది. హిందూదేశీయులకు ఈ సంగతులన్నీ బాగా తెలియవు. దీనిలోనొకొక్కవిషయమునకు ఒకొక్క అధ్యాయమును వ్రాసినను చాలదు. వ్రాయవలెనంటే యెంతో గ్రంథము చదివి యెన్నో చర్చలు చేయాలి. గత అధ్యాయములలో తెలుపబడిన విషయములవల్ల, బ్రిటనుయొక్క సంకల్పమంతయు ఇండియాలో

బ్రిటిషువాణిజ్యపరిశ్రమలను వృద్ధిచేసుకొని యిండియాను దోచుకొనుటయే యని తెలియగలదు. ఆ సంకల్పము నాచరణాలో పెట్టుటకు దినదినమును గంటగంటయున్న అది యెట్టికార్యములకు గడంగుచున్నదో కూడా తగినంతవరకు చిత్రించబడినది. ఈ విషయములను బాగా పఠించినయెడల, భారతీయరాజకీయవాదులకు ఇటువంటి అగాధమైనట్టియు అంతులేనట్టియు సమస్యమీాద దృష్టి యెక్కువై యెక్కువశ్రద్ధతో పఠింతురను విశ్వాసముతోనే ఈ గ్రంథము వ్రాయబడినది. ఒక్కవస్త్రపరిశ్రమవిషయమైయే బ్రిటిషువారు అవలంబించిన నీతి సవిస్తరముగా కద్దరుమీాద నేను వ్రాసిన చిన్నగ్రంథమును పఠించినవారికి తెలియగలదు. (ప్రకాశకులు జి. ఏ. నటేశన్, మద్రాసు). దీనిని పూర్తిగా తెలుసుకోవలెనంటె ఒక ఉద్గ్రంథమును వ్రాయవలెను. "బ్రిటిషులాభముల కొరకై ఇండియాను దోచుకొనవలెననే సిద్ధాంతము గతించినది, దానితో మనకు సంబంధములేదు" అని కాప్టనుబెన్ చెప్పినమాటలు నిజమగుగాక యని మనమాశింతము.

ఇండియాలో బ్రిటిషుయొక్క ప్రత్తివస్త్రసామ్రాజ్యము మించుమించుగా నశించినను, యంత్రములతో నింకొక సామ్రాజ్యము నది నిర్మించుచున్నది. కొంచెము కాలముక్రిందట విద్యుచ్ఛక్తిని మనదేశములో వ్యాపింపచేయుటకై విశేష ప్రయత్నము జరిగినది. ప్రపంచవిస్తీర్ణములో $\frac{1}{4}$ వంతు భూమియు జనాభాలో $\frac{1}{4}$ ప్రజలును బ్రిటిషుసామ్రాజ్యములో ఉన్నా

రు. ప్రపంచపు గోధుమపంటలో 22%, తగరము (tin) లో 43%, ఉన్నిలో 44%, బియ్యములో 52%, రబ్బరులో 58%, బంగారములో 71%, నిక్కెలులో 88%, జనుపనారలో 99%, బ్రిటిషుసామ్రాజ్యములో ఉత్పత్తి అగుచున్నది. కాని ఇంగ్లాండులో తనకు 5 వారములకు సరిపడు ఆహారపదార్థమే పండుచున్నది. తక్కిన 47 వారములకు సరిపడు ఆహారపదార్థములు, 52 వారములకు సరిపడు ముడిపదార్థములు కూడా సామ్రాజ్యవిదేశములనుండి లేక విదేశములనుండి రావలసినదే. మొన్నమొన్నటి దాకా ఇంగ్లాండుకు కావలసిన గోధుములు రష్యానుండి వచ్చేవి, మేకమాంసం పాలపదార్థాలు మొదలైనవి డెన్మార్కునుండి వచ్చేవి, పాలు ఇతరపదార్థములు హాలాండు బెల్జియమునుండి, కాఫీ సింహళమునుండి, తేయాకు బియ్యం ఇండియానుండి వెళ్లేవి. వీటన్నిటికి ఖరీదులు చెల్లించవలెనంటే, అది తన వస్తువులను విదేశములలో అమ్మాలి.

గతశతాబ్దములో 1870-88 మధ్య కొందరు భారతీయులు పెద్దచదువులు చదివేటందుకు ఇంగ్లాండువెళ్లిరి. జపానువారివలె భారతీయులు యంత్రపరిశ్రమ లేల నేర్చుకోరో, ఐ. సి. యస్ యేల చదువుతారో అచ్చటి ఆచార్యుడు ప్రొఫెసర్ మార్షల్ వారిని అడిగెను. ఐనా వారు ఇంగ్లీషుచదువులే చదివి, ఇంగ్లీషుఆచారములనే అభ్యసించి, ఇంగ్లీషువస్తువులనే ఉపయోగించి భారతీయులలో ప్రచారమొనరించుట మంచిదని అతను సందర్భవశమున చెప్పెను. ఏలననగా ఇంగ్లాండులో

బొగ్గు ఇనుము తప్ప ఇతరము పండదు. విదేశవాణిజ్యము లేకపోతే ఇంగ్లాండు బొగ్గు తినవలె ఇనుము తాగవలె అని చెప్పినాడు. అప్పటికీ ఇప్పటికీ మధ్య 60 యేళ్లు దాటినా ఇంగ్లాండు స్థితి నేటికిని అట్లేవున్నది. కనుక ఇండియాను ఆర్థికముగ జయించి కాలిక్రింద ఉంచుకుంటేనే ఇంగ్లాండుకు లాభం.

ఒక్క ఇంగ్లాండే కాదు ఇండియాను దోచుకుంటున్న దేశం ; ఇటలీ, జర్మనీ, జపాను, అమెరికా, హాలండు బెల్జియములు కూడా దోచుకొనుచునే యున్నవి. మొదటి నాలుగు దేశములును హిందూదేశపు దూరసముద్ర నౌకావాణిజ్యములో 0-5 మొదలు 4% ను తమ పడవలతోనే జరుపుచున్నవి. వారిదేశములో పారవేయు వస్తువులను, పడవలకు బరువెత్తుటకు గాను వారు క్రుక్కి ఇండియాకు తెచ్చి మనకు ఖరీదులకు అంటకట్టుదురు. లేకుంటే ఇటలీ మార్బిలురాళ్లు, కనడాగోధుమలు, జపానుబియ్యం, జర్మనీయంత్రములు మన దేశపు వానికంటె చౌకఖరీదుల కెట్లు అమ్ముచున్నారు ? బెల్జియమునుండి వనస్పతి నెయ్యిలేక వెజిటబులుఘీ దిగబడుచున్నది. దానిని మన దేశపు పశువుల నేతిలోచేర్చి కల్తీ చేస్తున్నారు. మన స్టేటుకౌన్సిలు ప్రతినిధులు ఈ వనస్పతి “నేతిలో కాస్తరంగు కలిపించుమనిన్నీ, అట్లా కలిపితే ఈ నేయి కల్పిన మంచినేయీ కూడా రంగుగానే ఉండి దానిని కొనుక్కొనుటలో ప్రజలు జాగ్రత్తగా ఉందురనిన్నీ చెప్పి ఈ మాత్రం సదుపాయం చేయించుటకై భూమ్యాకాశముల

నల్లలనాడించినారు. కాని అప్పుడు కామన్సుడిపార్లమెంటు సెక్రటరీగా ఉండిన కార్బెట్టు ఐ., సి., యస్ (ఢిల్లీ), అటు వంటి పనిచేస్తే కామన్సుమెంబరు వుద్యోగం, వైసురాయి వుద్యోగం, తన ఉద్యోగం కూడా పోతాయని అన్నాడని కొందరు చెప్పుదురు. ఎటువంటి భయంగద! అయినా బెల్జి యము నేతికి రంగుచేర్చగానే, ఆ నేతిఖరీదు పడిపోయి బెల్జియ ముకు నష్టమువచ్చి దాని వాణిజ్యం పడిపోగానే, అవి తాను ఇంగ్లాండుకు పంపించే పాలు, పాలపదార్థములు మొదలగు వాని ఖరీదులను హెచ్చించుతుంది. ఇంగ్లండు అది భరింప జాలదు.

ఇదీకాక హిందూదేశముతో వాణిజ్యముచేసే విదే శము లనేకము తమవాణిజ్యమును బ్రిటిషు ఫర్ములద్వారానే జరుపుకొనుచున్నవి. కనుక ఈ విదేశము లనుభవించుచున్న సౌకర్యములను వేనినైనను తగ్గించినయెడల ఆ దెబ్బ బ్రిటిషు వారికి కూడా తగులును. దీనినిబట్టి ఇండియాను పాలించుటలో ఇంగ్లండు కెంతప్రమేయము గలదో బెల్జియము కంత ప్రమే యము యెట్లు కలదో తెలిసినది. ఇండియా స్వతంత్రమై నప్పుడే విదేశములతో తన కనుకూలమగు రీతిని రాయబార ములు చేసుకొనగలదు కాని, ఇంగ్లాండు లాభమున కనుకూల ముగా అది పాలింపబడు నన్నాళ్లు దాని కనుకూలముగా ఉం డవలసిన దేశములన్నిటివల్లను కూడ పరిపాలింపబడినట్లే. హిందూదేశపరిపాలన అంతాకాకపోయినా, ఇండియా యం

దలి ఇంగ్లాండుయొక్క వాణిజ్యపారిశ్రామిక వ్యవహారనీతి యైనా ఇంగ్లాండులాభాలను దృష్టిలో పెట్టుకొని నాగించబడు చున్నదే. ఒకప్పుడు ఈ నీతి చాలాగుప్తముగా ఉండేదికనుక ప్రజలకు తెలిసేదికాదు. నేడు దానిమీాద ముసుగుతీసేస్తే అది బట్టబయలుగా కనపడుతున్నది.

హిందూదేశమునకు నూతన విజ్ఞానోదయము కలిగిన దని కాని, తొల్లింటి జాతీయతా స్వరూపము లభించినదని గాని చెప్పుటకు ముందు దానికి వర్తక వాణిజ్యములయందు, దేశీయ ఆర్థిక ప్రతిపత్తియందు సంపూర్ణ జాతీయతా వ్యక్తి త్వము సిద్ధించినదాయన్న సంగతిని మనము విచారించవలెను. వారు దినదినమును ఉపయోగించు వస్తువులను కొనుక్కొను టలో ఇంగ్లాండుకు దాస్యము చేయుచుండవలసినగతి పూర్తిగా తొలగినదేమో నిశ్చయింపవలెను. విదేశీవస్తువులను కొను క్కొనుటకై మన మొక రూపాయిని వెచ్చించినయెడల ఇక్కడ యిరవైమందిని అన్నంలేకుండా మాడ్చి యెక్కడివారికో పది మందికి తిండిపెట్టినట్లగును. భారతీయులు తమ దేశములోనే తయారైన వస్తువులను, అందులో ముఖ్యముగా తమ గ్రామ ములలో గృహపరిశ్రమా మూలకముగా తయారైన వస్తువు లను మాత్రమే కొనుక్కొని ఉపయోగించడం ప్రారంభించిన తరువాత హిందూదేశములో నిరుద్యోగ సమస్య ఉండగలదని ఊహించుటకైనను సాధ్యముకాదు. విదేశములనుండి దిగు మతియైవచ్చే సోఫాలు కుర్చీలకు బదులు మన దేశపు తివా

సీలు వర్ధిల్లవలెను, మిల్లు బియ్యమునకు బదులు దంపుడు బియ్యము వాడవలెను, తెల్లచక్కెర పోయి మామూలు బెల్లము రావలెను, గోధుమలను చేతితో విసరవలెను. నూనెను గానుగలతో ఆడవలెను, గ్రామములలో తయారైన చెప్పులు, చేతితో వడికి నేయబడిన వస్త్రములు మనము ధరించవలెను, మంగలివానికి కావలసిన క్షౌరపు కత్తులు, కత్తెరలు, విద్యార్థులు ఉపయోగించే చాకులు గ్రామములలోని ఇనుప పనివారు తయారుచేసినవై యుంచవలెను, చాకలివారు విదేశీ ఇస్త్రీ పొడుల (బ్లీచింగు పౌడర్లు) ను విసర్జించవలెను, సుత్తి, బాడిద, ఉలి, చిత్రిక మొదలైన పనిముట్లన్నీ ఇక్కడ తయారు చేసినవై యుండవలెను. అగసాలివారు బంగారు తీగెలను రేకులను తమ పూర్వులవలె తామే తయారుచేయుచుండవలెను. పల్లెటూరు బండ్లు విదేశీ రబ్బరుటైరు లవసరము లేకుండా కఱ్ఱచక్రము లతో నడవవలెను, విదేశీ జారులకు బదులు కుమ్మరివాని కుండల నుపయోగించవలెను; అప్పుడే మన భారతదేశము నందు నిరుద్యోగ సమస్య సంపూర్తిగా తొలగగలదు, అంత వరకు తొలగదు.

ప్రాతముండకు పట్టాభిషేకంలాగ యీ ప్రాచీన పద్ధతులకు ఇంత సముద్ధరణ (revivalism) మేమిటని కొందరు ఈసడింపవచ్చును. కాని, వారు చెప్పే విప్లవ పద్ధతి (revolution) దీనితో తుల్యముగా ఈ నిరుద్యోగ సమస్యను తొలగించవచ్చునని ఊహించినను, అది మనకంత దృగ్గోచరముగా

లేదు. మొదటి పద్ధతిని తరతరములవారు ప్రయోగించి విజయ విభాసితులై మెలగినారు. విదేశీయుల దండయాత్రలవల్ల మాత్రమే అది క్షీణించినది. విప్లవవాదులు తమ పద్ధతుల మూలముగా యేవో ఫలములు కలుగునని చూపించుచున్నారు. సినీమాలలో ఈరంగము (రీలు) మార్చగానే ఆరంగము వచ్చునట్లు, దేశీయ పరిస్థితులలో పూర్వస్థితిని అంత సులభముగా మార్చగలుగుట సాధ్యముకాదు. దీనికి చాలాకాలము పట్టును. అంతవరకు ప్రజలను కనిపెట్టుకొని యుండవలెననిన్నీ, ప్రస్తుత ఉపవాసస్థితిలోనే మాడేవాళ్లు మాడుతూ దోచుకొనే వాళ్లు దోచుకుంటూ ఉండవలెననిన్నీ, అత్యంత శాస్త్రసిద్ధములైన ప్రణాళికల మీదనే ఈ విప్లవము నాధారముచేసి నడిపించినను సాగునో సాగదో అనుమానాస్పదముగా ఉండే మహాయుగము వచ్చేదాకా వారీ రీతినే తల్లడిల్లుచుండవలెననిన్నీ మనము త్రోసివేయుటకు వీలులేదు.

పాశ్చాత్య దేశములలోనే, యంత్రపరిశ్రమకు పరిపక్వస్థితి యేర్పడిన ప్రదేశములలోనే, యంత్ర ప్రశంసాతత్వము నశించినది. యంత్రముల యుగము గతించినది. జాతులన్నియు స్వయంతృప్తములు కాగోరుచున్నవి. స్వయంపరితృప్త దేశము తన పరిశ్రమల నన్నిటిని యే కొందరు పెట్టుబడిదార్ల చేతుల లోనికో ఒప్పచెప్పి, వారు వినియోగకుల (Consumers) ను దోచుకుంటూ ఉంటే చూస్తూ ఊరకొనజాలదు. ఒకసారి ఒకదేశము స్వయంపరితృప్త దేశముగా మారినదంటే, దేశ

శ్రేయస్సునకు సాధనభూతములైన సమస్యలలో సాధ్యమైనన్నింటిని స్వయంపరితృప్తములుగా మారుటకై విడచిపెట్టుటయే లక్ష్యమును వ్యవహార నీతియు కాజొచ్చును. భారత దేశము నేడు చేయగోరుచున్నదియు యిదే. ఇట్లే నిన్నటి వరకు భారతదేశముండెను, మరియు రేపటినుంచి యుండవలెను. ఇందుకొరకై ఇండియా తన దేశ ఆర్థిక పరిస్థితులను చక్కపెట్టుకొనవలెను, తన ఆర్థిక వ్యక్తిత్వము (economic integrity) నెట్లు గోల్పోయెనో ఆసంగతిని పరిశీలించవలెను, భారతీయులు తామెన్నడును అనుమానించియైనను ఉండని రీతిని, రాజకీయవేత్త లేనాడును ఉపన్యసించి బోధించి యుండని రీతిని భారతదేశము విజేతలకెట్లు దాస్యము చేయవలసి వచ్చెనో ఆవిషయములను పఠించవలెను.

ఒకప్పుడు ఇంగ్లాండులో సెక్రటరీ ఆఫ్ స్టేటు ఫర్ హోము అను పదవియందుండిన సర్ జాయన్సన్ హిక్సు (ఇతనే తరువాత బెంటుఫోర్డు ప్రభువైనాడు) అను ఆంగ్లేయుడు తాను మరణించే ముందర ఇందలి నిజమైనరహస్యమును ఆశ్చర్యమును కలిగించు ఈ దిగువవాక్యములలో చెప్పినాడు. "మిషనరీ మీటింగులలో ఇంగ్లీషువారు ఇండియాను నాగరీకముగా చేయుటకై వెళ్లినట్లు చెప్పుతూవుంటారు. కాని వారువెళ్లడములో అటువంటి పనికిమాలిన సంకల్పమేమీ లేదు. అది వట్టి తెలివిహీనమైన భావము. హిందూదేశపు అంగళ్లలో తమ సరకుల నమ్ముకొనుటకై వారచ్చటికి వెళ్లినారు. ఆ రీతిగా

అమ్ముకొని బాగుపడుతూ వారెంతకాలమైనా ఉండవలెను" అని చెప్పినాడు, ఇండియాకు ఇంగ్లాండుకు ఉండేసంబంధము తగాయిదా అంతా ఇందులోనే ఉన్నది. ఏలననగా, ఇండియా లేకుంటే ఇంగ్లాండు సామ్రాజ్యముగానూ ఉండజాలదు. ఐరోపాలో మొదటితరగతి బలము అధికారము చలాయించగల దేశముగానూ ఉండజాలదు. పైగా తనకు కావలసినతిండి, పని చేసుకొనుటకై ముడిసరుకు, వీనిని కొనుక్కొనుటకై రొక్కము ఈ మొదలైన వేమీలేక అసలే మాయమవుతుంది. కనుక నేడు భారతీయు లాలోచించుకొనవలసిన ప్రధానప్రశ్న యేమనగా, బ్రిటిషుసామ్రాజ్యమును శాశ్వతముగా చేయుటకై భారతీయులు కట్టెలుకొట్టేవారు నీళ్లుతోడేవారుగా ఉండి దాస్యము నిప్పటివలె చేయుచుండుట కంగీకరించి యూరకొనవలెనా, లేక, హిందూదేశమునకు పూర్ణస్వారాజ్యమును సంపాదించుటకై జాతీయపోరాటము సలిపి రానున్న ఆపత్తులనెల్ల ఢీకొనుటకై సిద్ధపడవలెనా ?

## అనుబంధము A

### ఇండో బ్రిటిషు ట్రేడు అగ్రిమెంటు, 1936.

యూనైటెడు కింగ్డములో హిజు మెజెస్టీసు గవర్నమెంటుతరఫున సర్ వాల్టరురూన్సిమనున్ను, ఇండియాగవర్నమెంటుతరఫున సర్ బి. యన్. మిత్రయున్ను అగ్రిమెంటుపై నిన్న సంతకములు పెట్టిరి. ఏభారతీయపరిశ్రమకైనను రక్షణమును కూర్చవలసినప్పుడు, ఈ సంగతిని ముందుగా టారిఫ్ బోర్డు వారి విచారణకుపెట్టుదురు. యూనైటెడుకింగ్డములో ఆ పరిశ్రమతో సంబంధముగల ప్రతిపరిశ్రమవారికిని, దానికి సంబంధించిన ఇతరపార్టీలవారికిని తమ తరఫున చెప్పుకొనగోరు విషయముల నివేదించుకొనుటకు ఇండియాప్రభుత్వము వారు పూర్ణావకాశముల నిచ్చెదురు; మరియు సముజాయిషీలు చెప్పెదురు.

ఆవిధముగా రక్షింపబడినకాలములో అట్లు రక్షింపబడిన పరిశ్రమల పరిస్థితులలో గమనింపతగిన పెద్దమార్పు లేవైనా సంభవించినయెడల, ఇండియాగవర్నమెంటువారు, హిజుమెజస్టీసు గవర్నమెంటుకోరికపైని గాని లేదా తమంతట తాముగా గాని, ఈ అగ్రిమెంటు ఆర్టికిలు 3 లో విధించబడిన సూత్రముల ననుసరించి అప్పుడు అమలులో ఉండుకున్న పన్నులు ఉచితమైనవేనా అనువిషయమున విచారణ జరిపించుటకుకూడా పూచీపడుచున్నారు. అటువంటి విచారణలో

యూనైటెడు కింగ్డమునందు దానితో సంబంధముకలిగియుండే ప్రతీపరిశ్రమవారూ యేమేమివిన్నపములు చేసుకొన్నను వాని నన్నింటినిగూర్చి పూర్ణముగా ఇండియాప్రభుత్వము వారాలో చించుటకుకూడా పూచీపడుచున్నారు.

అగ్రీమెంటు టెక్స్ట్సు (వాక్యములు) న్యూఢిల్లీ 10-1-1935

యూనైటెడుకింగ్డములో హీజు మెజస్టీసు గవర్న మెంటుతరఫున సర్ వాల్టరురూన్సిమను, ఇండియాప్రభుత్వము తరఫున సర్ బి. యన్. మిత్ర ఒట్టావా ఒడంబడికను బలపరచు టకుగాను చేయబడిన ఈ ఒడంబడికయందు నిన్న సంతకములు పెట్టిరి.

ఉపోద్ఘాతము (Preamble)

ఒట్టావా ఒడంబడిక అమలు నందున్నంతకాలమును, యూనైటెడుకింగ్డములో హీజుమెజస్టీసు ప్రభుత్వము ఇండియా ప్రభుత్వములచే చేసుకొనబడిన ఈ అగ్రీమెంటు షరతులను, దానికి బలకరముగా ఉండుటకై ఆచరించుటకు రెండుప్రభు త్వములవారును అంగీకరించుచున్నారు.

ఆర్టికిలు 1: ఇండియాదేశపు ఆర్థికసౌభాగ్యము కొరకై సమస్తవిదేశీవస్తువులపైని దిగుమతి సుంకములు విధించి భార తీయపరిశ్రమలను రక్షింపవలెననే సూత్రమును యూనైటెడు కింగ్డమునందలి హీజుమెజస్టీసు గవర్నమెంటును ఇండియాప్రభు

త్వమును ఉభయులును అంగీకరించుచు, హిందూదేశపరిశ్రమల యందును యూనైటెడుకింగ్డము పరిశ్రమలయందును, ఇతర దేశముల పరిశ్రమలందును గల పరిస్థితులనుబట్టి హిందూదేశ పరిశ్రమలకు యూనైటెడుకింగ్డము పరిశ్రమలనుండి కంటె ఇతర దేశముల పరిశ్రమలనుండి యెక్కువరక్షణ మొసంగవలెనను సిద్ధాంతమును ఉభయప్రభుత్వములవారును అంగీకరించుచు న్నారు.

ఆర్టికిలు 2 : ప్రస్తుతం ఉన్నపరిస్థితులలో ఇండియా ప్రభుత్వముయొక్క ఆదాయములో దిగుమతి సుంకములు ఒక తప్పనిసరి భాగమనియు, దిగుమతి సుంకముల పరిమితు లను నిర్ణయించవలసిన సందర్భములలో హిందూదేశపు ఆదా యసమస్యను జాగ్రతగా యోచించి అందుకు తగిన ప్రాధా న్యము నీయవలెననియు యూనైటెడుకింగ్డము నందలి హిజు మెజస్టీసు ప్రభుత్వము బాగా గుర్తించుచున్నది.

రక్షణా సూత్రములు

ఆర్టికిలు 3 : టారిఫ్‌బోర్డువారు తగిన విచారణలు సలిపిన తరువాత ఇండియా ప్రభుత్వపు అభిప్రాయము ప్రకార మే పరిశ్రమలట్టి రక్షణమునకై స్థిరమైన హక్కులు గలవని భావింతురో వానికి మాత్రమే రక్షణమునిచ్చుటకు ఇండియా ప్రభుత్వమువారు పూనుకొనగలరు. 16—2—1923 తేదిని ఇండియను లెజిస్లేటివుఅసెంబ్లీవారు అంగీకరించిన తీర్మానము

వర్గముల ప్రత్యేకరక్షణ విధాననీతి (policy of discriminating protection) ని బట్టి ఈ హక్కులేవో నిర్ణయింపబడును. 1933 సం॥ సేఫుగార్డింగు ఆక్టుప్రకారము రక్షింపబడిన పరిశ్రమలకు వర్తింపనిరీతిని మాత్రమే ఇండియా ప్రభుత్వము ఈవిధమైన రక్షణము పైవిధములైన పరిశ్రమల కిచ్చుటకు పూచీపడుచున్నది.

2. హిందూదేశములోనికి దిగుమతియైన వస్తువులను ఈదేశములో తయారైన వస్తువులతో తుల్యమగు ఖరీదులకు విక్రయించుటకై అనుకూలమగునట్లు మాత్రమే యీరక్షణ లొసంగబడును కాని అంతకుమించిన రక్షణము నీయమని ఇండియా ప్రభుత్వమువారు పూచీపడుచున్నారు. మరియు, ఈ ఆర్టికిలు సూత్రముల (Provisions) ననుసరించి, సాధ్యమైనప్పుడల్లా, యూనైటెడుకింగ్డమునుండి దిగుమతి యయ్యే వస్తువులపైని తక్కువ సుంకములనే విధించుటకు ఇండియా ప్రభుత్వమువారు పూచీ పడుచున్నారు.

3. ఈ ఆర్టికిలులోని గత రెండు క్లాజులలోని సూత్రములను అనుసరించి, యూనైటెడుకింగ్డమునుండి దిగుమతియగు వస్తువుల పైనిన్ని ఇతర విదేశములనుండి దిగుమతియగు వస్తువుల పైనిన్ని విధించబడిన సుంకముల తేడాలు (differencial margins) యూనైటెడుకింగ్డము వస్తువులకు నష్టకరమగురీతి నేనాడును మార్చబడవు.

4. ఇండియాదేశపు ఆదాయపోషణమునకై ఈ ఆర్టికిల్సులో సూచింపబడిన రక్షణసుంకముకంటె యెక్కువ దిగుమతి సుంకములను విధించుట అత్యావశ్యకమని ఇండియా ప్రభుత్వమునకు తోచినయెడల, ఆరీతిని విధించగల హక్కునకు ఈ ఆర్టికిల్సులోని పూచీలేమీ అడ్డు రాజాలవు.

రక్షణవిచారణ (Immediate Enquiry)

ఆర్టికిలు 4: ఏదైనా ఒక భారతీయపరిశ్రమకు లాభకరమైన (Substancial) రక్షణమునిచ్చే సమస్యను టారిఫుబోర్డువారి యెదుట ఇండియా ప్రభుత్వమువారు పెట్టునప్పుడు, ఆపరిశ్రమతో సంబంధముగల యూనైటెడు పరిశ్రమకు దేనికైనను తనసంగతిని తెలుపుకొనుటకై సంపూర్ణావకాశమును ఇండియా ప్రభుత్వము ఇచ్చి వారివల్లను దీనితో ప్రసక్తిగల ఇతరులందరివల్లను నివేదింపబడిన సంగతులకు ఇండియా ప్రభుత్వము జవాబు చెప్పగలదు. ఇండియాదేశములో ఈవిధముగా రక్షింపబడిన పరిశ్రమకు దేనికైనను ఈరక్షణకాలములోనే యేదైనా విశేషమైన మార్పు సంభవించిన యెడల, హీజుమెజస్టీసు గవర్నమెంటువారి కోరికపైనిగాని లేదా తమంతట తామేగాని, ఆర్టికిలు 3 నందు విధించబడిన సూత్రముల ప్రకారము అప్పటి సుంకములు యుక్తమైనవేనా అను సమస్యను విచారణ చేయించుటకుకూడా ఇండియా ప్రభుత్వమువారు పూచీ పడుచున్నారు. అటువంటి విచారణ

సందర్భమున, యూనైటెడు కింగ్డములో ఇందుతో ప్రసక్తి గల యే పరిశ్రమవారైనను తమసంగతుల నన్నిటిని తెలుపుకొన్నయెడల వానిని గూర్చి పూర్ణముగా ఆలోచింపబడునని కూడా ఇండియా ప్రభుత్వము పూచీ యిచ్చుచున్నది.

ఆర్టికిలు 5 : యూనైటెడు కింగ్డమునందలి హిజుమెజస్టీసు ప్రభుత్వమువారు తమదేశపు వాణిజ్యసంస్థలన్నిటి సహాకారమునుబడసి, హిందూదేశమునకు దిగుమతి అయ్యే యేవిధమైన తయారీ (manufactured) వస్తువులు పృథక్కరణరూపక రక్షణసుంకము (differencial protective duties) లకు ఇండియాలో పాత్రమగుచున్నవో అట్టి వస్తువులను తయారు చేయుటకు కావలసిన ముడిపదార్థముల సగము తయారైన పదార్థముల దిగుమతిని వృద్ధిచేయుటకై తగిన చర్యలను తీసుకొనుటకు జాగ్రతగా ఆలోచింతురు. హిందూదేశపు ప్రత్తిని మునపటికంటె యెక్కువగా తీసుకొను నిమిత్తము ఒట్టావా ఒడంబడిక 8 వ ఆర్టికిలు ననుసరించి తాము ఇదివరకే యెట్టిచర్యలను తీసుకొన్నారో గమనించవలెనని వారు ఇండియా ప్రభుత్వమును హెచ్చరించుచున్నారు. ఈ ప్రత్తినింకా యెక్కువగా తీసుకొనుటకుగాను వారు తమ దేశపు వాణిజ్యసంస్థలన్నిటి సహకారమును బడసి ఇండియను ప్రత్తినిగూర్చి యింకా యెక్కువ శ్రద్ధ తీసుకొందురు. ఇందుకై వారు సాంకేతికపరిశోధన (Technical research) వాణిజ్య

విచారణ (Commercial investigation) అంగళ్ల అను కూలము (Market liaison) పారిశ్రామిక ప్రచారము (Industrial propaganda) మొదలైన సాధ్యమైనన్ని ఉపాయముల నవలంబించగలరు.

ఆర్టికిలు 6 : హిందూదేశమునకు దిగుమతియగు ఇనుము, ఉక్కు అను ఆర్టికిలుకు సంబంధించిన సుంకములు 1934 సం॥ ఐరను అండు స్టీలుప్రొటెక్షను ఆక్టులో అంగీకరింప బడిన సుంకములకంటె యూనైటెడు కింగ్డమునకు తక్కువ అనుకూలములు కానంత కాలమువరకు, ఆర్టికిలు 5 నందు ఉదహరింపబడిన సూత్రము ననుసరించి, ఇండియానుండి ఇనుప గజము (Pig iron)లను యూనైటెడు కింగ్డములోనికి సుంక ములు లేకుండానే దిగుమతి చేసుకొనే సౌకర్యమును కొన సాగించుటకై హీజు మెజస్టీసు యూనైటెడు కింగ్డము ప్రభు త్వమువారు పూనుకొనుచున్నారు. అయితే 1934 సం॥ ఐరను అండు స్టీలు డ్యూటీసు ఆక్టు 2 వ సెక్షను ప్రకారము సవరింప బడిన 1894 సం॥ ఇండియను టారిఫు ఆక్టుయొక్క 3 (4), 3 (5) సబ్ సెక్షను షరతులకు మాత్రము ఇది వ్యతిరేకముగా ఉండరాదు.

ఆర్టికిలు 7 : ఈ అగ్రిమెంటుకు సంబంధించిన సమస్త విషయములలోను యూనైటెడు కింగ్డమునందలి హీజు మెజస్టీసు ప్రభుత్వమువారును, ఇండియా ప్రభుత్వమువారును ఉభయ

దేశములందలి ఈ పరిశ్రమలకు సంబంధించిన సంస్థలయొక్క నిజమైన (accredited) ప్రతినిధుల సభలయందు అంగీకరింపబడు అంత్యనిర్ణయములను (Conclusions) అగ్రిమెంటులను, నివేదికలను సర్వదా సావధానముగా విచారించుట కిందు మూలముగా ఒడబడుచున్నారు.

మోడీలీసు అంగ్రిమెంటు

ఒట్టావా ఒడంబడిక సప్లిమెంటుతో చేర్చి, ఇంగ్లాండులోని బోర్డుఆఫ్ట్రేడుయొక్క ప్రెసిడెంటు సర్ వాల్టరురూన్సిమను, లండనులో హైకమీషనరు ఫర్. ఇండియాగా ఉండిన సర్. బి. యన్. మిత్ర వీరుభయులుమధ్యను జరిగిన ఉత్తర ప్రత్యుత్తరములు ప్రకటింపబడినవి.

సర్ వాల్టరురూన్సిమను నుండి వెళ్లిన మొదటి లేఖ (Note) ఈరీతిగా నున్నది:—

"అయ్యా, కాలనీలలోనికిని ప్రొటెక్టరేటులలోనికిని యూనైటెడు కింగ్డమున్ను ఇతరవిదేశములున్ను తమతమ వస్త్రములను యెగుమతిచేయు పోటీలో యూనైటెడు కింగ్డము ప్రత్తివస్త్రములకు తదితరములకుకంటె యెక్కువ సౌకర్యమును గూర్చుటకై అవి ఇకముందెప్పుడైనను యెట్టి ప్రత్యేక చర్యల (Special steps) నైనను తీసుకొనే యేర్పాటులు జరిపేయెడల, అవి యూనైటెడు కింగ్డము ప్రత్తివస్తువుల కెట్టి

సౌకర్యముల నిచ్చుచున్నవో అట్టి సౌకర్యములనే ఇండియాలో తయారయ్యే ప్రతివస్తువులకు గూడ నిచ్చునట్లు చేయుటకై కాలనీల ప్రొటెక్టరేటుల ప్రభుత్వముల నన్నింటిని నేను పిలిపించుటకు యూనైటెడు కింగ్డమునందలి హిజుమెజస్టీసు ప్రభుత్వమువారు నాకధికారము నిచ్చినారు. 28–10–1933 తేదిని లంకాషైరు డెలిగేషను, బొంబాయిమిల్లు ఓనర్సు అసోసియేషనులమధ్య జరిగిన అగ్రీమెంటుకాని, ఆ రెండు దేశముల వస్త్రపారిశ్రామికుల మధ్యను తదనంతరము జరుగగల మరే అగ్రీమెంటుకాని అమలులో ఉన్నంతవరకు నేనిప్పుడిచ్చుచున్న పూచీ (Undertaking) స్థిరముగా ఉండగలదు."

సర్ వాల్టరురూన్సిమను లేఖ (Note) కు జబాబు నిచ్చుచు సర్. బి. యన్ మిత్ర ఇట్లు వ్రాసెను.

"ఈ తేదిగల మీరు వ్రాసినలేఖ నాకు అందినది. రానున్న కార్యక్రమములో నొకటిగా (as a general measure) రెండవ సర్చార్జీ (అదనపు ఛార్జీలు చేయుట) రాగానే, యూనైటెడు కింగ్డము ప్రతివస్త్రముల మీద దిగుమతి సుంకములు ఖరీదులను బట్టి ( advalorem ) 20% కు గాని సాదా కోరావస్త్రములమీద పౌనుకు 3½ అణాలకు గాని తగ్గించబడుననిన్ని, ఇతరవస్తువులమీద 20% తగ్గించబడుననిన్ని మీకు తెలియబరచుటకై ఇండియా ప్రభుత్వమువారు నాకు అధికారము నిచ్చినారు. అయితే, లంకాషైరు డెలిగే

షను బొంబాయిమిల్లు ఓనర్సు అసోసియేషనులమధ్య జరిగిన 28–10–1933 తేది అగ్రిమెంటు కాలము పూర్తియైన తరువాత, ఆమిగిలిన రక్షణకాలమునకు యూనైటెడు కింగ్డము వస్తువులపైని విధించవలసిన పన్నులు, అప్పటి పరిస్థితులు అంతకుముందరి అనుభవములనుబట్టి ఆధారపడియుండును. రెండవ సర్చార్జి కాలక్రమమున రావడమంటే, ఇప్పటివరకు సర్చార్జికి పాత్రమైయున్న అన్ని అయిటెములమీాదను కాకున్నను చాలా వానిపైని సర్చార్జి తీసివేయుటయనియే అర్థము.

(సం) బి. యన్. మిత్ర ”

బి. యన్. మిత్రలేఖను స్వీకరించుచు సర్ వాల్టరు రూన్సిమను ఇట్లు వ్రాసెను:—

“ ఈ తేదీగల తాము వ్రాసిన లేఖ 2 నాకు అందినది.

(సం) బి. యన్. మిత్ర ”

## అనుబంధము B.

### విదేశముల దోపిడినుండి పెర్షియా రక్షణలు (Safeguards)

5–10–1930 తేది గల ఇంపీరియల్ బ్యాంకు ఆఫ్ పెర్షియా లేఖనుండి యెత్తి వ్రాయబడినది.

పెర్షియానుండి వస్తువులను విదేశముల కెగుమతి చేయునప్పుడు వాని ఖరీదులక్రింద రావలసిన మొత్తములకై రెమిటెన్సులు సంపాదించుటకయ్యే కష్టమంతగా ఎక్సుఛేంజి కంట్రోలు కమిషనునుండి వీనికగు మారకపు రేటులను సంపాదించుకొనుట మూలముగా కలిగేది కాదు. ఎక్సుఛేంజి కంట్రోలు కమీషను తనజాబితాలో ఉన్న కొన్నివస్తువుల ఖరీదుపట్ల మాత్రమే మారకపు రేటు యెంతో చెప్పవలసిన అధికారమును కలిగి యున్నది. ఈ వస్తువుల సంఖ్య బహు స్వల్పము. పెర్షియానుండి విదేశముల కెగుమతి అయ్యే వస్తువులలో చాలాభాగము ఈ జాబితాలో ఉండనే ఉండవు. అటువంటి వస్తువులమీాద మారకపు రేటును కొనుక్కొను విషయమై యెట్టి నిర్బంధములును లేనేలేవు.

అసలు కష్టమంతయు మార్కెటులో ఉన్న విదేశీ మారకము (foreign exchange) సరఫరా, చాలాకారణములవల్ల, మిక్కిలి తక్కువగా ఉన్నది అనగా డిమాండుకు తగినంత గాలేదు. బ్యాంకులు వీనిని తమయిష్టము వచ్చినంత

మేరకు విక్రయింపజాలవు. వాటి ఖాతాలలలో వివిధ విదేశీ ఫర్మ్సుల నిలవలు లేక రావలసిన మార్గములు యెంతవరకుంటే వానికి సరిపడునట్లు మాత్రమే అవి విదేశీమారకము (exchange) ను అమ్మగలవు. ఎక్సుఛేంజి కంట్రోలు కమీషను వారి జాబితాలోఉన్న విదేశదిగుమతి వస్తువులకై విదేశీమారకము కొనుక్కొన గోరుటకై చేయబడిన దరఖాస్తులను పరీక్షించుట మాత్రమే ముఖ్యముగా ఆకమీషను యొక్క పని; అంతే కాని అసలు విదేశీమారకముతో దానికెట్టి జోక్యమును లేదు.

రిఇంబర్సుమెంటుల (ఎగుమతుల ఖరీదులను రాబట్టుకొనుట) కై ఈదిగువ మార్గములను తెలుపుచున్నాము:—

A ఎక్సుఛేంజి లా ప్యాసుచేయబడిన 1-3-1930 తేదీకి ముందరజరిగిన వ్యవహారపు ఏర్పాటులు.

B. వ్యవహారపు ఏర్పాటులు 1-3-1930 తేదీ తరువాత జరిగినను, అందుకుసంబంధించు వాణిజ్యపు సరుకు ఇంకా పెర్షియను కష్టముహౌసులో కాని పెర్షియాకు వచ్చేత్రోవలో కాని, ఇంకా పడవయెక్కకుండా కాని ఉన్నయెడల.

C. వ్యవహారపు ఏర్పాటులు 1-3-1930 తేదీ తరువాత జరిగినను అందుకుసంబంధించిన వాణిజ్యపుసరుకు అప్పటికే దేశములోనికి చేరినయెడల.

A. తరగతివ్యవహారముల విషయమున.

పెర్షియానుంచి యెంతపరిమితిగల యీదిగువ పదార్థములను విదేశములకెగుమతి చేయవచ్చునో అనుజ్ఞపొందుటకై టెహిరాన్‌లోఉన్న ఎక్సుఛేంజి కంట్రోలుకమీషనుకు దరఖాస్తుపెట్టుకొనవలెను.

1. తివాసులు, నల్లమందు, ట్రాగకాంతు అను పేరుగల ఒకవిధమైన వనస్పతి జిగురు (దీనిని మందులకును, కాలికోప్రింటులకును ఉపయోగింతురు.) మినహాగా ఇతరవస్తువులు.

2. సిల్వరు నాణ్యములు (ముఖవిలువనుబట్టి కాక అసలువెండి ఖరీదునుబట్టి పంపించేవి.)

B తరగతి వస్తువులవిషయమున.

1. ఈదేశమునుండి వాణిజ్యపుసరుకును విదేశములకెగుమతిచేయువారు, వారియెగుమతిసరుకువల్ల వచ్చేఖరీదులో 40% విదేశీమారకమునుమాత్రమే బ్యాంకులకు అమ్మవలసిన బాధ్యతను కలిగియున్నారు. అయితే, ఇందుకై వారు ఎక్సుఛేంజి జాబితాలో లేనటువంటిన్ని ఆకారణమున కమీషను వారిఅనుమతి అవసరములేనటువంటిన్ని విదేశసరుకును50%వరకు దిగుమతిచేసుకొనవలసిన వారైయున్నారు.

ఇందుకై కంట్రోలు కమీషను వారి ఆజ్ఞ అవసరము లేదు, కాని కష్టమ్సుహౌసువద్ద వారిచ్చేప్రశ్నలఫారము నొక దానిని పూర్తిచేయుటయు, ఖర్చులక్రింద హెచ్చించబడిన 10% ఛార్జీలను చెల్లించుటయుమాత్రమే అవసరము.

గమనింపు (Note):—

పెర్షియానుంచి యెవరైనా యెగుమతిచేసే సరుకునకు బదులుగా అందులో 90%సరుకును విదేశమునుండి దిగుమతిచేసుకొన్నయెడల ఆమారకము (exchange) ను బ్యాంకులకమ్మవలసిన బాధ్యతలేని కొన్నితరగతుల వాణిజ్యపుసరకులు గలవు. ఈ 90% లో 20% కు మించని మొత్తముమాత్రమే కమిషను వారి జాబితాలో కనబడువస్తువులకు సంబంధించినదై యుండవచ్చును. అయినను ఈ రకపు వాణిజ్యపు సరకులు చాలాతక్కువగా ఉండును. ఈవిధముగా ఈదేశమునుండి విదేశములకెగుమతియయ్యే వస్తువులలో సుమారు 10% కంటె అధికముగా మారకమునుత్పత్తిచేసే (exchange producing) తరగతివి కావు.

2. కంట్రోలు కమీషనుయొక్క అనుజ్ఞనుపుచ్చుకొని వెండినాణ్యములను (ముఖమూల్యమునుబట్టి కాక అసలువెండి ఖరీదుకు) విదేశములకెగుమతి చేయవచ్చును. వీనినెగుమతి

చేయుటవల్ల వచ్చేవి దేశీమారకము(foreign exchange)లో యేమాత్రమైనను బ్యాంకులకమ్మవలెనని బాధ్యతలేదు. అయితే దీనికొక షరతుమాత్రమున్నది. దీనికిసరిపడునట్లు విదేశీవాణిజ్యపు సరుకును 90% వరకు దీనికిబదులుగా వారు దిగుమతిచేసుకొనవలెను. ఈ 90%లో 45%కు మించని మొత్తము కమీషను జబితాలో చేర్చబడిన వాణిజ్యపుసరుకై యుండ వచ్చును. పైనుదహరించిన 1వ సెక్షనులో చెప్పబడిన 10% ఈ వెండియెగుమతిమీద ఖర్చులక్రింద హెచ్చింపబడదు.

C. తరగతి వస్తువులవిషయమున ;—

ప్రస్తుతం, రిఇంబర్సుమెంటు విషయమైన యెట్టిసాధ్య విధానము (practical method) న్ను లేదు. ఈ విషయ మునుగూర్చి ఇంకా చర్చించుచున్నాము. కొంచెము కాల ములో తగినసలహాను అందచేయగలమని ఆశించుచున్నాము.

వెండి యెగుమతిసందర్భమున ప్రస్తుతము 1 పౌను స్టెర్లింగుకు 60 క్రౌనులుగానున్న అఫీషలు మారకపు రేటు క్రౌనులోనున్న వెండిలోహపు విలువకు సంబంధించి యేర్పాటు చేయబడినది కాదని జ్ఞాపకముంచుకొనవలెను. ప్రస్తుతం వెండియొక్క బజారుధరనుపట్టి 1 పౌనుస్టెర్లింగును రాబట్టుకొనుటకై ఇంచుమించు 100 క్రౌను లెగుమతి చేయ వలసి యున్నది.

ఖరీదులను చెల్లించునప్పుడు వాటితాలూకు విదేశీ మారకము (foreign exchange) ను కొనుక్కొనుటకై కంట్రోలు కమీషనువారు అనుజ్ఞనిచ్చుట కధికారముగల వాణిజ్యవస్తువుల జాబితా :—

సకలవిధములైన జంతువులు.

సకలవిధములైన కఱ్ఱలు, (వంటచెరుకు సహా).

నిషా త్రాగుడుపదార్థములు (మందులకుపయోగించు ద్రాక్ష సారాయి తప్ప.)

బొగ్గు, రాక్షసిబొగ్గు.

తాజావెన్న ఉప్పుకలిపినవెన్న (చిన్నడబ్బీలలో పొందికచేయబడిన నిలవవెన్న తప్ప.)

బియ్యము.

గోధుమలు, బార్లీ, ఓట్సు ఇతర పప్పుదినుసు లన్నీ.

పిండిఆహారములు, రొట్టెలు, తాజావి యెండినవిపండ్లు.

తాజాపాలు, తోడుపెట్టినపాలు, తాజాకూరగాయలు.

ఒట్టలు, దుస్తులు, సకలవిధ శరీరాలంకార పదార్థములు (toilet objects)

సంగీతపుపెట్టెలు (instruments) వానిపరికరములు.

ముడిప్రత్తి, కకూనుపట్టు, ముడిపట్టు, వడికినపట్టు, వేష్టుసిల్కు.

సకలవిధములైన కంబళీలు తివాసీలు.

జరీపనులు, సకలవిధములైన జరీలు.

వస్త్రాలంకారములు, (embroidery) అలంకృతవస్త్రములు, వీనిలో అన్నివాూదిరులు.

సకలవిధములైన సహజ, కృత్రిమపట్టులు.

ఫోటోగ్రాఫులకు సినోమిటోగ్రాఫ్రులకు కావలసిన సామానులు.

ముడి, రద్దు (waste) సిల్కుదారములు.

ఆటవస్తువులు, బొమ్మలు మొదలైన విజ్ఞానకరవస్తువులు.

ఇమిటేషననగలు, పేకదస్తాలు (playing cards).

సాధారణలాంపులు తప్ప తక్కిన గృహాలంకారసామానులు (furniture).

నగలు, ఇతరవిలువగల లోహరచిత వస్తువులు.

కళావిషాయకవస్తువులు (పూర్వకాలము నాటివి)

సకలవిధములైన సువాసనద్రవ్యములు.

ఎండపెట్టిన లేక ఉప్పువేసిన ముడితోళ్లు, మెత్తని బొచ్చుతో కూడిన చర్మములు.

సకలవిధములైన రాళ్లు, ముత్యములు కెంపులతో సహా.

సకలవిధములైన కూజాలు పోర్సిలేను వస్తువులు.

వాసనసబ్బులు.

గాజులు చూచుకొనే అద్దములు.

గాజుతో చేయుబడిన వస్తువులన్నీ.

సకలవిధములైన బండ్లు రథములు.

7—10—1930 తేదిగల ఇంపీరియలు బ్యాంకు లేఖనుండి యీ దిగువ భాగమెత్తి వ్రాయబడినది.

పై లేఖయొక్క రెండవపుటలోని రిమార్కుల విషయమై కంట్రోలు కమీషను ఈదిగువరీతిని నిశ్చయించినది. 1—3—1930 తేది తరువాత ఆర్డరు ఇచ్చిన సామానులు ఆ తేదీకి 22—7—1930 తేదికిమధ్య నెప్పుడైనను ఈ దేశము చేరినట్లు కంట్రోలు కమీషనుకు రుజువుపరచి నట్లయితే అటువంటి వస్తువులు యెగుమతి వస్తువులలో 50% పరిమాణము షరతును తృప్తిపరచవలెనను బాధ్యతనుగూర్చి, ఆవస్తువులు తివాసీలు నల్లమందు ట్రాగకాంతు జిగురుకాని యెడల, కమీషనువారు ఆలోచింతురు. (5—10—1930 తేదిగల మాలేఖ 2 పుటలోని సెక్షను B (1) చూడుడు)

ఇక్కడనుండి యెగుమతిఅయ్యే వెండిలో 90% కు సరిపడునట్లు విదేశములనుండి దిగుమతియగు పదార్థముల వెలయుండవలెనను బాధ్యతనుగూర్చి కూడా కమీషనువారు

ఆలోచింతురు. 5—10—1930 తేది గల మాలేఖ 2 వ పుట లోని సెక్షను B (2) ను చూడుడు.)

1—3—1930 తరువాత ఆర్డ రియ్యబడినటువంటియు, 22—7—1930 లోగా పెర్షియాకు చేరినట్టియు వాణిజ్యపు సరుకుయొక్క ఖరీదును రాబట్టుకొనుటకై సూచనలు సాధనములు కాగలవు (5—10—1930 తేది మాలేఖ 2 వ పుటలోని సెక్షను C ని చూడుడు.)

5—10—1930 తేది గల మాలేఖ 2 వ పుటలోని B సెక్షను క్రింద వివరింపబడిన ఎక్స్పోర్టు రెగ్యులేషనులు జూలై 22 వ తేదిని అమలుకు వచ్చినవి కనుక ఆ తేది ఇచ్చట ఉదహరించబడినది. కనుక 22—7—1930 తేది తరువాత ఈదేశమునకు వచ్చిన దిగుమతులు ఈరెగ్యులేషనుల క్రిందకే వచ్చునని భావించవచ్చును.

# అనుబంధము C

## ప్రభువులసభవారి పెద్దవ్యవహారపదవులు

### (1928 నాటి అంకెలు)

| వరుస నెంబరు | సంస్థలు (ఇంటరెస్టులు) | మొత్తం కంపెనీల సంఖ్య | ప్రభువులు డైరక్టర్లుగా ఉన్న కంపెనీల సంఖ్య | చెయిర్మనులు గవర్నరులు లేక డిప్యూటీ చైరమనులుగా ఉన్న వారి సంఖ్య | షరా |
|---|---|---|---|---|---|
| 1 | వ్యవసాయకంపెనీలు | 7 | 6 | ... | |
| 2 | బ్యాంకింగు | 93 | 44 | 14 | ఒక బ్యాంకు 9 డైరక్టర్లను, కొన్ని అయిదుగురను, కొన్ని ముగ్గురను కలిగియున్నవి. |
| 3 | సారాయివండుట, వడపోయుట | 30 | 22 | 12 | |
| 4 | సిమెంటు కట్టడముల సరుకులు మొదలైనవి | 9 | 5 | ... | |
| 5 | కాలువలు | 9 | 5 | . | |
| 6 | కెమికల్సు (రసాయనద్రవ్యములు) | 36 | 30 | 14 | |
| 7 | ప్రత్తిపండించుట | 5 | 3 | ... | |
| 8 | విద్యుచ్ఛక్తి, ఇతరశక్తులు | 26 | 20 | 6 | |
| 9 | డాకులు | 9 | 9 | ... | |
| 10 | ఇంజనీరింగు, బండ్లుచేయించుట | 44 | 38 | 8 | |
| 11 | విలాసములు | 10 | 9 | 4 | |
| 12 | ఆర్థికములు | 61 | 44 | . . | ఒకకంపెనీ 5 గురు డైరెక్టర్లను, 4 గు ముగ్గురేసి డైరక్టర్లను కలిగియున్నవి. |
| 13 | ఆహారకంపెనీలు | 17 | 15 | 6 | |
| 14 | గ్యాసుకంపెనీలు | 6 | 5 | . | |
| 15 | హోటేళ్లు, రెస్టురెంటులు మొ॥ | 10 | 10 | | |
| 16 | భీమా | 131 | 68 | 29 | ఒకకంపెనీ 10 డైరెక్టర్లను, 2 ఆరుగురను1-5గురను, 4-నాలుగేసి డైరక్టర్లనుకలిగియున్నవి. |
| 17 | ఇనుము, బొగ్గు, ఉక్కు | 78 | 70 | 37 | |
| 18 | భూమికంపెనీలు | 68 | 64 | ... | 64 కంపెనీలలో 21 భూమి (landed) యిస్టేటులు |
| 19 | మర్చంటు అండు ట్రేడింగు కంపెనీలు | 8 | 8 | 6 | |
| 20 | లోహములు | 9 | 9 | 5 | |
| 21 | భూమినితొలిచి రాళ్లు, బంగారం, వజ్రములు గనులనుండి తీయుట. | 68 | 58 | 21 | |
| 22 | మోటార్లు సైకిళ్లు, వగైరా | 12 | 12 | 6 | |

బ్రిటీషుసామ్రాజ్యము (బ్రిటను)

అనుబంధము 9

## అనుబంధము C

## ప్రభువులసభ వారి పెద్దవ్యవహారపదవులు

## (1928 నాటి అంకెలు)

| వరుసనంబరు | సంస్థలు (ఇంటరెస్టులు) | డైరెక్టరు స్థానములు | ప్రభువుల సభవారాక్రమించిన స్థానములు | చెయిర్మనులు గవర్నరులు లేక డిప్యూటీ చైరుమెనులుగా ఉన్న వారి సంఖ్య | షరా |
|---|---|---|---|---|---|
| 23 | వార్తాపత్రికలు వగైరా | 19 | 19 | 12 | |
| 24 | నూనె | 73 | 73 | ... | ఒకనికి 45 డైరక్టరు పదవులున్నవి. అతను విస్కౌంటు బియరుస్టెడ్. |
| 25 | పేపరు తయారుచేయుట | 6 | 6 | ... | |
| 26 | తోటలు (తేయాకు, రబ్బరు వగైరా) | 20 | 18 | 9 | |
| 27 | రెయిల్వేలు | 67 | 45 | 25 | ఈ కంపెనీలలో 29 సముద్రములు దాటిన దేశములలో (overseas) సంబంధమైనవి. |
| 28 | నౌకానిర్మాణము | 8 | 8 | ... | |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 29 | నౌకలు | 72 | 50 | 36 | ఒకడు 42 కంపెనీలలో డైరక్టరు అతను కిల్సాంటి ప్రభువు |
| 30 | టెలిగ్రాఫులు, టెలిఫోనులు, క్యేబిలువగైరా | 22 | 18 | 4 | |
| 31 | వస్త్రపరిశ్రమలు | 13 | 13 | 4 | |
| 32 | ట్రాము వేలు, అమ్నిబస్సులు వగైరా | 10 | 9 | 5 | |
| 33 | ట్రస్టులు | 48 | 41 | 17 | |
| 34 | వివిధకంపెనీలు | 72 | 67 | 19 | |

లండను, 12—7—1937 తేది గల రూటరు సందేశము ఈవిధముగా నున్నది.

“ పాలస్తైనును విభజింపవలెనను క్రొత్త ప్రపోజలు పైని క్రోధపూరితులైన అరబ్బులు, ఆవిభజనము కాని పూర్తి యైనట్లయితే, మధ్యధరాసముద్రమునుండి హిందూ మహాసముద్రమువరకు గల దేశములందంతటను బ్రిటిషు ప్రతికూల బహిష్కారోద్యమమును కొనసాగింపవలెనని ఉద్యుక్తులైనారు. ”

---